# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



నవంబరు 1955

సంపుటము 32 : : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# డాల్డా నాకు మంచిది

**అందరికీ మంచిది**
**ఎందుకంటే అది శుద్ధమైనది**

డాల్డా తయారుచేయబడునపుడు చేతితో తాకబడదు మరియు దానిని శుద్ధముగాను, తాజాగాను ఉంచుటకు గాలిచొరని సీలు డబ్బాలలో నింపబడును.

**అందరికీ మంచిది**
**ఎందుకంటే అది పుష్టికరమైనది**

అతి శ్రేష్ఠమైన కూరగాయల నూనెలే డాల్డాను తయారుచేయుటకు ఉపయోగించబడుతవి — అది ఆరోగ్యాన్ని కలిగించు విటమినులు 'ఎ' మరియు 'డి'లనుకూడ కలిగియున్నది.

డాల్డా వనస్పతి బిడ్డలకు ఎదుగుటకు, శక్తికి అవసరమగు తాజా క్రొవ్వుపదార్థాలను యిస్తుంది. వంటనుగూర్చి ఉచిత సలహాకొరకు, ది డాల్డా అడ్వైజరీ సర్వీస్, ఇండియా హౌస్ (జి.పి.ఒ.కి ఎదురుగా), బొంబాయి 1కి వ్రాయండి.




భారతదేశంలో అన్నిచోట్లా ½ పౌను; 1 పౌను; 2 పౌన్లు; 5 పౌన్లు మరియు 10 పౌన్లు డబ్బాలలో దొరకును.

## డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది—
ఖర్చు తక్కువ

HVM. 235-X52 TL

# విషయానుక్రమణిక

## నవంబరు 1955


| | | |
|---|---|---|
| సుప్రభాతము | దాశరథి ... | 1 |
| రాజశేఖరకవి | శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు ... | 5 |
| రాష్ట్రాల పునర్విభజన | శ్రీ పి. శ్రీరాములు ... | 11 |
| శిల్పాలలో కల్పన | 'ధనిష్ఠ' ... | 19 |
| ధాన్యకటకము | శ్రీ పి. యస్. అవధాని ... | 33 |
| సంగనాచి | "కావ్యశ్రీ" ... | 36 |
| ద్రౌపది మాతృహృదయము: భారత భాగవతావిష్కరణములు | శ్రీ యస్వీ. జోగారావు ... | 48 |
| వానరహస్తం | శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి... | 52 |
| కోహలుని నాట్యశాస్త్రము | శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి ... | 65 |
| జ్వలితజ్వాల | 'ఉషశ్రీ' ... | 69 |
| దీర్ఘరాత్రం | 'ఆరుద్ర' ... | 87 |
| కలగూరగంప | ... | 91 |
| గ్రంథ విమర్శనము | ... | 97 |


త్రివర్ణ చిత్రము: అభిమానిని—చిత్రకారిణి: శ్రీమతి సరళా రామన్

ద్విశక్తిగల..................



# మోబిల్‌గ్యాస్

## వాడి మీ డబ్బుకి అధిక ఇంజను శక్తిని పొందండి!

మీ కారు ఇంజను కనీసము ఐదు ముఖ్య కారణాల ద్వారా శక్తిని పోగొట్టుకోవచ్చునని ఇంజనీర్లు చెబుతారు. ప్రత్యక్షముగా, పెట్రోలులో ఒకటే అడిటివ్ చేరుట వలన యీ బాధలన్నిటిని సరిచేయలేదు.

ఇప్పుడే ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ వాడుట ప్రారంభించండి. మోబిల్ పవర్ కాంపౌండ్‌గల పెట్రోలు ఇది ఒక్కటే. ఈ పవర్ కాంపౌండును అల్లరి చిల్లర అడిటివ్ అనుకోకండి. ఇది అనేక అడిటివ్‌ల అత్యధిక శక్తిగల మిశ్రమము. ఇంత శక్తిగల మిశ్రమము ఏ పెట్రోలులోనూ ఇప్పటివరకు చేర్చబడలేదు.

ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ ఏ యితర రకపు పెట్రోలుకన్న ఎక్కువ ఇంజను బాధలను సరిచేయును. ఇంజను హెచ్చు శక్తిని యిస్తుంది. మోబిల్‌గ్యాస్ మీ డబ్బుకి అధిక విలువ నిచ్చును. కనుక దీనిని వాడుట ప్రారంభించడము మీకు లాభదాయకము.

ఎగురుచున్న ఎఱ్ఱని గుఱ్ఱపు
చిహ్నముగల చోట
దొరకుతోంది!





ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ వాడుటవలన ప్రతి గాలనుకు ఎక్కువ మైలేజీ లభిస్తోందని టాక్సీ - డ్రైవర్లు అనుభవమునుండి చూస్తున్నారు. దీనిని ఎంతోమంది వాడుటలో ఆశ్చర్యము లేదు!

స్టాండర్డ్-వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)

# సుప్రభాతము

దాశరథి

తెలుగు ఇక్ష్వాకులలో తొలిరాజు శాంతమూలుడు తన ప్రియాంగనయగు కుసుమలతను ఒకనాటి ఉదయమున నిద్ర లేపి ఆమెకు గల లక్షహాలదాన సంకల్పము నెరుగుట :

*　　　*

ఉదయాద్రి బుజమెక్కి ఒకడు నవ్వేను చూడు
　　　భూ దివమ్ములు వెల్గు పూలు పూయ,
ఉవిద తామరబుగ్గ నెవడో ముద్దిడె చూడు
　　　మనసులో వలపు చందనము రాయ,
చిమ్మచీకటి రైక చించె నెవ్వడో చూడు
　　　కాంతి గోళాలు బంగారు పోయ,
కనురెప్ప దుప్పటీ కప్పలాగె నెవండో
　　　వెలుగు లోకాలు తల్పులను తీయ,
వేయి చేతుల ధరణిని పిలిచి పిలిచి
కౌగిలించె నెవండో శృంగారి చూడు,
కానబడరాని దివ్యలోకాలు చూపి
తాను కనుమూయు లోకబాంధవుడు చూడు.

వీడటో నిద్రాణ పృథివి కన్నులమీది
　　　చీకటి బరువు పో జిమ్మువాడు,
ఈతడేనా తమో భూతమ్ము సిగలోన
　　　మందారమాలిక మలచువాడు,
ఈతడేనటవె జీమూతమ్ములను పెంచి
　　　జగతిపై ముత్యాలు చల్లువాడు,
ఈతడేనా జగద్ధితముకై గగనాన
　　　కాలికి బలపమ్ము కట్టి తిరుగు,

ఈతడే కావచ్చు ఇంద్ర దిశకు
పశ్చిమాశకు నడుమ రేబవలు నడచి
ఒకరి వృత్తాంత మొక్కరి కొప్పజెప్పి
స్నిగ్ధ బంధమ్ము కూర్చెడి స్నేహితుండు.

ఇతడు లేకున్నచో ఏది పద్మాంగనా
ఫాలాన గోరోచనా లవమ్ము?
ఇతడు రాకున్నచో ఏది భూభామినీ
గల్ల భాగాన బంగారు వన్నె?
ఇతడు లేకున్నచో ఏది దిక్కామినీ
తనువుపై పట్టు పీతాంబరంబు?
ఇతడు పోకున్నచో ఏది నీలాకాశ
కచపాశమున చంద్రఖండశోభ?
ఈతడే కాదె మన హృదయేప్సితమ్ము;
ఇతడు లేకున్న జగమెల్ల ఇరులె సుమ్ము,
సుప్రభాతమ్ము లెమ్ము కంచుకము తొలగ
సర్దుకొమ్ము నిద్దురవీడి సాగి రమ్ము.

వైహికారోగ్యమునె గాక తన కరాల
హృదయమందలి రుజనెల్ల ఎత్తివైచి
ఆత్మ కానందమును కూర్చునట్టి వైద్యు
డతని కభివాద మొనరింతు నంజలింతు.

పైపై బ్రాకి నభో మహాభవన శుంభద్గోపురాగ్రానకున్
దాపై ఆపయి క్రిందుక్రిందులయి తా నంభోధి నంతర్హితుం
డై పూర్వాశకు నశ్వముల్ నడపి ఘోరాంధ్యమ్ము మాయించువా
డాపద్బాంధవు డేగుదెంచె నదె లెమ్మా! సుప్రభాతమ్మనన్.

చండ్రనిప్పుల పెనుగోల సాచి మొత్తి
గిరగిరన్ ద్రిప్పినట్లు రాతిరియు బవలు
దశదిశా భిత్తిభాగాలు తాకి తాకి
తరలి వచ్చెడు చండ మార్తాండు గనుము.

# సుప్రభాతము

చేతనమ్ములకెల్ల సంప్రీతిగూర్చి
బీజములనుండి మొక్కలు వెలికి తీసి
తీవెలందున పుష్పాలు ప్రోవుబోసి
జగతికి విలాసమును గూర్చె సౌరమూర్తి.

కులుకుం దామరకన్నె నెన్నొసటిపై గోరాడు గోరోచనా
తిలకం బెంతటి కాంతి చిమ్మెడినొ దిగ్దేశమ్ములన్ రత్నరా
శులు భాసించెను కోటి దీపములు సంశోభించుచందాన ; క
న్నొక్కలకుల్ కాంతిలలెమ్ము భాస్కరుని చక్షుః పతుపాతమ్మునన్.

ఎన్నడో ఇల్లెక్కి ఎల్గెత్తి కూసెను
    కొమరయ్య బంగారు కోడిపుంజు
ఎప్పుడో ఆకాశ మెక్కి జండాలెత్తి
    వెడలిపోయెను పెద్ద వేగుజుక్క
ఎంతకాలం బాయెనేమొ చందురు డేగి
    పడమటింటను ప్రక్కపరచి పండి,
ఎంతసేపాయెనో ఇరుల నీలాంబరం
    బుతికి మాలిన్యమ్ము నూడ్చివేసి
ఇంక నిద్దురపోయెద వేమె, సుదతి !
ఇరులె కురులయి పడి మొగమెత్తనీక
బరువుగా నిన్ను నిద్రతో బాధపెట్టు;
తొలగద్రోచితి లెమ్ము, మత్తువిడి రమ్ము.

కృష్ణవేణీపాద కింకిణీ నినదంబు
    మనసులో నూత్న నిస్వనము రేప,
ఉదయ మందానిలమ్మొలసి నిస్తబ్ధతా
    భారమ్ము తొలగించి పర్వులెత్త,
సింహాకేశనపంక్తి చిట్టు బుట్టాడుచు
    కోట గోడలపైన కుస్తరింప
రత్నత్రయాలాప రమ్య విహారమ్ము
    లాత్మకారోగ్యమ్ము నందజేయ,

చేతనములు విలాసింప చేతులెత్తి
అందమైన ఉషస్సు నే డరుగుదెంచె
కుసుమలత వీవు నా మనః కుంజమందు
పూలు పూయగలెమ్ము హస్తాలు సాచి.

దూరాన కృష్ణవేణిక
పారెడి చప్పుడులు చెవుల పర్వెను, ప్రత్యూ
షారుణ పాదసహస్రము
దారుణముగ తన్నె నంధతమసము తలపై.

అని శాంతమూల నరపతి
తన కాంతామణిని లేపుతరి మేలుకొనెన్
కను తెరపుల మెయి విరుపుల
ఇనుమిక్కిలి వచ్చు ఆవులింతలతోడన్.

గిరిశృంగంబుల జారు శ్వేత జలదైకీభూత చేలాంచలం
బురు వక్షోజయుగమ్ము జారి ప్రభుపాదోపాంతమం దాడగా
కురులల్లాడగ అర్ధమీలిత దృశా కోణమ్ములన్ జూచుచున్
తరుణీరత్నము సొంపు గూర్చినది నిద్రాసుందరీత్వమ్మునన్.

సెజ్జనిండ పూలు చిమ్మి జీరాడగా
జుట్టు దులిపి కొప్పు పెట్టుకొనియె,
కుచ్చెళులను పోసి కొంగు గిఱ్ఱున త్రిప్పి
ఇట్టె తాను కోక చుట్టుకొనియె.

కురులు పైకి ద్రోచి గోరోచనా తిల
కమ్ము చిట్టివ్రేల కలిపి పెట్టి
అద్దమవల వైచి అందె ఘల్లున మ్రోయ
ప్రభువు పాదములకు పడతి మ్రొక్కె—

మరుని చాప మటుల తరుణి వంగినయంత
బాహువులనుబట్టి ప్రభువు లేపె,
లేచి నిలచినంత లికుచ వక్షోజాత
మదను పూలబాణమై స్ఫురించె.

సశేషము

# రాజశేఖరకవి

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

కావ్యంలోని సౌందర్యాంశలను కొలిచి, ఉత్తమ మధ్యమ మాధమ కావ్యాలను గుర్తించేందుకు కొన్ని ప్రమాణాలను నిర్ణయించే అలంకార శాస్త్రం భారతీయుల విలక్షణమైన ఆస్తి. భిన్నప్రాంతాల్లో, భిన్నకాలాల్లో పుట్టినవారైనప్పటికీ, ఈ శాస్త్రనిర్మాతలందరూ ఒకే పరిభాషనీ, ఒకే సంప్రదాయాన్నీ అనుసరించి, కలిసికట్టుగా కృషిచేసి, అన్యదేశీయులకు ఈర్ష్యాస్పదమైన ఈ అలంకారశాస్త్ర నిధిని భారతీయులకు సేకరించిపెట్టారు.

భరతముని మొదలు పండితరాజువరకు వచ్చిన ఆలంకారికుల మణిహారంలో రాజశేఖరుడు కొలికిపూస అనలేముగాని, ఒక మహోజ్జ్వలమైన మణి అని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చును. ఈయన వ్రాసిన కావ్యమీమాంస ధ్వన్యాలోకాదుల వలె కావ్యతత్త్వనిరూపణకై యత్నించి, ఒక ప్రత్యేక సిద్ధాంతాన్ని ప్రతిపాదించకపోయినా, కవులకూ, సహృదయులకూ ఉపకారకములైన బహువిషయాలను చర్చించి, అమూల్యనిర్ణయాలను ప్రకటించిన ఒక చిన్న కవిజనవిజ్ఞానసర్వస్వం. రాజశేఖరునికంటె అర్వాచీనులైన హేమచంద్రుడూ, వాగ్భటుడూ, క్షేమేంద్రుడూ మొదలైన ప్రసిద్ధాలంకారికులే యెందరో గ్రంథచౌర్యదోషానికికూడా వెనుకాడక, కావ్యమీమాంసలోని కొన్ని భాగాలను తమగ్రంథాలలో చేర్చుకొనడమే ఈగ్రంథ ఆకర్షణకు ప్రబల తార్కాణం.

## కాలము; కులగోత్రాదులు

తొమ్మిదవ, పదవశతాబ్దాల సంధికాలంనాటివాడు రాజశేఖరుడు. కన్యాకుబ్జాన్ని పాలించిన మహేంద్రపాలుని ఆస్థానంలో రాజగురువుగా ఈయన వున్నాడు. ఈయన బ్రాహ్మణుడో, క్షత్రియుడో — ఇదమిత్థమని తెలియదు. రాజగురువు కనుక బ్రాహ్మణుడేనని కొందరూ, ఈయనభార్య అవంతిసుందరి క్షత్రియాంగనగా కనిపిస్తున్నందువల్ల క్షత్రియుడేనని కొందరూ అంటున్నారు.

"చాహుఅణ కుల మౌళి మాలిఆ
రాఅ సేహరకఇన్ద గేహిణీ"

అని తనభార్యనుగూర్చి ఆమె క్షత్రియకులమైన 'చాహువాణ' కులానికి మౌళిమాలిక అని యీయన చెప్పుకున్నాడు.

రాజశేఖరుడు యాయావర వంశీకుడు. కొందరీయనను అసలు పేరు విడిచి యాయావరనామంతోనే నిర్దేశించారు. "యాయావర కవే ర్వాచో మునీనా మివ వృత్తయః" అన్నాడు — ధనపాలమహాకవి. ఈయన కుటుంబం విద్వత్కుటుంబం. ఈయనతండ్రికి ముత్తాత అయిన అకాలజలదుడు మహాకవి.

"అకాలజలదేందో స్సా హృద్యా వచనచంద్రికా।
నిత్యం కవిచకోరై ర్యా పీయతే నచ హీయతే॥"

ఆ కవిచంద్రుని వాక్కులనే వెన్నెలలను నిత్యం కవిచకోరాలు త్రాగివేస్తున్నా, అవి తరగవట! ఆయన శ్లోకాలను కొన్నిటిని కాదంబరీరాముడనే కవి తన నాటకంలో వాడుకున్నందువల్ల ఈశ్లోకం పుట్టిందని ప్రసిద్ధి. అకాలజలదుడేకాక, సురానందుడూ, తరళుడూ, కవిరాజూ — మొదలైన యెందరో ప్రసిద్ధ సంస్కృతకవులు రాజశేఖరుని యాయావర వంశంలోనివారే! ఈయన తండ్రి దుహికుడనే అమాత్యశేఖరుడు. తల్లి శైలవతి. భార్య అవంతిసుందరి: స్వయంగా ఒక అలంకారగ్రంథాన్ని రచించిన గొప్ప విదుషి. ఆమెరచన యిప్పుడు మనకు ఉపలభ్యం కావడంలేదు. కాని అనేకస్థలాలలో కావ్యమీమాంసలో రాజశేఖరుడు "ఇత్యవంతి సుందరీ" అంటూ ఆమె మతాన్ని ఉదాహరించాడు.

## కావ్యమీమాంస

మొత్తం 18 అధికరణాలతో కూడిన గ్రంథం కావ్యమీమాంస. అయితే, మొదటిదైన కవి రహస్యాధికరణం మాత్రమే మనకు లభించినది. మిగిలిన 17 అధికరణాల గ్రంథాన్ని కూడా రాజశేఖరుడు వ్రాసి ఉంటాడని ఊహించటానికి కొన్ని ఉపపత్తులు మాత్రం ఉన్నవి. రీతులను గూర్చి చెబుతూ "రీతయస్తు తిస్రః తాస్తు పురస్తాత్" (రీతులు మూడు. వాటినిగూర్చి ముందు చెబుతాను) అన్నాడు. ఇలాగే-ఆహార్యబుద్ధి అయిన వానికి కలిగే పారవశ్యానుభవాన్ని గూర్చి "త మౌపనిషదికే వక్ష్యామః"—(ఆ విషయం ఔపనిషదికాధికరణంలో చెప్పగలను) అన్నాడు. ఉభయాలంకారికాధికరణంలోవి అని ఊహించదగు ఉపమాలంకారాన్ని నిరూపించే రెండు అనుష్టుప్పులు రాజశేఖరునివిగా అలంకారశేఖరం ఏకాదశ మరీచిలో ఉదాహృతములైనవి. మరో శ్లోకం కూడా-అది ప్రాయశః వైనోధికాధికరణంలోది అయి ఉండవచ్చు. ఆ గ్రంథంలోనే ఏకోనవింశతి మరీచిలో ఉదాహృతమైంది. వీటినిబట్టి రాజశేఖరుడు మిగిలిన 17 అధికరణాలను కూడా వ్రాశాడేమో, ఏనాటికైనా అవి కూడా బయటపడే అదృష్టం భారతీయులకు ఉండేమో అనే ఆశ కలుగుతున్నది.

మనకు లభించిన ఈ కవి రహస్యాధికరణం 18 అధ్యాయాల గ్రంథం. కౌటిల్య, వాత్స్యాయనాదుల గ్రంథాలవలె సూత్రప్రాయమైన శైలిలో ఇది నడిచింది. కావ్య పురుషోత్పత్తీ, కారయిత్రీ, భావయిత్రీ శక్తిభేదాలూ, కావ్యపాకం, పదవాక్య వివేకం, కాకువు, కవిచర్య-రాజ చర్య, గ్రంథ చౌర్యం, కవి ప్రభేదాలు, దేశ విభాగం, కాల విభాగం మొదలైన ఆకర్షకములైన విషయాల నెన్నిటినో గూర్చి రాజశేఖరు డీ కవి రహస్యాధికరణంలో చర్చించాడు.

కావ్యమీమాంసా శాస్త్రాన్ని మొదట శ్రీకంఠుడు పరమేష్ఠి, వైకుంఠ ప్రభృతులైన తన చతుష్షష్టి శిష్యులకు బోధించాడట! పరమేష్ఠి తన పుత్రులకా శాస్త్రాన్ని బోధించాడు. అందులో సారస్వతేయుడైన కావ్యపురుషునికి ఆయన కావ్య విద్యా ప్రవర్తన బాధ్యతను అప్పజెప్పాడు. ఆ కావ్య పురుషుడు సహస్రాక్షునికి కవి రహస్యాధికరణం, ఉక్తి గర్భునికి ఔక్తికాధికరణం ఇలా దివ్యులలో ఒక్కొక్కరికి ఒక్కొక్క అధికరణం బోధించాడు. సహస్రాక్షాదులు ఆయా అధికరణాలను గ్రంథస్థం చేశారు. గ్రంథస్థం అయిన ఆ కావ్య విద్య ప్రకీర్ణం కావడం వల్ల కొంత భాగం ఉచ్ఛిన్నమైనదనీ, అందుచేత అష్టాదశాధికరణి అయిన ఈ కావ్యమీమాంసని తాను వ్రాయ సంకల్పించినాననీ రాజశేఖరుడు మొదటి అధ్యాయంలో చెప్పుతున్నాడు.

## కావ్యపురుషుని కథ

రాజశేఖరుడు వర్ణించిన కావ్యపురుషుని కథ హృదయంగమమైనది. పుత్రార్థిని అయి సరస్వతీదేవి ఒకప్పుడు హిమాలయంమీద తపస్సుచేసింది. బ్రహ్మ ప్రీతుడై కావ్యపురుషుడనే కొడుకును ఆమెకు ప్రసాదించాడు. ఒకసారి బ్రహ్మర్షి, బృందారకుల వివాదములో నిర్ణేత్రిగా ఉండేందుకు సరస్వతీదేవి బ్రహ్మలోకానికి పయనమైంది. కావ్యపురుషుడు "నేనూ వస్తా" నని తల్లివెంట పడ్డాడు. ఆమె "పరమేష్ఠి అనుమతి లేదు - నీవు బ్రహ్మలోకానికి రాకూడదు నాయనా!" అనిచెప్పి వెళ్ళిపోయింది. రోషంతో వెనుదిరిగి పోనున్న కావ్యపురుషుని చూచి పార్వతీదేవి జాలిపడింది. అతనిని ఆనందపరచడానికి సాహిత్య విద్యావధువనే సుందరిని సృజించి భార్యగా అతనికి ఇచ్చింది. ఆ ఇద్దరూ దిక్కు దిక్కులా సంచారం చేశారు. కావ్యపురుషుని మనస్సును ఆకర్షించడానికి ఆ సాహిత్య విద్యావధువు దుస్తులలోను, కరచరణాది విన్యాసాలలోను వివిధ పద్ధతులను ప్రదర్శించింది. చివరకు యాత్రాంతంలో కావ్యపురుషు డామెపై ఆకృష్టుడై వత్సగుల్మం అనే విదర్భదేశస్థమైన నగరములో గాంధర్వరీతిని ఆమెను వివాహమాడాడు. భర్తృమనోరంజనకై సాహిత్యవిద్యావధువు వివిధ ప్రాంతాలలో ధరించిన దుస్తులు, ప్రదర్శించిన విన్యాసాలు అక్కడి ప్రజల కనుకార్యములైనవి. ఆ వివిధ వృత్తులు, రీతులే - పాంచాలీ, సాత్వతీ, గౌడీ - ఇత్యాదిగా తత్తద్దేశ నామాదులతో ప్రసిద్ధములైనవట!

## గ్రంథ చౌర్యము

గ్రంథచౌర్యాన్ని గూర్చి చర్చించే కావ్యమీమాంసలోని 11 వ అధ్యాయం ఈ గ్రంథానికి మకుటాయమానమైనది.

"నాస్త్యచౌరః కవిజనో
నాస్త్యచౌరో వణిగ్జనః ।
స నన్దతి వినా వాచ్యం
యో జానాతి నిగూహితుమ్ ॥"

అని రాజశేఖరుని నిర్ణయం. కవులలోను, వర్తకులలోను చౌర్య మెరుగనివారెవరూ ఉండరట! అయితే చేసిన చౌర్యాన్ని కప్పిపుచ్చుకోగల నిపుణుడే ధన్యుడంటాడు.

"సంవాదో హ్యన్యసాదృశ్యం
తత్పునః ప్రతిబింబవత్ ।
ఆలేఖ్యాకారవత్తుల్య
దేహివచ్చ శరీరిణామ్ ॥"

అని మూడు విధాలైన గ్రంథ సాదృశ్యాలను ధ్వనికర్త ఆనందవర్ధనుడు పేర్కొన్నాడు. బింబ ప్రతిబింబముల వంటి సాదృశ్యమూ, ఆలేఖ్య ఆకారములవంటి సాదృశ్యమూ, సమానరూపులైన మనుష్యుల మధ్య ఉండే సాదృశ్యమూ. ఈ మూడింటిలోను మొదటి రెండూ తుచ్ఛములనీ, మనిషిని పోలిన మనిషివలె ఉండే గ్రంథసాదృశ్యం మాత్రమే స్వీకార్యమనీ ఆయన అన్నాడు. రాజశేఖరుడీ గ్రంథసాదృశ్యాలను మరింత సూక్ష్మంగా వివేచనచేసి పద, పాద, అర్థ, వృత్త, ప్రబంధ భేదాలతో ఐదు విధాలైన సాదృశ్యాలను సోదాహరణంగా నిరూపించాడు. సంస్కృత సాహిత్యాన్ని తరచి తీసినట్లనిపించే అత్యుత్తమ శ్లోకాలను లక్ష్యాలుగా ఈయన యిస్తాడు. గ్రంథ చౌర్యంలోని స్వీకార్య, పరిత్యాజ్య భేదాలను తలస్పర్శిగా విచారించి చివరకు ఈయన అంటాడు:

"పుంసః కాలాతిపాతేన
చౌర్యమన్యద్విశీర్యతి ।
అపి పుత్రేషు పౌత్రేషు
వాక్చౌర్యం చ న శీర్యతి ॥"

ఇతర విధములైన చౌర్యం కాలంగడిస్తే మాసిపోతుందట! కాని, గ్రంథచౌర్యం మాత్రం బిడ్డ బిడ్డలదాక వెన్నంటి పీడిస్తుందట!

## కవిచర్య - రాజచర్య

కవిచర్యనీ, రాజచర్యనీ వర్ణించిన పదో అధ్యాయం కూడా హృదయంగమమైనది. కవియొక్క ఆహార విహారాదులనూ, దినచర్యలనూ రాజశేఖరుడు వర్ణించిన విధం చూస్తే ఆనాడీ దేశంలో కవుల కెట్టి ఆదరణా, భోగభాగ్యాలతో జీవించగల అవకాశమూ ఉండేవో అర్థమవుతుంది. నాటి రాజులు జరిపే విద్వద్గోష్ఠులూ, కావ్యపరీక్షలూ ఎలా జరిగేవో కళ్ళకు కట్టినట్లు ఈ అధ్యాయం వర్ణిస్తుంది. ఉత్తమ కావ్యాలనూ, శాస్త్రాలనూ నిర్ణయించేందుకు రాజులు విద్వత్సభలలో పరీక్షలు జరిపి, వాటిలో గెలుపొందిన మహాకవులకూ, పండితులకూ బ్రహ్మరథం పట్టించేవారట! కావ్యపరీక్షార్థమైన అట్టిసభలు పూర్వం ఉజ్జయినిలో జరిగేవట! కాళిదాసుడు, మేంఠుడు, అమరుడు మొదలైన కవులా సభలలో పరీక్షితులయినవారే!—విద్వాంసులలో వర్షుడు, పాణిని, వ్యాడి, వరరుచి మొదలైనవారెందరో ఆ పరీక్షలలో గెలిచి ప్రశస్తి పొందారు.

రాజశేఖరుని కాలంనాడు భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో సంస్కృతం సర్వజన వ్యవహార భాషగా ఉండేదనడానికి కావ్యమీమాంస సప్తమాధ్యాయం చక్కని నిదర్శనం.

"పఠంతి సంస్కృతం సుష్ఠు
కుశలాః ప్రాకృతవాచితే ।
వారాణసీతః పూర్వేణ
యే కేచిన్మగధాదయః"

కాశికి తూర్పునఉన్న మాగధులు మొదలైనవారు సంస్కృతభాష సుష్ఠుగా ఉచ్చరించేవారట! ఈ సందర్భంలోనే గౌడబ్రాహ్మణుల ఉచ్చారణ స్పష్టంగా ఉండదనీ, లాటీయులు గద్యమైనాసరే పద్యమైనా సరే రాగంతోనే చదువుతారనీ, సురాష్ట్ర త్రవణ దేశాలలో అపభ్రంశశబ్దాలతో మిశ్రితమైన సంస్కృతభాష మాట్లాడుతారనీ — ఇలా భారతదేశంలోని వివిధప్రాంతాలలో నాడుగల భాషలకూ,

ఉచ్చారణకూ సంబంధించిన ఎన్నో చమత్కారక విషయాలను ఈ అధ్యాయంలో రాజశేఖరుడు చెప్పాడు. మగధరాజు శిశునాగుడు ణ, శ, ష, హలు తప్ప మిగిలిన మూర్ధన్యాలు ఉచ్చరించరాదని తన అంతఃపురస్త్రీల నాజ్ఞాపించాడట. కుంతలాధిపతి శాతవాహనుడు ప్రాకృతభాష వాడకూడదనీ, ఉజ్జయిని పాలకుడు సాహసాంకుడు సంస్కృతభాష మాట్లాడకూడదనీ శాసించారట!

భారతదేశ మంతటా రాజశేఖరుడు సంచారం చేసినట్లు కనిపిస్తున్నది. ఆనాటి భారత భౌగోళికస్థితిని ఏకాదశాధ్యాయంలో వర్ణించాడు. పూర్వదేశం, దక్షిణాపథం, పశ్చాద్దేశం, ఉత్తరాపథం, మధ్యదేశం అని అయిదు ప్రధానవిభాగాలుగా మనదేశం ఆనాడు ఉండేది. ఏయే విభాగంలో ఏయేప్రాంతాలు చేరిఉండేవో వివరంగా వర్ణించి చివరకు "తస్తు జిగీష త్యధికం పశ్యేదు మద్భువనకోశే మహో" అన్నాడు. ఇంకా వివరంగా తెలుసుకోదలచినవారు నా భువనకోశం చూడండి అని. దీనినిబట్టి 'భువనకోశ' మనే మరో భౌగోళికగ్రంథంకూడా రాజశేఖరుడు వ్రాసినట్టూ అది వినష్టమైనట్టూ స్పష్టమౌతున్నది.

## అలంకారశాస్త్ర ప్రాశస్త్యం

ఒకప్పుడు బహుళప్రచారంలో ఉండి నేడు వినష్టమైపోయిన అనేక సంస్కృతగ్రంథాలనుగూర్చి తెలుసుకోడానికి రాజశేఖరుని రచనలు ఉపకరిస్తున్నవి. పాణిని కేవలం వైయాకరణుడే కాక, జాంబవతీపరిణయ మనే ఒక కావ్యంకూడా వ్రాసినవాడనీ, భాసుని నాటకాలను పరీక్షార్థం అగ్నిలో పడవేయగా ఒక్క స్వప్నవాసవదత్తమాత్రమే ఆ పరీక్షకు నిలచిననీ — సంస్కృతవాఙ్మయ చరిత్రకు సంబంధించిన ఇటువంటి ముఖ్యవిశేషా లెన్నో ఈయన రచనలవల్లనే మన కిప్పుడు తెలుస్తున్నవి. వస్తువులోను, రచనావిధానంలోనుకూడా అపూర్వమూ, అమూల్యమూ అయిన శాస్త్రగ్రంథం కావ్యమీమాంస.

అలంకారశాస్త్రప్రాముఖ్యాన్ని, ప్రాశస్త్యాన్ని రాజశేఖరు డంత స్పష్టంగా చాటిన ఆలంకారికుడు మరొకడు లేడు. వేదానికి ఏడవ అంగంగా అలంకారశాస్త్రాన్ని ఆయన వర్ణించాడు. "శిక్షా, కల్పో, వ్యాకరణం, నిరుక్తం, ఛందోవిచితిః జ్యోతిషం చ షడంగాని ఇత్యాచార్యాః. ఉపకారకత్వా దలంకారః సప్తమ మంగమితి యాయావరీయః" అన్నాడు. వేదమున కిది ఉపకారకం గనుక ఏడో అంగమని. ఏవిధంగా ఉపకారకమంటే — "ఋతే చ తత్ స్వరూప పరిజ్ఞానా ద్వేదార్థా నవగతిః" అన్నాడు. అలంకార స్వరూపపరిజ్ఞానం లేకుండా వేదార్థం అవగతంకాదు అని. ఇందుకు ముండకోపనిషత్తునుంచి ఒక ఉదాహరణ కూడా ఇచ్చాడు.

"ద్వా సుపర్ణా సయుజా
సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో ఒభిచాకశీతి॥

రెండుపక్షులు ఒకేచెట్టుని ఆశ్రయించి వున్నవి. అందులో ఒకటి కర్మఫలాన్ని ఆస్వాదిస్తున్నది. రెండోది నిరాహారి అయి ప్రకాశిన్నది. ఈ మాటలలోనుంచి జీవాత్మ పరమాత్మలు దేహము నాశ్రయించుకొనివున్న వృత్తాంతం అలంకారశాస్త్ర పరిజ్ఞానం వినా ఎలా అవగతమవుతుంది అని రాజశేఖరుని ప్రశ్న. కావ్యవిద్య చతుర్దశవిద్యలనూ అతిశయించిన సర్వవిద్యాస్థానమైన పంచదశమవిద్య అనికూడా ఈయన ప్రశంసించాడు.

## కవిగా రాజశేఖరుడు

రాజశేఖరుడు ఆలంకారికుడుగా ఎంత ప్రసిద్ధుడో, కవిగా కూడా అంత ప్రసిద్ధుడు. ఆయన కవిరాజు. 'బాలకవి' 'కవిరాజ' బిరుదములు తనకున్నట్లు ఆయన వ్రాసుకొన్నాడు. 'కవిరాజు' 'మహాకవి' కంటెకూడా అధికుడట! కావ్యమీమాంసలో ఇచ్చిన కావ్యవిద్యాస్నాతకుడు, హృదయకవి, అన్యాపదేశి, సేవిత మొదలైన దశవిధాలైన కవులలోను కవిరాజే సర్వోత్తముడు. "యో ఒన్యతర ప్రబంధే ప్రవీణ స్స మహాకవిః" — ఏదో ఒకవిధమైన ప్రబంధ రచనలో మాత్రమే ప్రవీణుడు మహాకవి; "యస్తు తత్ర తత్ర భాషా విశేషేషు ప్రబంధేషు తస్మిం స్తస్మిం శ్చరసే స్వతంత్ర స్స కవిరాజః" — వివిధ భాషలలో వివిధ ప్రబంధమార్గాలలో యథేచ్ఛావిహారం చేయగలవాడే

కవిరాజు. 'తే జగత్యపి కతిపయాః'—అట్టివారు ప్రపంచంలోనే అతి విరళంగా వుంటారు.

'విద్ధి నః షట్ప్రబంధాన్' అన్న బాలరామాయణ ప్రస్తావనలోని వాక్యంవల్ల ఆరుప్రబంధాలు రాజశేఖరుడు వ్రాసినట్లు కనిపిస్తున్నా, కర్పూర మంజరి, విద్ధసాలభంజిక, బాలరామాయణం, బాలభారతం. ఈ నాలుగు రూపకాలే మనకు లభించినవి. బాలరామాయణ, బాల భారతములు వ్రాసినందువల్ల ఈయనకు బాలకవి బిరుదు సిద్ధించినట్లు ప్రతీతి. కర్పూర మంజరి ఒక ప్రాకృత సట్టకం. ప్రవేశక, విష్కంభాలు లేకుండా, అంకాలకు బదులు నాలుగు జవనికాంతరాలు ఉండే రూపకాన్ని సట్టకం అంటారు. ప్రాకృతంలో రచితమైన రూపకాలలో మనకు లభించినంతలో-ఈ కర్పూరమంజరే మొదటిది. బాల రామాయణం రామాయణ కథనం తనూ సంగ్రహంగా వర్ణించిన 10 అంకాల మహానాటకం. బాలభారతం కూడా అలాగే 10 అంకాల నాటకమేమో! రెండంకాల గ్రంథమే మనకు దొరికింది. విద్ధసాలభంజిక నాలుగు అంకాల నాటిక. హేమచంద్రుడు తన కావ్యానుశాసనంలో రాజశేఖరుని హారవిలాసం లోనివరి రెండు శ్లోకాలు ఉదాహరించాడు. ఆ హారవిలాసం ఇంతవరకూ దొరకలేదు. 'కవి విమర్శ' అనే మరో గ్రంథాన్ని కూడా ఈయన వ్రాశాడనడానికి కొన్ని నిదర్శనాలు కనిపిస్తున్నవి. ఉజ్జ్వల దత్తుడు శివపర్యాయ పదాలతో కూడిన "చండీకాంతో భగాలీచ, లేలిహానో వృషధ్వజః" అనే శ్లోకార్ధ భాగాన్ని రాజశేఖరునిదిగా ఉదాహరించడాన్ని బట్టి రాజశేఖరకృతిమైన ఒక నిఘంటువు కూడా ఉన్నట్లు తోస్తున్నది.

రాజశేఖరుని కవిత్వం అత్యంత రసవంతము; సుధాస్యందిని. ఆయన మాటల్లోనే చెప్పవలెనంటే-

"శ్రోతుం శ్రోత్ర రసాయనం, రచయితుం
వాచ స్సతాం సమ్మతాః
వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం
లబ్ధుం రస స్రోతసః।
భోక్తుం స్వాదు ఫలంచ జీవిత తరో
ర్యద్యస్తి తే కౌతుకమ్
తద్భ్రాతః! శృణు రాజశేఖర కవేః
సూక్తీ స్సుధాస్యందినీః॥"

# విజ్ఞప్తి

**1956** జనవరితో భారతి 32 సంవత్సరాల ఆంధ్రసాంస్కృతికసేవలో పరిణతిచెంది 33 వ యేట అడుగిడుతుంది. జనవరి జన్మదిన సంచికకుగాను పంపే రచనలు రచయితలు డిసెంబరు 5 వ తేదీ నాటికే మా కార్యాలయమునకు అందజేయ ప్రార్థన.

*　　　*　　　*　　　*

గత జనవరి సంచిక ప్రారంభంగా భారతి రూపురేఖలలో కొన్ని మార్పులు తీసుకు వచ్చాం. ఇందుకు అభినందనలు తెలుపుతూ పలువురు లేఖలు వ్రాశారు. వారందరికీ ప్రత్యేక ప్రత్యేకంగా కృతజ్ఞత తెలుపటం సాధ్యం కాలేదు. ఇందుకు క్షంతవ్యులం.

రూపురేఖలతోపాటు విషయ సముచ్చయమందు కూడా కొన్ని మార్పులు తీసుకురావటానికి ప్రయత్నించాం. కాని చెప్పుకోదగిన అవధికి కృతకృత్యులం కాలేకపోయాం. అధునాతన శాస్త్రీయవిజ్ఞానం అనుక్షణం ప్రవర్థమానమౌతూ మానవ జీవితాన్ని విపరీతమైన తీవ్రతతో సర్వతోముఖంగా మార్పుకొచ్చేస్తోంది. ఈ విజ్ఞానవికాసాలను అవగతం చేసుకోలేకపోతే — దాని ప్రాచీనోజ్వల చరిత్ర యెంతటిదైనా, — ఏజాతికిగాని భవిష్యత్తు లేదు. అలాంటి శాస్త్రీయ విజ్ఞాన విషయికములైన వ్యాసములను సంపాదించి ఆంధ్రప్రజలకు అందజేయాలంటే విశ్వవిద్యాలయాలలోనూ ఇతర సాంకేతిక శిక్షణకేంద్రాలలోనూ ఆచార్య పీఠములలో వున్న ప్రముఖులసహకారం వుంటేనేగాని భారతి ఈ రంగంలో తగినసేవ చేయగల సావకాశం లేదు. ఇట్టి సహకారం విస్తృతావధిని లభించగలదని ఆశించుతున్నాం. అట్టి వ్యాసాలకు భారతి అత్యంతమైన ఆదరణ చూపగలదు.

*　　　*　　　*　　　*

భారతిలో జనవరినుంచీ "లేఖలు" శీర్షికను ప్రారంభించనున్నాం. లేఖలు ఆయా వైజ్ఞానిక కళారంగాలలోని ప్రధాన సమస్యలకు సంబంధించినవై ఉదాత్తమైనపద్ధతిలో సంక్షిప్తంగా వుండాలి.

*　　　*　　　*　　　*

ఆంధ్రజాతీయ సాంస్కృతికరంగంలో భారతి నిర్వహించుచున్నపాత్ర యెట్టిదో సర్వులకు విదితమే. ఆంధ్ర విజ్ఞాన పురోగమన చరిత్రదర్పణములైన భారతి పుటలతో పరిచయంలేని యే ఆంధ్రవిద్యార్థి విజ్ఞానము సమగ్రం కానేరదు. అచిరకాలంలో మహోజ్వల విశాలాంధ్ర నిర్మాణ బాధ్యతలను నిర్వహించబోతున్న కళాశాల విద్యార్థులు ముఖ్యంగా గమనించదగిన విషయం.

*　　　*　　　*　　　*

భారతి పాతసంచికలకొరకు ఎడనెడా ఉత్తరాలు వ్రాస్తూవుంటారు. భారతి ముద్రణకు అయ్యే విశేషమైన ఉత్పత్తి ఖర్చులదృష్ట్యా అదనంగా కాపీలు అచ్చువేసి వుంచటం అసంభవకార్యం.

క్రమం తప్పకుండా భారతి ప్రతిసంచికా మీకు చేరాలంటే చందాదారులుగా చేరటం ఉత్తమం.

# రాష్ట్రాల పునర్విభజన

శ్రీ పి. శ్రీరాములు

దేశం స్వతంత్రమైన తర్వాత భారతప్రభుత్వం నియమించిన విచారణ సంఘాలన్నిటిలోకీ ఫజల్ అలీ సంఘం అతి ప్రధానమైన, అతిదుస్తరమైన బాధ్యతలను నిర్వహించవలసి వచ్చింది. వీరు ప్రతిపాదించిన సిఫార్సులపై నవభారత స్వరూపస్వభావాలు ఆధారపడి వుండటమే ఇందుకు కారణం. భిన్న భాషావర్గాలకు చెందిన ప్రజలు తమ తమ ప్రాదేశిక వాంఛలు, ఆశయాలు సిద్ధించడానికి కమిషన్ సిఫార్సులు సహాయపడతాయో, పడవో నని ఎంతో ఆదుర్దాతో వాటికోసం నిరీక్షించారు.

బ్రిటిష్‌వారు పరిపాలించిన రోజులలోనూ, దేశం స్వతంత్రమైన తర్వాత కూడా దాదాపు నలభై సంవత్సరాలపాటు తీవ్ర ఆందోళన సాగిస్తేనేగాని, చివరకు ఒక ఆంధ్ర తపస్వి కఠోర ప్రాయోపవేశం సాగించి ఆత్మబలిదానం చేస్తేనేగాని ఆంధ్రరాష్ట్రం ఏర్పడలేదు. దేశం పారతంత్ర్యంలో పడివున్నప్పుడు బ్రిటిష్ పాలకులకు, సంస్థానాధిపతులకు వున్న అతి సన్నిహిత సంబంధాలవల్ల, అవినాభావంవల్ల, ఆంధ్రులు విశాలాంధ్ర విషయమై కలలోనైనా అనుకోడానికే వీల్లేకపోయింది. అప్పటి పరిస్థితులు అవి. స్వాతంత్ర్యావతరణతో మొత్తం ఆరువందల స్వదేశీ సంస్థానాలను "అభినవబిస్మార్క్" సర్దార్ పటేల్ మహాశయుడు తన రాజనీతిప్రజ్ఞాప్రాభవాలచేత దేశంలో సంలీనం చేసివేయడంతో, సత్వరమే గాకపోయినప్పటికీ ఏదో ఒక రోజుకు రాజప్రముఖుల వ్యవస్థ రద్దుగాక తప్పదనీ, విశాలాంధ్ర సైతం ఏర్పడకపోదనీ ఆశాభావం ఆంధ్రులలో అంకురించింది.

అందుచేతనే, దేశానికి నడిగడ్డమీద వున్న హైదరాబాద్ రాష్ట్రాన్ని విచ్ఛిన్నం చేయాలని ఫజల్ అలీ కమిషన్ అసలు సిఫార్సు చేస్తుందా, ఆ విచ్ఛిత్తి ఫలితంగా ఏర్పడే మూడు భాషాప్రాంతాలను పరిసర రాష్ట్రాలలో చేర్చివేయాలని సూచిస్తుందా, విశాలాంధ్ర, సంయుక్త కర్ణాటక, బృహన్మహారాష్ట్ర రాష్ట్రాల ఏర్పాటుకు ఏమైనా దోహదం ఇస్తుందా అని పలువురు భాషారాష్ట్ర వాదులు పరిపరి విధాల ప్రశ్నించడం జరిగింది. భారతప్రజానీకం ఇందువల్లనే అత్యంత జాగరూకతతో కమిషన్ సిఫార్సులు ఏవిధంగా వుండబోతున్నవోనని ఎదురు చూసింది. చివరకు గతమాసం 10వ తేదీన భారతప్రభుత్వం సిఫార్సుల పూర్తివివరాలను ప్రకటించి, ప్రజల ఆదుర్దాను చల్లార్చింది. ఆదుర్దా చల్లారినా కొన్ని ప్రాంతాల ప్రజలకు ఈ సిఫార్సులు అసంతృప్తి కూడా కలిగించినవి.

ఈ విధమైన అసంతృప్తి ఒకటి ఏర్పడగలదని ముందుగా ఊహించిన కారణంచేతనో ఏమో కమిషన్ సభ్యులు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు తాము చేసిన సిఫార్సులను సహృదయతతో స్వీకరించాలనీ, ప్రాజ్ఞులైన భారతపౌరులు తమ ప్రాదేశిక వాంఛలను విశాల జాతి క్షేమాభిలాషతో సమన్వయపరచుకోవాలనీ హితోపదేశం చేశారు: "స్వతంత్ర భారతదేశం ముందడుగు వేస్తున్నది. ఇప్పటివరకూ మనదేశం సాధించిన విజయాలు చెప్పుకొని గర్వించదగినవే గాని, అందుకు భిన్నమైనవి కావు. దేశ విభజనానంతర విషమ పరిస్థితులలో క్లిష్టాతి క్లిష్టంగా పరిణమించిన స్వదేశ సంస్థానాల సమస్యను మనం పరిష్కరించుకున్న విధానం భారతప్రజల రాజకీయ విజ్ఞతకు, ధైర్య స్థైర్యాలకు, వారి సంకల్పానికీ శాశ్వత నిదర్శనంగా నిలచి తీరుతుంది", అనే వాక్యంతో కమిషన్ తన నివేదికను ముగించింది.

కమిషన్ నియామకం జరిగి రేపు డిసెంబరు ఆఖరుకు రెండు సంవత్సరాలు పూర్తిఅవుతవి. భారత సమాఖ్యలోని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమస్యను వాస్తవిక దృష్టితో, నిష్పాక్షికంగా సమగ్రంగా పరిశీలించి, వివిధ అంతర్భాగాలలో నివసించే ప్రజల యోగక్షేమాన్నే గాక, భారతజాతి మొత్తం యోగ

క్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని, యోగ్యమైన ప్రతిపాదనలు చేయడానికి కేంద్రప్రభుత్వం ఒక ప్రత్యేక కమిషన్‌ను నియమించదలచినట్లు ప్రధాని నెహ్రూ 1953 డిసెంబరు 22 న పార్లమెంటులో ప్రకటించారు. ఈ ప్రకటన జరిగిన వారంరోజులకే, ఒరిస్సా గవర్నర్ గా పనిచేస్తున్న ఫజల్ అలీ అధ్యక్షతన, శ్రీ పణిక్కర్, పండిత హృదయనాథ కుంజ్రూలు, సభ్యులుగా కమిషన్‌ను భారతప్రభుత్వం నియమించింది. ఈ ముగ్గురు సభ్యులు విడివిడిగానూ, అందరూ కలసి దేశం నలుమూలలా పర్యటన చేసి, ప్రజాసంస్థలవద్ద, నాయకులవద్ద, అభిప్రాయాలను సేకరించారు. స్వయంగా కలుసుకోలేనివారు విజ్ఞాపనపత్రాలను మ్యాపులతో సహా ఢిల్లీలోని తమ కార్యాలయానికి పంపవచ్చునన్నారు. ఈ విధంగా దాదాపు లక్షన్నర విజ్ఞాపనలు వారికి అందినవి.

దేశంలో ఇప్పుడున్న బహుభాషా ప్రాంతాలైన బొంబాయి, మద్రాసు మొదలైన పెద్దరాష్ట్రాలు పరిపాలనా సౌలభ్యం దృష్ట్యా గాని, ప్రజల అవసరాల దృష్ట్యా గాని ఏర్పడినవి కావు. బ్రిటిష్ ప్రాబల్యం హెచ్చినకొద్దీ ఒక్కొక్క రాష్ట్రంలోనే ఒక్కొక్క కొత్తప్రాంతం చేరడంతో ఇవి వీలూ చాలా లేకుండా అడ్డదిడ్డంగా పెరిగి స్థిరపడిపోయినవి. బ్రిటిష్‌వారి ఆక్రమణ, విస్తరణల చరిత్రే ఈ రాష్ట్రాల చరిత్ర. బాపూజీ నాయకత్వాన జాతీయోద్యమం శాఖోపశాఖలుగా విస్తరించడంతో, ప్రజలలో స్వాతంత్ర్యవాంఛ బలీయమై జాతీయభావాలు విజృంభించినకొద్దీ ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తివాంఛకూడా ప్రస్ఫుటం కాసాగింది. అస్సాం, బీహారు, ఒరిస్సా, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలను బ్రిటిష్‌వారు రాజకీయ, సైనిక వ్యూహ ప్రాధాన్యందృష్ట్యా ఏర్పాటు చేసినప్పటికీ, వారు కొంతవరకు కాలప్రభావాన్ని, ప్రజాభిమతాన్ని కూడా పాటించక తప్పలేదు.

లార్డ్ కర్జన్ 1905 లో సంకల్పించిన వంగ రాష్ట్ర విభజనను ప్రతిఘటించి రద్దుచేయించడంతోనే భాషారాష్ట్ర సిద్ధాంతాన్ని జాతీయ కాంగ్రెసు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ బలపర్చడం ప్రారంభమైంది. 1908 లో ప్రత్యేక బీహారు రాష్ట్ర కాంగ్రెసును, 1917 లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసును, సింధు కాంగ్రెసును ఏర్పాటు చేశారు.

భాషారాష్ట్ర ప్రాతిపదికను జాతీయ కాంగ్రెసు ఈ విధంగా ముందు సూత్రప్రాయంగా ఆమోదించినప్పటికీ, 1920 లో గాని దాన్ని ఒక రాజకీయ విధానంగా నిర్వచించడం జరగలేదు. ఆ సంవత్సరం నాగపూరు కాంగ్రెసులో ఈ ఆమోదముద్ర లభ్యమైంది. మరుసటి సంవత్సరమే ఆ సిద్ధాంతాన్ని పూర్తిగా అమలు జరిపి, మరికొన్ని కాంగ్రెసు-రాష్ట్రాలను ఏర్పాటు చేశారు. దేశాన్ని భాషాప్రయుక్త రాష్ట్రాలుగా అవశ్యం విభజించాలనీ, ఆంధ్ర, ఉత్కళ, కర్నాటక, రాష్ట్రాల స్థాపనతో పునర్విభజన కార్యక్రమం ప్రారంభం కావాలని కాంగ్రెసు 1927 లో తీర్మానించింది.

1928 లో సర్వపక్ష సమావేశం తరఫున మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన ఏర్పడిన ప్రత్యేక పరిశీలక సంఘం భాషారాష్ట్రాల ఆవశ్యకతపై ఈ క్రింది అభిప్రాయాలను వ్యక్తీకరించి — "ఏ రాష్ట్రమైనా మాతృభాషలో విద్యావిధానాన్నీ, నిత్యపరిపాలనా విధానాన్నీ నిర్వహించుకోవాలంటే, ఆ రాష్ట్రం ఆ భాషా ప్రాంతానికే పరిమితమైవుండాలి. బహుభాషారాష్ట్రాలలో నిరంతరం అనేక చిక్కులను యెదుర్కొనవలసి వస్తుంది. ప్రతిభాషకూ ప్రత్యేక సంస్కృతీ, సంప్రదాయాలు, సారస్వతం వుండి తీరుతవి. ఆ రాష్ట్ర అభ్యుదయానికి ఇవి యెంతైనా సహాయపడగలవు," — భాషారాష్ట్ర వాదానికి బలం సమకూర్చింది

తర్వాత 1928-47 సంవత్సరాలమధ్య భాషా రాష్ట్ర సిద్ధాంతంలో తనవిశ్వాసాన్ని పునరుద్ఘాటిస్తూ, అఖిల భారత కాంగ్రెసు సంస్థ అనేకసార్లు తీర్మానించడం, 1945 ఎన్నికల ప్రణాళికలో కూడా ఇదే ప్రస్తావనచేసి ప్రజలకు హామీ ఇవ్వడం జరిగింది. ఆంధ్ర, కేరళ, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల సత్వరనిర్మాణం ఎంతవరకు సాధ్యమో ఎంతవరకు అసాధ్యమో పరిశీలించడానికి శ్రీ ధార్ (రిటైర్డ్ న్యాయమూర్తి) అధ్యక్షతన ఒక ప్రత్యేక సంఘాన్ని రాజ్యాంగరచనా సంఘంవారి సిఫార్సు ప్రకారం, కేంద్ర ప్రభుత్వం 1948 జూన్‌లో నియమించింది. (ఇదే ధార్ కమిషన్; శ్రీ ధార్ అధ్యక్షుడు; శ్రీ పన్నాలాల్, జగత్ నారాయణలాల్ సభ్యులు) దేశవిభజనఫలితంగా భారతప్రభుత్వం అనేక క్లిష్ట సమస్యలను ఎదుర్కొంటున్న అప్పటి పరిస్థితులలో

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు ఉపక్రమించడం ఏమాత్రం వాంఛనీయం కాదని స్పష్టీకరించడమే గాక, రాష్ట్రాల పునర్విభజనకు కేవలం భాషా సిద్ధాంతమే ప్రాతిపదిక కారాదని పరిపాలనా సౌష్ఠవానికే ప్రాధాన్యం ఇవ్వాలనీ ధార్ కమిషన్ అభిప్రాయపడింది. ప్రజలలో జాతీయ సమైక్యభావాన్ని ప్రదీపింపజేసే ప్రతి కార్యక్రమాన్నీ ముందుకు సాగేట్లు ప్రోత్సహించాలనీ, జాతీయ సమైక్యతకు ప్రతిబంధకంగా పరిణమించే ప్రతి పనినీ నిర్దాక్షిణ్యంగా తిరస్కరించాలనీ నిర్మొహమాటంగా చెప్పివేసింది.

ధార్ కమిషన్ నివేదిక ప్రభుత్వానికి అందిన కొద్ది రోజులకే, అఖిలభారత కాంగ్రెసు జయపూర్ లో సమావేశం కావడమూ భాషారాష్ట్ర సమస్య పునః పరిశీలనకు నెహ్రూ-పటేల్-పట్టాభి సభ్యులుగా ప్రత్యేక నాయకత్రయ సంఘాన్ని నియమించడమూ జరిగింది. వారు తమ నివేదికలో భాషారాష్ట్ర సిద్ధాంతాన్ని అమలు జరపడంలో ఎన్నడూ ఊహించని చిక్కులు, ఉపద్రవాలు వున్నవని చెప్పడమే గాక, భాష ప్రజలను సుసంఘటితం చేయడానికి ఎంతగా సహాయపడగలదో, జాతి సమైక్యతను విచ్ఛిన్నం చేయటానికి కూడా అంతే దోహదకారి కాగలదని హెచ్చరిక చేశారు. జాతీయకాంగ్రెసు అప్పటికి నలభయి సంవత్సరాలనుంచీ సమర్థిస్తూ వచ్చిన భాషారాష్ట్ర సిద్ధాంతాన్ని బహు జాగ్రతగా ఆలోచించిన పిమ్మటగాని అమలు జరపడానికి వీల్లేదనీ, నిర్దిష్టమైన, నిర్వివాదమైన ప్రాంతాలను మాత్రమే కొత్త రాష్ట్రాలుగా ఏర్పాటు చేయడానికి వీలుంటుందనీ చెప్పడం, అందుకు ఆంధ్రులు సమ్మతించి మదరాసు నగరంమీద తమకున్న హక్కులను పూర్తిగా వదులుకుంటే నిర్వివాదమైన తెలుగుజిల్లాలతో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయడానికి ఇష్టపడడం జరిగింది.

అనేక పరిమితులు విధించిన నాయకత్రయ నివేదికపై బోలెడన్ని సిద్ధాంత రాద్ధాంతాలు సాగడం, 1952 అక్టోబరు 19 మొదలు డిసెంబరు 15 వరకూ ప్రాయోపవేశ దీక్షలో పొట్టి శ్రీరాములు పూర్ణాహుతి కావడం, ఆయన మరణించిన ఏడాదికి ఆంధ్రరాష్ట్ర స్థాపన జరగడం తెలిసిన విషయాలే. న్యాయమూర్తి వాంఛూ రాక, బళ్ళారి తాలూకా భవిష్యత్తుపై న్యాయమూర్తి మిశ్రా తీర్పుకూడా ఇటీవలి సంఘటనలే. ఇది భాషారాష్ట్ర సూత్రానికి క్రమక్రమంగా ఏర్పడుతూవచ్చిన భంగపాట్ల స్థూలచరిత్ర.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరిగి సరిగా రెండు నెలలైనా తిరగకముందే భారత ప్రభుత్వం ఫజల్ ఆలీ కమిషన్‌ను నియమించింది. ఈ కొత్త సంఘం చేతులలో భాషారాష్ట్ర సిద్ధాంతం ఏ స్వరూపాన్ని ధరిస్తుందోనని ఆందోళనపడినవారు కూడా లేకపోలేదు.

## సిఫార్సులు

ఫజల్ ఆలీ కమిషన్ చేసిన సిఫార్సుల స్వరూప స్వభావాలు ఎలాంటివో సంగ్రహంగా తెలుసుకుందాం:

(1) భారత సమాఖ్యలో ప్రస్తుతం వున్న 27 "ఏ", "బి", "సి" తరగతి రాష్ట్రాల పరిహద్దులను మార్చివేసి, 16 ఒకే తరగతి రాష్ట్రాలను ఏర్పాటు చేయాలి. (2) రాజప్రముఖుల వ్యవస్థను రద్దుచేయాలి. (3) హైదరాబాద్ రాష్ట్రాన్ని మూడు భాషా ప్రాంతాలుగా విడదీసి బహుభాషాప్రాంతమైన బీదర్ జిల్లాను కూడా చేర్చి హైదరాబాద్ రాజధానిగా ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని ఏర్పరచాలి. (దీని పేరు హైదరాబాద్ రాష్ట్రమే) (4) 1961లో దేశవ్యాప్తంగా జరిగే ఎన్నికలలో నూతన హైదరాబాద్ రాష్ట్రశాసనసభకు ఎన్నుకునే సభ్యుల మొత్తంలో మూడింట రెండువంతుల మంది కోరే పక్షంలో తెలంగాణా రాష్ట్రాన్ని ఆంధ్రరాష్ట్రంలో చేర్చివేసి, విశాలాంధ్ర ఏర్పాటు చేయవచ్చు. (5) హైదరాబాద్ సంస్థానంనుంచి విడదీసే రాయచూర్, గుల్బర్గా జిల్లాలను సంయుక్త కర్ణాటకంలో చేర్చివేయాలి. (6) హైదరాబాద్ సంస్థానం నుంచి చీల్చివేసే మరాఠ్వాడా జిల్లాలను విశాల బొంబాయి రాష్ట్రంలో చేర్చాలి. (7) ఐక్యకేరళను ఏర్పాటు చేయాలి (8) ఐక్యకర్ణాటక రాష్ట్రాన్ని నిర్మించాలి. (9) బళ్ళారి, సిరిగుప్ప, హోస్పేట తాలూకాలను, మల్లాపురం సబ్ తాలూకాను తిరిగి ఆంధ్రకు అప్పగించాలి. (10) మధ్యప్రదేశ్ లోని 8 మహారాష్ట్ర జిల్లాలను విడదీసి "విదర్భ" అనే కొత్తరాష్ట్రాన్ని సృష్టించాలి.

కమిషన్ చేసిన సిఫారసులు అమలు జరిగితే భారత సమాఖ్యలో ఏర్పడే రాష్ట్రాలు ఇవి:

(1) మద్రాసు (2) కేరళ (3) కర్ణాటక (4) హైదరాబాద్ (5) ఆంధ్ర (6) బొంబాయి (7) విదర్భ (8) మధ్యప్రదేశ్ (9) రాజస్థాన్ (10) పంజాబ్ (11) ఉత్తరప్రదేశ్ (12) బీహార్ (13) పశ్చిమ బెంగాల్ (14) అస్సాం (15) ఒరిస్సా (16) జమ్ము—కాశ్మీర్. ఇవి గాక, ఢిల్లీ, మణిపూర్, అండమాన్ నికోబార్ దీవులు, మూడు కేంద్రపాలిత ప్రాంతాలుగా వుండగలవు.

తిరుకొచ్చి రాష్ట్రంలో అత్యధిక భాగమే నూతన ఐక్యకేరళ రాష్ట్రమౌతుంది. కొత్త కర్ణాటక రాష్ట్రంలో మైసూరు, కూర్గులు చేరి పోతవి. సౌరాష్ట్ర, కచ్ రాష్ట్రాలు బొంబాయిలో లీనమవుతవి. విదర్భ రాష్ట్రం ఏర్పడగా మిగిలిపోయే మధ్యప్రదేశ్ రాష్ట్రంలో భోపాల్, వింధ్యప్రదేశ్ లు కలిసిపోతవి. పెప్సూ, హిమాచల ప్రదేశ్ లను పంజాబు రాష్ట్రంలో చేర్చివేస్తారు. బొంబాయిలోని అబూరోడ్ తాలూకాను, అజ్మీర్ ను రాజస్థాన్‌లో చేర్చివేస్తారు. త్రిపుర సంస్థానం అస్సాంలో చేరిపోతుంది. తిరుకొచ్చిలోని ఐదు తమిళ తాలూకాలను మద్రాసులో చేరుస్తారు. మద్రాసులోని మలబార్ జిల్లా కేరళలో చేరిపోతుంది; ఇదే రాష్ట్రంలోని దక్షిణ కెనరా జిల్లా కర్నాటకంలో కలుస్తుంది. ప్రస్తుతం వున్న ఒరిస్సా సరిహద్దులను మార్చవలసిన అగత్యంలేదని కమిషన్ అభిప్రాయపడ్డది. ఇవీ స్థూలంగా ఫజల్ ఆలీ సంఘం చేసిన సిఫారసులు.

## పరామర్శ

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో హైదరాబాద్ సంస్థానం యథాతథంగా వుండడానికి వీల్లేదని ఫజల్ ఆలీ సంఘం ఘంటాపథంగా చెప్పినందుకు ఆంధ్ర, మహారాష్ట్ర, కన్నడ ప్రజలు తప్పక హర్షిస్తారు. ఇందుకు ఆ సంఘాన్ని హృదయపూర్వకంగా అభినందిస్తారు కూడా. హైదరాబాద్ సంస్థానాన్ని విభజించడమే జరగకపోతే, దక్షిణాపథంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాన్ని తలపెట్టవలసిన పనే లేదని కూడా కమిషన్ సభ్యులు ఖండితంగా చెప్పివేశారు. ఇంతేగాక, సంస్థాన విభజనలో ఏమాత్రం జాప్యం జరిగినా, అక్కడ నివసిస్తున్న మూడు భాషా ప్రాంతాల అభివృద్ధికి తీరని విఘాతం ఏర్పడుతుందని కమిషన్ హెచ్చరిక చేయడం గమనించదగిన విషయం.

ఈ విభజన ఫలితంగా, కన్నడ జిల్లాలైన రాయచూరు, గుల్బర్గాలను (గద్వాల, అలంపూర్ మొదలైన తెలుగు తాలూకాలతో సహా) ఐక్యకర్నాటక రాష్ట్రంలోనూ, ఉస్మానాబాద్, భీర్, ఔరంగాబాదు, పర్బణి, నాందేడు అనే ఐదు మహారాష్ట్ర జిల్లాలను బొంబాయి రాష్ట్రంలోనూ చేర్చాలన్నారు గాని, మిగతా తెలుగు జిల్లాలను త్రిభాషాప్రాంతమైన బీదర్ జిల్లాను చేర్చి హైదరాబాద్ నగరం రాజధానిగా కొత్త హైదరాబాద్ రాష్ట్రం ఏర్పడాలని చెప్పడంతో ఫజల్ ఆలీ కమిషన్ సిఫారసుల పస తేలిపోయింది. కొత్త హైదరాబాద్ రాష్ట్రంలో వుండే జిల్లాలు: (1) మహబూబ్ నగర్ (2) నల్గొండ (3) వరంగల్లు (4) ఖమ్మం (5) కరీంనగర్ (6) ఆదిలాబాద్ (7) నిజామాబాద్ (8) మెదక్ (9) హైదరాబాద్ (10) బీదర్. ఇవిగాక, నల్గొండజిల్లా మధ్యగా వున్న మునగాల పరగణాను కూడా ఇదే రాష్ట్రంలో కలిపివేయాలి.

ఈ విధంగా ఐక్యకేరళ, సంయుక్త కర్ణాటక రాష్ట్రాల తక్షణ నిర్మాణాన్ని సిఫారసు చేసిన కమిషన్కు సత్వర విశాలాంధ్ర నిర్మాణాన్ని సిఫారసు చేసే ధైర్యం లేకపోయింది.

విశాలాంధ్ర నిర్మాణం అసలే పనికిరాదని చెప్పడానికి కమిషన్ సాహసించలేకపోయింది. బలమైన వాదన ఏదీ కనబడకపోవడమే ఇందుకు కారణం. ఒకవైపు రెండు తెలుగురాష్ట్రాల నిర్మాణాన్ని ప్రతిపాదిస్తూ, విశాలాంధ్ర ఆవశ్యకతనుగూడా ఇలా సమర్థించింది. "విశాలాంధ్ర వాదన చాలా బలమైనదే. తెలంగాణాను ఆంధ్రలో కలిపివేయడంవల్ల చాలా లాభాలు ఉన్నవి. చిరాకెత్తిస్తున్న ఆంధ్ర రాజధాని సమస్యా పరిష్కారానికి ఆంధ్ర, తెలంగాణాల కలయిక ఎంతయినా అవసరం. అయితే వెనుకబడివున్న తెలంగాణా ప్రజల అనుమానాలను, భయాలనుబట్టి, ఇతర పరిస్థితులనుబట్టి ఐదేళ్ళవరకూ ఈ కలయిక అంత వాంఛనీయం కాదు. 1961 లో జరిగే ఎన్నికల అనంతరం కొత్త హైదరాబాదు రాష్ట్ర శాసనసభ్యులలో మూడింట రెండువంతులమంది కోరేపక్షంలో ఆంధ్ర, హైదరాబాద్ రాష్ట్రాలు రెండూ కలిసిపోవచ్చు" ఈ ఐదేళ్ళలోనూ ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలు తమతమ పరిపాలనా వ్యవస్థలను సుస్థిరం చేసుకోవచ్చునని

భూమిశిస్తువిధానాన్నీ, విద్యావిధానాన్నీ ఏకస్థాయికి తెచ్చుకోవచ్చుననీ, తెలంగాణా ప్రజల భయాలను అపోహలను పోగొట్టి, ఉభయరాష్ట్రాల హృదయపూర్వక విలీనానికి అవసరమైన ప్రజాభిప్రాయాన్ని కూడగట్టుకురావడానికి ఈ ఐదేళ్ల వ్యవధి బాగా తోడ్పడుతుందనీ, కమిషను ఈ వాదనను సమర్థించుకున్నది.

హైదరాబాద్ రాష్ట్రం ఆర్థికంగా స్వయం పోషకమేనని కమిషన్ అభిప్రాయపడుతున్నది. సాలుసరి రాబడి 17 కోట్లు వుంటుందని అంచనా. మద్య నిషేధ పరిశీలక సంఘం వారి సిఫార్సులు అమలు జరిగితే 1958 నాటి అన్ని రాష్ట్రాలకూ అబ్కారీ ఆదాయం పోతుంది. త్రిభాషా ప్రాంతమైన బీదర్ జిల్లాను, అబ్కారీ ఆదాయాన్ని మినహాయించిచూస్తే, హైదరాబాద్ రాష్ట్రం ఆర్థికంగా స్వయంపోషకం గాకపోవచ్చు. ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారి అభిప్రాయంకూడా ఇదే. ఇంతేగాక, అహారధాన్యాల విషయంలో తెలంగాణా లోటురాష్ట్రం. ఆంధ్ర మిగులురాష్ట్రం. కాబట్టి పరిపాలనా సౌలభ్యందృష్ట్యా చూసినా, ఆర్థిక సౌష్ఠవందృష్ట్యా చూసినా, విశాలాంధ్ర నిర్మాణం అత్యంత అభిలషణీయమైనట్టిదని స్పష్టపడక మానదు.

పైగా, కృష్ణాగోదావరీనదీ లోయప్రాజెక్టులను త్వరితంగా నిర్మించుకుంటేనేగాని తెలంగాణాగాని, ఆంధ్రరాష్ట్రంగాని అభివృద్ధిచెందలేవు. ఏకరాష్ట్ర పరిపాలనావ్యవస్థక్రిందే వీటి సత్వరాభివృద్ధి సాధ్యపడుతుంది. కృష్ణాగోదావరి పవిత్ర నదీతీరాలలో ఒకప్పుడు వర్ధిల్లిన ఆంధ్రసంస్కృతి తిరిగి ప్రాచీన ఔన్నత్యానికి రావాలంటే విశాలాంధ్రద్వారా ముక్కోటి ఆంధ్రులకు ఏకపరిపాలనావ్యవస్థ ఏర్పడాలి. ఆంధ్ర తెలంగాణా నాయకులు పరస్పర అనుమానాలను, అపోహలను సర్దుబాటుచేసుకొని ఏకీభావాన్ని ప్రదర్శించగలిగినట్లయితే, ఐక్యకేరళ, ఐక్యకర్నాటక రాష్ట్రాలతో పాటు విశాలాంధ్రకూడా వచ్చే అక్టోబరునాటికే ఏర్పడే అవకాశం లేకపోలేదనిపిస్తున్నది.

హైదరాబాద్ విభజనతోపాటు మరొక సమంజసమైన నిర్ణయాన్నికూడా ఫజల్ ఆలీకమిషన్ చేయగలిగింది. ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భాన బళ్లారిజిల్లాలోని తాలూకాల కేటాయింపు విషయంలో ఆంధ్రులకు జరిగిన అన్యాయాన్ని ఈ సంఘం సర్దుబాటు చేసింది. ఇది కర్ణాటకులకు నిర్హేతుకంగా కంటకప్రాయంగా పరిణమించినప్పటికీ, ఆంధ్రులకు సంపూర్ణమైన సంతోషాన్ని కలిగించింది. ఈ సిఫార్సులు వున్నవివున్నట్లు అమలుజరిగితే, బళ్లారిపట్టణం, తుంగభద్రప్రాజెక్టు ప్రాంతం, హంపీశిథిలాల ప్రాంతం మాతృరాష్ట్రమైన ఆంధ్రలో తిరిగి చేరుతవి.

## రాష్ట్రాల కొత్తపాత విస్తీర్ణాలు; జనాభా

| కొత్తరాష్ట్రం : | పాతవిస్తీర్ణం [చ॥ మైళ్లు] | కొత్తవిస్తీర్ణం [చ॥ మైళ్లు] | పాతజనాభా [లక్షలు] | కొత్తజనాభా [లక్షలు] |
|---|---|---|---|---|
| 1. ఆంధ్ర ... | 64,950 | 64,950 | 209 | 209 |
| 2. హైదరాబాద్ ... | 82,168 | 45,300 | 187 | 113 |
| 3. మదరాసు ... | 62,840 | 50,170 | 361 | 300 |
| 4. కేరళ (తిరుకొచ్చి) ... | 9,144 | 14,980 | 93 | 136 |
| 5. కర్నాటక (మైసూరు) | 29,489 | 72,730 | 91 | 190 |
| 6. బొంబాయి ... | 1,11,434 | 151,360 | 360 | 402 |
| 7. విదర్భ ... | —— | 36,880 | — | 76 |
| 8. మధ్యప్రదేశ్ ... | 1,30,272 | 1,71,200 | 218 | 261 |
| 9. రాజస్థాన్ ... | 1,30,207 | 1,32,300 | 153 | 160 |
| 10. పంజాబు ... | 37,378 | 58,140 | 126 | 172 |
| 11. ఉత్తరప్రదేశ్ ... | 1,13,409 | 1,13,409 | 632 | 632 |
| 12. బీహారు ... | 70,330 | 66,520 | 402 | 385 |
| 13. పశ్చిమబెంగాలు ... | 30,775 | 34,590 | 248 | 265 |
| 14. అస్సాము ... | 85,012 | 89,040 | 90 | 97 |
| 15. ఒరిస్సా ... | 60,136 | 60,136 | 146 | 146 |
| 16. జమ్ము - కాశ్మీర్ ... | 92,780 | 92,780 | 44 | 44 |




ప్రస్తుతం అమలులోవున్న రాష్ట్రాలు




ఫజులాలీ కమిషన్ సిఫారసులను అనుసరించితే యేర్పడే రాష్ట్రాలు

ఫజల్ అలీ కమిషన్ ఏ ఒక విస్పష్ట సిద్ధాంతానికీ కట్టుబడి సిఫార్సులను రూపొందించని కారణం చేతనే, అవి కొంతమందికి సంతృప్తినీ, అంతకంటే ఎక్కువమందికి అసంతృప్తినీ కలిగించినవేమోనని భావించవలసి వస్తున్నది. భాషామాత్రాన్నే ప్రాతిపదికగా పెట్టుకున్నట్లయితే, నూటికి 54 వంతులమంది తెలుగు ప్రజలున్న కోలారు జిల్లా నూటికి 70 వంతులకంటే ఎక్కువగావున్న పర్లాకిమిడి తాలూకా, రాయచూరులోని గద్వాల, అలంపురం మొదలైన తాలూకాలు మధ్యప్రదేశ్ లోని చాందా ప్రాంతం ఆంధ్రలో చేరాలని సిఫార్సు చేసి వుండేవారు. పరిపాలనా సౌలభ్యం, రాకపోకల సౌకర్యాలదృష్ట్యా కోలార్ మైసూరులోనే వుండాలన్నారు. చాందా, బస్తర్ ప్రాంతాలను ఆంధ్రలో చేర్చవలసిన అగత్యమే లేదు పొమ్మన్నారు.

ఈ సిఫార్సులలో ఆంధ్రులకు అన్యాయం జరిగిన మరికొన్ని ఉదాహరణలు కూడా లేకపోలేదు. తమ ప్రతిపాదనలకు కేవలం ఒక జిల్లానే ప్రాతిపదికగా భావించినట్లు చెబుతూ, కమిషన్ సభ్యులు ఇతర రాష్ట్రాలకు సంబంధించిన కొన్ని సందర్భాలలో తాలూకా మార్పులనుకూడా సిఫార్సు చేశారు. తిరుకొచ్చి రాష్ట్రంలోని ఐదు తమిళ తాలూకాల విషయంలోనూ, దక్షిణ కెనరా జిల్లాలోని కాసర్ గడ్ తాలూకాను కేరళలో చేర్చాలనడంలోనూ కమిషన్ సభ్యులు తమ నిర్వచనానికి తామే భిన్నంగా ప్రవర్తించారు.

ఆంధ్ర ఉత్కళ సరిహద్దుల విషయాన్ని కూడా కమిషన్ వాస్తవిక దృష్టితో పరిశీలించలేకపోయింది. ఆంధ్ర ఒరిస్సా సరిహద్దుల నిర్ణయం ఎప్పుడో ఇరవై ఏళ్ల క్రితమే జరిగిపోయింది. కాబట్టి ఇప్పుడు దాన్ని తిరిగి ఎత్తుకోవలసిన అగత్యం లేదన్నారు. ఈ నిర్ణయం వల్ల బరంపురం, ఛత్రపురం, పర్లాకిమిడి, జయపురం పట్టణాలతోపాటు 80 గ్రామాలు అంటే 10 లక్షల జనాభా 18 వేల చదరపు మైళ్ళ వీస్తీర్ణం గల ప్రదేశం ఆంధ్రలో చేరడానికి వీల్లేకపోతున్నది. దేశంలో అభివృద్ధి కార్యక్రమాలు నిర్దిష్టమైన ప్రణాళికాపద్ధతిలో కొనసాగాలంటే, రాష్ట్రాల వ్యవస్థీకరణ ఇప్పటిలాగా అశాశ్వతమైనదిగానూ, అస్థిమితమైనదిగానూ వుండకూడదని ఒకవైపుఅంటూనే, ఆంధ్రరాష్ట్ర సరిహద్దులకు సంబంధించి వంకెవరకు కమిషన్ అస్థిమిత పరిస్థితులనే కలిపించింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు సమగ్రవిచారణ సాగించిన ఫజల్ అలీ కమిషన్ అయినా తమకు న్యాయం చేకూర్చకపోతుందా అని కొండంత ఆశ పెట్టుకున్న ఒరిస్సా ఆంధ్రులకు ఈ సిఫార్సులు తీవ్ర ఆశాభంగాన్ని కలిగించినవి. కమిషన్ ప్రతిపాదనలను అమలు జరపడంలో భారతప్రభుత్వం వాటిలో అనేక స్వల్ప సవరణలను చేసి ఆయా ప్రాంతాల ప్రజలకు న్యాయం కలిగించవలసి వుంటుంది.

# శిల్పాలలో కల్పన

'ధనిష్ఠ'

రెండేళ్ళక్రితం సంగతి. బుద్ధిపుట్టింది హఠాత్తుగా మహాబలిపురం వెళదామని. ఆలయానికి దగ్గరదైనా దూరం అన్న సామెతగా యీవూళ్లో యిన్నాళ్ళనించి ఉంటున్నా ఒక్కసారైనా మహాబలిపురం వెళ్ళలేదు. యాత్రికుల పేరుతో ఎక్కడెక్కడివాళ్లు చూసి వస్తుంటారు. ఇల్లాంటి విషయాలలో మానవప్రకృతి చాలా ఆశ్చర్యజనకంగా గోచరిస్తుంది నాకు. పైవూళ్ళనించి వచ్చినవాళ్లు మద్రాసంతా కలయజూస్తారా, నాలుగేళ్ళనించి ఉంటూ ఒక్కసారి గూడా పూర్తిగా చూడలేదు నేను. ఆగ్రాలో ఉన్నారు గదా అని రోజూ తాజ్ మహల్ చూస్తారా? చూడ్డానికి వెళ్ళినవాళ్ళు మాత్రం ఉన్నన్నాళ్ళు రోజుకోసారైనా చూస్తారు.

నలుగురు శిల్పాలని కళలనిగురించి తమకేమి అనుభవాలనుగూర్చి ముచ్చటించుకుంటూంటే మాట్లాడడానికేందోరక్క చూస్తూ ఉండిపోయేవాడిని నేను. అల్లా గడిచిపోయినా బాధాగే. కాని ఎవడో మిత్రుడు "మహాబలిపురంశిల్పాలెల్లా ఉంటాయిరా?" అనేవాడు అక్కడికి నేను వాటినిగురించి సాంగోపాంగంగా తెలుసుకునిఉన్నట్టు, విధిగా తెలుసుకుని ఉండవలసినట్టూను. చూడలేదని చెప్పలేక చెప్పేవాణ్ణి. "ముప్ఫైమైళ్ళదూరంలో ఉండి ఒక్కసారి వెళ్ళలేదురా?" అనేవాడు నన్నో జంతువులా చూస్తూ. ఈ అవమానాల నించి తప్పించుకుందుకైనా ఒకసారి వెళ్ళితీరాలని నిశ్చయించుకున్నాను మనస్సులో. ఇంకో చిక్కుంది. నేను వెళ్ళినా వెళ్ళకపోయినా దానికి పెద్ద విలువేమీ ఉండదు. కారణం ఏమిటంటే నేను కవినికాను. చిత్రకారుణ్ణి కాదు, కనీసం కళారాధకుణ్ణైనా కాదు. అలంకారంలోను, సమాసాలలోను నేను చూసినవాటిని వర్ణించలేను. విచిత్రరంగులకలయికలో ఆ సుందరదృశ్యాల్ని కాన్వాస్ మీదకు గాని, కాగితంమీదకు గాని తీసుకురాలేను. కాని వెళ్లలేదని చెప్పడానికి, వెళ్ళినా దాన్ని గురించి విపులంగా చెప్పలేకపోవడానికి తేడా ఉందిగా. అదీకాక అనుభవించడానికి హృదయం ఉందిగా వర్ణించి చెప్పడానికి నోరులేకపోయినా. అంచేత ఒకసారి వెళ్ళొచ్చాననిపించుకుంటే యీ అవమానజ్వాలనించైనా తప్పించుకోవచ్చని వెళ్ళడానికి నిశ్చయించాను. నాకు ఉపగ్రహం మధుగాడొకడు. వాణ్ణి కదిపాను. 'సరే' నన్నాడు.

ఒక శనివారం సాయంత్రం ఆలోచించి ప్రోగ్రాం నిశ్చయించి వర్క్ షాప్‌లో, కారు పంపించమనీ మొన్నాడు పొద్దున్నే ఆరుగంటలకి నా గదిదగ్గర ఉండాలని పురమాయించాను.

రాత్రంతా శిల్పాలనిగురించిన కలలే; ఊరికి ఎదుట శిల్పాలు కనబడడం తర్వాత వాటికి ప్రాణం వచ్చి చరించడం సినిమాలో యింకా చిత్రవిచిత్రాలుగా కలలొచ్చాయి. కలతనిద్రేగాని సంతృప్తిగా కంటికి కూర్కు లేదు. తెల్లారింకేనేపుగా టిప్ టాప్ గా తయారై కూర్చున్నాను. ఆరింటికి కారు ఇంటికి తీసుకువచ్చాడు వర్క్ షాప్ డ్రైవర్. వాడికో రూపాయి పారేసి పొమ్మని మధుకోసం వాడింటికెళ్ళాను.

కారులో కూర్చుని హారన్ వేశాను. అపాటికే తయారై హారన్ కోసం చెవులు దొరబెట్టుకుని కూర్చుని వినబడగానే పరుగెత్తుకొస్తా డనుకున్నాను. కాని ఆ జాడేం కనబడలేదు. పైకెళ్ళిచూస్తే నిద్ర మంచం మీదనించే లేవలేదని తెలిసింది. నాకు నిలువునా కాలుకొచ్చింది. నిన్నంతా చెప్పి యిదా వీడు చేసేపని! రూములో కళ్లి తట్టి లేపాను. చూలిగాడు. వళ్ళు వెచ్చగా ఉంది. నాకోపం దిగజారిపోయింది.

"మధూ! అల్లా ఉన్నావేమ్రా!" అన్నాను నిదానంగా.

"రాత్రి కొంచెం పులకరం తగిలిందిరా. ఇవాళ వెడదా మని అన్నీ అనుకున్నామూ యిల్లా జరిగింది." అన్నాడు.

"ఛా! దానికేమిటిరా! ఇంకో రోజున వెళ్లొచ్చు. డాక్టర్ దగ్గిర కెడదాం రా." అన్నాను.

"ఈమాత్రం దానికి డాక్టరెందుకోయ్! 'లంఖణం పరమౌషధం' అని ఒక్క పూట పస్తుంటే పోతాయి ఎక్కడివక్కడ అన్నిరోగాలూను. దానికేం గాని నువ్వెళ్లు అనుకున్నది కాస్త పడకపోతే మళ్ళీమళ్ళీ అడ్డంకులు వస్తూనే ఉంటాయి."

"ఏడ్చావ్ లే. నువ్వు రాందే నేను మాత్రం ఎల్లా వెడతానూ. ఈ మా రెప్పుడైనా వెడదాం లే!"

"ఏడవలేకపోయావ్! అన్నీ ఏర్పాటు చేసుకుని మానుకోవడ మెందుకూ. ఇవాళ నాకోసం మానేస్తే యింకోరోజు యింకో అవాంతరం, రావొచ్చు. వెడదామనుకున్నావ్. అన్నీ సిద్ధం చేసుకున్నావ్. మళ్ళీ యీ అవకాశం పోగొట్టుకుంటే బోలెడు కాల యాపన నౌతుంది. అంచేత నామాట విని నువ్వెళ్లు."

"అవకాశాల కేంలే ఇవాళ కాకపోతే యింకో సారి వెడతాం. అందుకని నువ్వు లేకుండా వెళ్లనా?"

"ఒరేయి! మెట్టవేదాంతం కట్టిపెట్టు. నేను లేకుండా వెడితే కొంపేం మునిగిపోలేదు. నేను కూడా ఉంటే ఆశిల్పాలవైభవం ద్విగుణీకృతం కాదు. అదీ కాకుండా నేను చూసేశాను, నువ్వు లేకుండా నే. అంచేత అబ్బాయ్! సుబ్బారాయిల్లా బొబ్బలెట్టకుండా యిబ్బందిపడక నిబ్బరంగా పోయిరా." అన్నాడు నవ్వుతూ.

"మహా కష్టపడి వేశావ్ లే వృత్తి. ఆమాత్రానికే పోత్కర్షతో కూడిన నవ్వొకటి. కాని ఉహూ! నేను వెళ్లను."

"నేనేం వృత్త్యనుప్రాసల్లో మాట్లాడా నని నవ్వుకోవటం లేదు. నిన్ను సుబ్బారాయు డన్నానుగా వాడు జ్ఞాపకంవచ్చి వచ్చిందినవ్వు. నువ్వేదో కవిత్వం ఏకుస్తావ్ గాబట్టి, అందులో పద గాంభీర్యం కోసం అర్థంపర్థం లేనిమాటలలో గారడీ చేయాలనుకుంటావు గనకా నీకూ ఆబాధ. నాకేం! దానికేం గాని మొండిపట్టుపట్టి, అంతా సిద్ధం చేసుకుని కూడ అధ్వాన్నం కానీకు. కావలిస్తే యింకోమాటు యిద్దరం కలిసి వెడదాం లే." అంటూ బలవంతపెట్టి వప్పించాడు.

అప్పుడు వెళ్లడమే నయమైంది. నాటినుంచి నేటివరకు నేనూ మధు గాడు కలిసి అధమం పదిసార్లేనా ప్రయత్నించాం వెడదామని. పడలేదు. కాని ఇప్పుడు చిత్రంగా ఒక ఊహ వస్తూ ఉంటుంది. ఆనాడు మొండిగా వెళ్ళడం మానేస్తే నా జీవితగ్రహం మొక్క పథం యింకోలా ఉండేదేమో. మానవజీవితంలో పరాకాష్ఠకు జీవనప్రవాహపు ఒడిదుడుకుల కుదిసుండానికి కేవలం ఒక్క సంఘటనే ఆధారం కావడం. చాలాచోట్ల సంభవిస్తుంది. ఒక్కొక్క సంఘటన అక్షణంలో అల్లా జరగకపోతే జీవితకథల్లో ఎల్లాంటిపరిణామా లుంటాయో ననిపిస్తుంది. ఆ సంఘటన అట్లా జరగకపోయినా యిష్టఫలితం పొందడం వేరుమార్గాల ద్వారా సంభవించడానికి అవకాశా లున్నాయి అని వాదనకోసం అనవచ్చునేమో కాని వాస్తవంగా జరగదేమో నని నా అనుమానం. ఏమైతే నేం ఆవాళ మధు గాడిబలవంతంవల్ల వెళ్లక తప్పిందికాదు.

బంకుకు వెళ్లి పెట్రోల్ పోయించుకుని ఒక్కణ్ణే బయలుదేరాను. హోటల్లో స్వీట్స్ పాక్ చేయించి ఫ్లాస్కునిండా కాఫీ పోయించాను.

ఒక్కణ్ణే బయలుదేరానన్న అసంతృప్తి తప్పించి అంతా బాగానే ఉంది. అధమం అయిదారుగంటలు యీ పట్నపు గడబిడనీ, పరిసరాలనీ వదిలి పెట్టి ప్రశాంతమైనప్రదేశంలో ప్రకృతిమాత ఒడిలో గడప వచ్చునన్న ఆశ కలిగి ఉత్సాహం హృదయంలో నిండి ఆనందా న్నాపాదించింది.

అడయారు దాటి మహాబలిపురంరోడ్డుమీద పోతున్నాను. ఒక్కణ్ణే గాబట్టి తక్కువస్పీడ్ లో ప్రకృతి సౌందర్యం తిలకిస్తూ పోతున్నాను. ఆ ప్రశాంతంగా ఉన్న ప్రకృతిని చూస్తుంటే మనోవీధిలో ఏవేవో భావాలు పరిగెట్టాయి. కవిత్వం వచ్చేస్తుందేమో నని అనుమానంకూడా వేసింది. పద్యసాహిత్యంమీద ఏవిధమైన ఆసక్తి లేనివాణ్ణి పద్యం రాసేస్తానేమో నని భయం కూడ వేసింది. కారణం వెతికితే పరిసరాల ప్రభావం అనిపించింది. "నీరము తప్తలోహమున నిల్చి అనామకమై నశించు......" అన్న పద్యం జ్ఞాపకం వచ్చింది హఠాత్తుగా. దాంతో నాకే నవ్వు వచ్చింది

ఎన్నో ఏళ్లకి పూర్వం చదువుకున్న పద్యం. ఎన్నో మర్చిపోయాను. ఇదిమాత్రం జ్ఞాపకం ఉండిపోయింది. జీవితంలో చాలా సంఘటనలకి ఉపమానంగా నిలుస్తుంది అంచేతనేమో.

సూర్యుడు మెల్లిగా రంగులు మార్చుకుంటున్నాడు. నా ఆలోచనాప్రవంతిలో నే నీదులాడుతున్నాను. పాంయ్!- హఠాత్తుగా మ్రోగిన హారన్‌లో ఉలిక్కిపడ్డాను. ఆ ఉలికిపాటునించి తేరుకునే లోగానే మళ్ళా మూడుమార్లు మ్రోగింది ఎలక్ట్రిక్ హారన్. అద్దంలోకి తొంగి చూసాను. బ్యూక్-8. స్టీరింగ్ ముందు సుందరాంగి. మహాస్పీడ్‌లో వచ్చినట్టుంది. కారు అడ్డం సహించలేక దారికోసం హారన్ మ్రోగించింది.

ఆమె ఆత్రుత సహనరాహిత్యం చూసేవరకు నాకు చిన్న చిలిపికోరిక ఒకటి ఉత్పన్నమైంది ఆమెను ఏడిపించాలని. అంత ఆత్రుతా యితర్ల విధానాన్ని గుర్తించలేనంత తలబిరుసుతనం లేకపోతే నిశ్శబ్దంగా దారియిచ్చేసి ఉండేవాడిని. కాని సహనం లేని ఆమెధోరణి నన్ను న్యక్తుణ్ణి చేసింది. కారు వేగం హెచ్చించాను. వెనక్కి ఒక్కసారి చూసాను గాగుల్స్ కనబడ్డాయి. సరే పుట్టిన చెడ్డకోరిక ఎల్లానూ పుట్టిందిగదా కొనసాగించడం ఎల్లాగా అని రెండునిమిషాలు ఆలోచించాను. నేను స్పీడ్ హెచ్చించినకొద్దీ ఆమెకూడ హెచ్చిస్తోంది. దారికోసం నిరాఘాటంగా హారన్ మ్రోగిస్తూనే ఉంది. నాలుగైదు గజాలవారలో నడుస్తున్నాయి కార్లు. —

సడెన్‌గా వేగం అరవైకి హెచ్చించి కార్లమధ్య దూరం దరిదాపు పాతికగజాలు చేసి సడెన్‌గా బ్రేక్స్ అప్లై చేసాను. యింకేముంది! దూరం ఎక్కువ కావడంలో ఉక్రోషం ఎక్కువై ఆ అమ్మాయికూడ వేగం ఎక్కించేసేలోపున కీచు శబ్దంలో నా కారాగిపోవడం యీలోపున కార్లమధ్య దూరం నాలుగు గజాలు కావడం ఆ అమ్మాయి బ్రేక్స్ వెయ్యడానికి మహాఅవస్థపడడం జరిగాయి. యింకొక్క క్షణంలో కార్లు గుద్దుకుంటాయి. కాని యీలోగానే నేను బ్రేక్స్‌రిలీజ్ చేసి మరో పదిగజాలు పోనిచ్చాను. ఇంతలో భగీరథప్రయత్నం జరిపి ఆ అమ్మాయి కారు ఆపేసరికి అది సరిగ్గా నా కారుకి రెండుగజాలలో ఆగడంలో నా కారు యింజన్‌స్టాప్ చేసేసాను. ఇదంతా చెప్పడానికింత సేపు పట్టిందిగాని చిటికెలమీద జరిగిపోయింది.

ఆ వారిజాక్షీ నేనూ, కార్లల్లోంచి దిగాం ఒక్కసారే. ఆకోమలాంగి అతికోపంలోనూ, ఏప్రమాదం లేకుండా అనుకున్నది అనుకున్నట్టు జరిగిన సంతోషంలో నేనూను. అవి మాయిద్దరిచేష్టలలోను బహిర్గతం అయ్యాయి. కారుదిగగానే ఆమె అతివిస్పాటంగా కారు తలుపు వేసేసి పెద్ద శబ్దం చేసింది. గాగుల్స్ తీసేసి హస్తాలంకారంగా చేతిలో పట్టుకుంది. అత్యధికమైన నిదానంలో కారు తలుపు జాగ్రత్తగా వేశాను నేను.

మొట్టమొదటిసారిగా ఆమెను పూర్తిగా వీక్షించాను. సన్నగా పొడుగ్గా ఉంది. కోలమొహం పసుపుపచ్చని శరీరచ్ఛాయ. 'కన్నుంగవ యాక్రమిందునో ముఖచంద్రున్' అన్నంత పెద్దకళ్లు నళినీజయంత్ కళ్లలా. ముప్పైవేలు చేసేముక్కు. చిబుకం మరీ అంత కొనదేరి ఉండకపోతే యింకా బాగుండు ననిపించింది. సుంద్రడివి మెడ, పరిపూర్ణంగా వికసించిన అవయవాలు. సినీమాస్టార్ల ఫాషన్‌లో గిరిజాలుగా వదిలి వేయబడ్డ తలకట్టు. ఆకుపచ్చ సిల్కు రుమాలు తలమీదనించి తీసుకువచ్చి గడ్డంకింద బిగించింది, చెవులకు గాలితగలడం యిష్టంలేక గాబోలు. కుచ్చిళ్లదగ్గర అంచుల అద్దకంగల తెల్లవాయిల్ చీరా దానికి సరిగ్గా వ్యతిరేకమైన కొటుకవలుపు సిల్కుచోళీ; తాళ్లు కట్టుకునే నల్ల హైహీల్డ్ శాండల్స్. ఒక్కముక్కలో చెప్పాలంటే ఇరవైయ్యో శతాబ్దోత్తరభాగ నాగరికతను పూర్తిగా జీర్ణంచేసుకున్న మహిళలప్రతినిధి ఆమె. ఆపాదమస్తకం పరీక్షగా నేను చూడ్డంవల్ల కోపం కలిగిందిగాబోలు మొహం జేగురురంగు దాల్చింది. భ్రూకటి ముడిపడింది.

తీవ్రమైన దృష్టి నామీదికి ఒకసారి ప్రసరించింది. ఆచూపుల ప్రభావానికి, పురాణకాలమే అయితే యమధర్మరాజుగారి అతిథిగా పయనం కట్టి ఉండేవాడిని. కలికాలం కాబట్టి గడిచిపోయింది కష్టం:

“వారికడ్డంగా సడెన్‌గా స్టాప్‌చేసారే ఏక్సిడెంట్ అయితే ఏంచేసేవారు.” అంది మహా అమర్యాదగా.

ఆమెచూపిన అమర్యాద నా కోపవిస్తరణకు మరో సమిధ. ఇంకా ఏడిపించాలనిపించింది. దాని

ఛిన్నగా చేసివేసింది. "పద్మ తప్పుదారి బట్టలేదు గదా" రజని గుండెలు ఝల్లుమన్నాయి. రాత్రి అందరూ పడుకొన్నతర్వాత పదకొండూ పన్నెండు గంటలవేళ పద్మ బయటకు వెళ్లటం పరధ్యానంగా చూచిన రజనికి లీలగా జ్ఞాపకం వచ్చింది. "ఇంతసేపూ — పద్మ — పెరట్లో బంతి మొక్కలదగ్గర — వట్టినే — కూర్చుందా?" ఈ ప్రశ్నకు సమాధానము రాకముందే బంధుకోసమైన తండ్రి పౌరుషము — తనకు మిగిలిన కులగౌరవము — వంశమర్యాద — వాటిని చూచుకొనే తనకు తన చెల్లెలికి పెళ్లి చేయాలని తండ్రి చేస్తున్న భగీరథయత్నం — ఒక్కసారిగా రజని కళ్ళముందు గిర్రున తిరిగాయి. "నిజంగా తన చెల్లెలు దారితప్పితే — యింకేమన్నా వుందా — యిల్లు వల్లకాడే —" రజనిమనస్సు గద్ద తన్నుకుపోతున్న కోడిపిల్లలా రెపరెపలాడింది. మళ్లా కాస్సేపటికి బుద్ధిమారింది. "పద్మ నిజంగానే నిద్రపట్టక — వట్టినే — పెరట్లో — కూర్చుందేమో. అనవసరంగా అనుమానించటం తన మనోదౌర్బల్యాన్నే సూచిస్తుందేమో. తనకుమాత్రం నిద్రపట్టిందా. కాదంటే తాను పడుకొనే — కళ్లుమూసుకొని ఆలోచిస్తూ వుంది — తనకొక ప్రియుడుంటూ వున్నాడు కాబట్టి. సహజంగా యిప్పటింతో బయటకూడా అయివుండేది. పద్మను అనుమానించటం కేవలం తన మానసిక బలహీనతయే" అనుకొంటూ వుండగానే సన్నగా కునుకు పడుతూ పడుతూవుండటంవల్ల ప్రక్కనున్న మధుగారియింట్లోనున్న గోడగడియారం టంగ్ టంగ్ మని కొట్టిన గంటలెన్నో సరిగా తెలియలేదు రజనికి. కాని యింకా సరిగా నిద్రపట్టకముందే చిన్న చెల్లెలు రను లేపటంవల్ల లేచిన రజని అప్పటికే తెల్లగా — తెల్లవారిపోవటం స్పష్టంగానే చూసింది.

రజనితండ్రి కనకయ్య ప్రతికి చెడ్డ పెద్ద కుటుంబీకుడు. పూర్వులనాటిది మిగిలినదల్లా ప్రస్తుతముంటున్న పాత పెంకుటిల్లు ఒకటే. తాతలనాటి నుంచీ వస్తున్న కులపౌరుషము — వంశమర్యాద — ఆధారంగా చేసికొని — గ్రామపంచాయతీ బోర్డులో గుమాస్తాగిరీచేస్తూ — చేయిచాపకుండా — గౌరవంగానే — పొట్టగా కాపురం చేసుకొంటున్నాడు కనకయ్య. కనకయ్యకు రజని పెద్దకూతురు. పద్మ, గను, తర్వాతివాళ్లు. మగపిల్లలు లేరు. భార్యపోయి మూడు సంవత్సరాలు కావచ్చింది. పెద్దవాళ్లైపోతున్న పెద్దకూతుళ్లకిద్దరకూ పెళ్లిళ్లు చేయాలని భార్య వున్నప్పటినుంచీ ప్రయత్నాలుచేస్తూనేవున్నప్పటికి కట్నం యివ్వలేని కారణంవల్ల యింతవరకూ ఒక్కపిల్లకయినా సంబంధం స్థిరపర్చలేకపోయాడు కనకయ్య. అమెరికాలోనున్న మేనల్లుడు చంద్రశేఖరరావు రజనిని ప్రేమించాడని — అమెరికానుంచి వచ్చినవెంటనే పెళ్లిచేసుకొంటాడని భార్యద్వారా విన్న కనకయ్య తనకేమీ తెలియనట్లుగానే — సంబంధాలకోసం వెదుకుతూ — శేఖరం రాకకోసం ఎదురుతెన్నులు చూస్తున్నాడు. "తనకూతురు శేఖరంభార్యయైతే — అబ్బో యెంతసుఖం — ఎంత ఆనందం — శేఖరం పెద్దఆఫీసరవుతాడు — కానీ కట్నం అక్కరలేకుండా చేసుకొంటాడు —" పెదవులు దాటకుండా లోలోనే ఆనందిస్తున్నాడు కనకయ్య. కాని యింతలో తాను బాకీవున్న దూరపుబంధువు రెండవభార్యకూడా పోవటం — అతని సంపదకు వారసులు లేనికారణం చేత అతను మళ్లా వివాహమాడ సంకల్పించటం — అతని కన్ను తనకు బాకీవున్న కనకయ్య పెద్దకూతురు రజనిమీదపడటం జరిగింది. రాయబారాలు జరిగాయి. ఇంతకుముందే డిక్రీ అయిపోయివున్న రెండువేల రూపాయల అప్పుకూ ప్రతిఫలంగా తనయిల్లు వదులుకొని వెళ్ళిపోవటమూ — లేక రజనిని మాధవయ్యకిచ్చి పెళ్ళిచేయటమూ — అన్న విషయంలో కనకయ్య ఈ త్రిరపతిపై నిర్ణయించాడు. రజనీ మాధవయ్యల వివాహం నిర్ణయమైపోయింది. ముహూర్తం యింక మూడురోజులుమాత్రమే వుంది.

మరునాడు మధ్యాహ్నం మధుగారి యింటికి పనిమనిషివచ్చి వెళ్ళిపోవటం చూచిన పద్మ కళ్లు ఎర్రబడ్డాయి. కలిగిన భావాలనన్నీ మనసులోనే అణచుకొని తెచ్చికోలునవ్వుతో వచ్చి అడిగింది. "ఏం! అక్కా! మళ్లా వచ్చిందా ప్రణయలేఖ" సన్నగా నవ్వింది.

"ఇది ప్రణయలేఖకాదు పద్మా నాపాలిటి మరణలేఖ"

"పిచ్చివ! యెంతడబ్బుంటేమాత్రం యింతకండ కావరమా? సంసారుల పిల్లలకు ప్రేమలేఖలు రాస్తాడా! అక్కా! యిదంతా నువ్విచ్చినలోకువే! ఒక్కసారి నాన్నతో చెపితే సరిపోయేది. మళ్లా మళ్లా వచ్చేదికాదుగా యిటువంటి పిచ్చి ఉత్తరాలు."

"నిజమే అనుకో! కాని మధు అంత తుచ్ఛుడు కాదనుకొంటున్నాను. నిజంగా నన్ను ప్రేమించాడేమో—"

"ఏం! చూడగా చూడగా కోతి నాతి అయిందన్నట్లు నీకు మతి మారిపోయిందేమిటి?"

"అదికాదే—" సాకీగా చెప్పబోయింది రజని.

"కాక - వాడి ముఖం నాదేమిటి? ప్రేమేమిటి? ఆ పశువులో పేరు తప్ప మరేమున్నా వుందా— మంచి—ఆ శేది?" పద్మ మాటలకు రజని ముఖం కొద్ది కొద్దిగా అరుణారుణము కాజొచ్చింది. పద్మ మళ్లా అంది. "ఒక వేళ నీకే మనసుపోయిందా వాడి మీదికి?" రజని సన్నగా నవ్వి నిట్టూర్చి అంది "పద్మా! నీతో ఒక సంగతి చెప్పాలనుకొంటున్నా నే"

"ఏమిటది?"

పద్మ కంగారుపడి సంబాళించుకొంది.

"మధు నన్ను ప్రేమించినట్లుగా రెండు సంవత్సరాలనుంచీ ఉత్తరాలు పంపిస్తూవున్నాడు—నిజంగా ప్రేమ కాకపోతే యిది యింతకాలం వుంటుందంటావా."

"అందు కేమంటావ్" ఎనిమిదవ ఎడ్వర్డు సింప్సన్ సతిని పెళ్ళాడటంకోసం సింహాసనాన్ని పరిత్యజిస్తున్నాడన్న వార్త విన్నప్పుడు చర్చిలకు కలిగినంత సందేహం కలిగింది పద్మకు.

"పోనీ—మధు అయినా సంతోషిస్తాడు—నన్ను పెళ్లాడమని అడుగుతాను—" అతి సాధారణ విషయంలా చెప్పింది రజని.

"ఆ! నిన్ను పెళ్ళిచేసుకోమని మధుని నువ్వే అడుగుతావా?" తనకొడుకు తన శత్రువైనహరి నే పూజిస్తున్నాడని తొలిసారిగా విన్నప్పుడు హిరణ్యకశిపుడు పొందినంత—అబ్బురపాటు—గగుర్పాటు—సంకటపాటు—ఒక్కసారిగా పొందింది పద్మ.

"అవును. ఏం అలా అడుగుతున్నావు?"

"ఆ దుర్మార్గుడు—ఆ వ్యభిచారి—ఆ జూదరి - ఆ త్రాగుబోతు—ఆ—ఆ—పొగరుబోతుతో నీవ పెళ్లా"—బోనులోనున్న ఆడుసింహంలా అరిచింది పద్మ. ఆమె శరీరం మంగలంలోని పేలాలలాగ - చిటపటలాడిపోతూవుంది. రజని బరువుగా నిట్టూర్చి కాస్సేపాగి చెప్పింది. "బాగా ఆలోచించే మాట్లాడుతున్నాను పద్మా! మాధవయ్య తాతను పెళ్లాడటం యెలాగా తప్పదు. ఆ పెళ్ళివల్ల నాకెలాగా సుఖంలేదు —మాధవయ్యతాతకూడా సంతోషించలేడని నానమ్మకం. ఎందుకంటే సాధారణంగా ఆ స్థితిలోనున్న ప్రతి మగవాడూ భార్యమీది అనుమానంతో — తన మనస్సుతోబాటు భార్య జీవితాన్నికూడా నాశనం చేస్తాడు. ఇక మధుని పెళ్లాడితే — అతను నన్ను కోరాడు. ప్రేమించాడు. కాబట్టి కనీసం అతనైనా సంతోషిస్తాడు. మాధవయ్యతాతకు నాన్న యివ్వవలసిన ఋణం తీర్చేస్తే మధునే పెళ్లాడుతాను."

ఆమాటలు పూర్తిగా వినకుండానే దెబ్బతిన్న బురదపాములా పద్మ చరచరా గదిలోకి వెళ్ళిపోయింది. అప్పటి ఆమె నడకలో ఒక తడబాటు — ముఖంలో ఒక కళవళపాటు — స్పష్టంగా గోచరించాయి. అంతలో వరదజల్లు వచ్చినట్లుగా పద్మ చటుక్కున తిరిగివచ్చి తీక్షణంగాచూస్తూ అడిగింది. "అయితే శేఖరం బావ నేంచేదామనుకొంటున్నావ్. అమెరికా నుంచి తిరిగివచ్చి యిదేమిటంటే యేంచెపుతావ్"

"శేఖరం సంగతి దైవానికే విడిచి పెడుతున్నాను పద్మా! నీకింకా చెప్పలేదు. అన్నీ స్థిరమైపోయాయి. రేపు సాయంత్రంలోపుగా బాకీ తీర్చటంగాని—ఎల్లుండి నన్ను మాధవయ్యగారికిచ్చి పెళ్లి చేయటంగాని జరగాలి. బాకీతీర్చటం యెలాగా లేదు కాబట్టి—యీ పెళ్లి యెలాగా తప్పదు. అందుకేగా నాన్న మొన్ననగా తాతగారియింటికి వెళ్లాడు పెళ్లిఖర్చుకు డబ్బు తేవటానికి. ఒకవేళ నే ననుకొన్నట్లుగా మధు అంగీకరిస్తే మాధవయ్య తాతకు బదులు మధు నామెడలో మంగళసూత్రం కడతాడు. కాబట్టి యిక శేఖరం బావమాట లేనేలేదు. బావ యివాళే వస్తాడని నువ్వు జోస్యం చెప్పినా నేను నమ్మను."

"అయితే మధుకు ఉత్తరం రాస్తావా?"

"కాదు. నేనే వెళతాను స్వయంగా — రాత్రికి —"

"ఆ! రాత్రికి—స్వయంగా —ఒంటరిగా — అతనిదగ్గరకు వెళతావా" ఒక్కసారి జడ విదిల్చికొట్టి "తోడురమ్మని నిన్నేమాత్రం అడగను. నేను రాను. మధుగాడి మొఖంచూస్తేనే నాకు ఒళ్లు మంట. ఆ పాపిష్టిముఖం చూస్తే పంచమహాపాతకాలూ పట్టు

కుంటాయి" అనేసి క్షణం నిలబెట్టకుండా వెళ్ళి పోయింది పద్మ. రజని తనలో తాను నవ్వుకొంది. "పద్మ అన్నట్లుగా మధు త్రాగుబోతు. జూదరి కాక పోయినా—అతనంటే తనకూ అసహ్యమే — కాని పద్మలా తాను కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పగలదా! అబ్బో — యేదీ తనకా ధైర్యం? ఈ మెత్తదనం చూసేకాబోలు మధు మరీ ధైర్యంగా కబురు లంపు తున్నాడు అదే పద్మకయితే కబురు దెచ్చినదాన్ని పంపినవాడినీకూడా వళ్లు రాలేటట్లు కొట్టేది. ఈ సంగతి తెలిసేకాబోలు మధు పద్మమాటయినా తల పెట్టడు. ఈరోజుల్లో పద్మలాగే వుండాలేమో" అను కొంటూవుంటే క్రితంరాత్రి తాను పద్మమీద పడిన అనుమానానికి కారణం కేవలం తన బలహీనతే అను కొంది రజని. నిప్పులాంటి తన చెల్లెల్ని అనుమా నించినందుకు నొచ్చుకొంది రజని.

ఆ రాత్రి బహుశా పదిగంటలై వుంటుంది. రజని పద్మతో చెప్పి మధు రూముకు బయలుదేరింది. "నాతో చెప్పటా వెందుకు — మధు దగ్గరకు కాకపోతే మహాసముద్రంలోకి వెళ్లు—నీయిష్టం" అంటూ రుసరుస లాడుతూ ముసుగుతన్ని పడుకొంది పద్మ. "తన చెల్లెలికి తనమీద యెంత ప్రేమ. తన సుఖంకోసం ఆమె నిండు మనసుతో యెంతగా ఆకాంక్షిస్తూ వుంది" అనుకొంటూ రజని ప్రహరీగోడ తిరిగి గేటులోనుంచి మల్లెపందిరిఅవతలనున్న మధు గది దొడ్డిగుమ్మంలోకి వెళ్ళి నిలుచుంది. సిగరెట్టు కాలుస్తూ పడుకొని ఆలోచిస్తూవున్న మధు గాజుల గలగలలు విని—యిటుచూచి—రజనిని చూచి — భగవంతుని చూచిన నాస్తికునిలా. సంభ్రమాశ్చర్యాలతో కొయ్య బారి పోయాడు. కాస్సేపటికి తేరుకొని అన్నాడు "రజనీ—నువ్వా! రా రజనీ—లోపలకు రా" అతని మాటల్లో చంటిపిల్లాడిలాగ నత్తికూడా వచ్చింది. రజని లోపలకు వచ్చి తలుపు ఓరగా వేసి గడియపట్టుకొని తలుపు ప్రక్కనే నిలబడివుంది. "ఇలా వచ్చి యీ సోఫాలో కూర్చో రజనీ—" యిప్పటికి పూర్తిగా సర్దుకొని అన్నాడు మధు.

"నేను కూర్చోవటానికి రాలేను మధూ."

"మరి..." తానేదో మహా తెలివిగా మాట్లాడి నట్లుగా ఫోజు పెట్టాడు.

"హాస్యానికిది సమయం కాదు మధూ" రజని కంఠంలో కోపచ్ఛాయలు మందమందంగా వినిపిం చాయి.

"మరి దేనికి సమయం? రాకరాక వచ్చావు. ఇన్నాళ్ళకు నీకు మనసు మళ్ళింది. రా రజనీ! యెంత ఆనంద సమయం."

"మధూ! నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?"

"ఇంకా సందేహమా! మన ప్రేమసాక్షిగా ప్రేమిస్తున్నాను."

"అయితే ఒక మాట అడగనా."

"అడుగు. ఒకటేమిటి? లక్ష అడుగు" పారి జాతానికై అలిగి కూర్చున్న సత్యభామకు కృష్ణుడిచ్చి నట్లుగా హామీ యిచ్చాడు. "నన్ను పెళ్ళాడతావా మధూ" రజని గొంతులోని జీర అపశృతిలా కఠో రంగా వినిపించింది. పెళ్లి అనేటప్పటికి మధు గుండెలు గుభిల్లుమన్నాయి. ఎంతో శ్రమపడి మాయ చేసి బంధించిన శివాజీ ఖైదునుంచి తప్పించుకొని పారిపోయాడని విన్నప్పుడు ఔరంగజేబు పొందినంత నిర్విణ్ణతను పొందాడు మధు. "పె...ళ్లా..." మూలిగినట్లుగా అన్నాడు. "అవును. ఏం అలా కంగారుపడుతున్నావ్" నిలవేసింది రజని. "ఏంలేదు. పెళ్ళంటేను—" ఓడిపోయిన యం.యల్.ఏ.లాగ— నిస్సహాయంగా — చేతగానితనంగా — అన్నాడు మధు. "అవును. పెళ్ళాడాలి. ఆలోచించటానికి కూడా వ్యవధి లేదు. ఇష్టమో కాదో యిప్పుడే చెప్పాలి" ఆమె గొంతుకలో గాద్గద్యము తొణికిస లాడుతూ వుంది. మధుకు ధైర్యం వచ్చింది.

"అంత తొందర యేమొచ్చింది రజనీ."

"నీకు తెలియనిదేముంది మధూ! మా నాన్న మాధవయ్యగారికి రెండువేలు బాకీవున్నాడు. అది డిక్రీకూడా అయిపోయింది. ఈ లోకువ చూచి మాధ వయ్యగారు నన్ను తనకిచ్చి పెళ్ళిచేయమని పట్టు బట్టారు. చేయకపోతే యిల్లు రేపే వేలం అయిపో తుంది. తక్కిన పిల్లల క్షేమం ఆలోచించి మానాన్న యీ పెళ్లి చేయటానికే అంగీకరించాడు మధూ!" ఆమెకంఠం దుఃఖంలో పూడుకుపోతూవుంది. "మధూ! మా నాన్న బాకీ తీరిస్తే నిన్ను పెళ్ళాడ టానికి సిద్ధంగా వున్నాను మధూ" శత్రుతుల్యమైన

మధుని తనంతట తాను తనను పెళ్లిచేసుకోమని అర్థించటం రజనికి—తప్ప త్రాగివచ్చిన భర్తచేత తప్పలేకుండానే తన్నులుతింటూవున్న యిల్లాలికి వున్నంత— కష్టంగా వుంది. రజని మూడవ పెళ్ళి ముసలాడి భార్యకాబోతూవుందని తెలియగానే మధుమనసు కొక వింత యాలోచన తట్టింది. "ఆమె నూర్జహాను— తాను అపర జహాంగీరు" లోలోపల నవ్వుకొన్నాడు. "నీకు నామీద ప్రేమ లేదుగా. ఇక నేను పెళ్లాడితే మాత్రం నీకు సుఖమేమిటి?" "నా సుఖం సంగతి విడిచిపెట్టు మధూ! నువ్వు నన్ను ప్రేమించావు— వాంఛించావు— కాబట్టి కనీసం నువ్వయినా ఆనందిస్తా వనుకొన్నాను" మధు వెటకారంగా నవ్వి అన్నాడు. "నా ఆనందంకోసమా! కాదు నీస్వార్థం కోసం" ఆ మాటలు రజనికి కటువుగానే వినిపించాయి. అయినా తాపీగానే చెప్పింది. "కాదు మధూ! నా స్వార్థంకోసమైతే నిన్నే పెళ్ళాడ నక్కరలేదు చెప్పంటావా? మాధవయ్యగారుకూడా నీలాంటి లక్షాధికారే. ఏం? పెళ్ళి అనడంతో కష్టంగా వుందా."

"నాకయితే యిష్టమే.." అర్థోక్తిగా చూశాడు

"మరీ—" అర్థం తెర మేమిటన్నట్లుగా చూచింది.

"మా నాన్న—"

"ఊ! మీనాన్న—వద్దంటాడా."

"వద్దనడు. కాని కట్నం కావాలంటాడు" నసిగేడు మధు.

"ఒక్క డెబ్బయివేలు—అవునా" మెడకు దగ్గరగా బల్లెపుపోటు తిన్న త్రాచుపాము చేయగలిగింది లేక బుసకొట్టినట్లు—యేమనలేక బాధగా నవ్వి అంది "మరి నువ్వు నన్ను ప్రేమించావుగా."

"ఆమాట అక్షరాలా నిజమే అనుకో."

"అంత ప్రేమించినవాడివు మీ నాన్నకు నచ్చచెప్పి కట్నం లేకుండా పెళ్ళాడలేవా" సవాలు చేసినట్లడిగింది.

"అది నా వల్లకాదనుకొంటున్నాను రజనీ" నిర్మొగమాటంగా అన్నాడు మధు పెడమొగం పెట్టి. రజనికి అరికాలిమంట తలకెక్కింది. "అవును— పెళ్ళాడటమెలా వీలవుతుంది. ప్రేమించానంటూ అయిచ్చకాలాడి — చేతికందితే బాధ్యతారహితంగా అనుభవించి వదిలేయటమైతే వీలవుతుంది కాబోలు. ఇంతకాలంనుంచీ యింటిచుట్టూ యింతగా తిరుగుతూవుంటే నిజంగా ప్రేమించావని భ్రమించాను. కాని యింత గోముఖవ్యాఘ్రాని వనుకోలేదు." మధుకు కూడా కొంత చురుక్కుమన్నట్లుంది—నిరసనగా అన్నాడు. "మహా చెప్పొచ్చావ్! నువ్వు మాత్రమేంచేశావ్? ఎన్ని కబుర్లంపినా ఒక్కనాడైనా నా వైపు కన్నెత్తి చూశావా? ఇప్పుడు ముసలి తాతను పెళ్లాడవలసివచ్చింది కాబట్టి నామీద మహా ప్రేమున్నదానిలా నటింప వచ్చావు—సంగనాచి." సీరియస్‌గా చూచి కాలుస్తున్న సిగరెట్టు నేలకేసి కొట్టి కొత్త సిగరెట్టు వెలిగించాడు. "నేను నిన్ను ప్రేమించానని పొరపాటునకూడా అనలేను మధూ— ఈ పరిస్థితుల్లో ముసలాడినే కాదు—మ్రానును_పెళ్లాడినా—అసలు పెళ్లాడకపోయినా ఒకటే నాకు. సెలవ్!" అనేసి చటుక్కున తలుపుతీసి బయటకు వెళ్ళిపోయింది రజని. ఎప్పటికైనా తన "వంటయింటి కుందేలే" అన్నట్లు గుండెల్లో నవ్వుకొని అన్నాడు మధు "మంచిది పిల్లా! కాని ఒక మాట— నీకు డబ్బు కావాలంటే పట్టుకువెళ్ళు—రెండు వేలు కాదు నాలుగువేలిస్తాను నాకు ప్రియురాలుగా మాత్రముండు.- పెళ్ళంటావా నీయిష్టం—" అప్పటికే నాలుగుబారలదూరం వెళ్లిన రజని తోకత్రొక్కిన పన్నగాంగనలా గిరుక్కున వెనక్కు తిరిగి — సముద్రకెరటంలాగ వచ్చి "మధూ! కొంత కళ్లు తెరచి మాట్లాడు. మనిషిగాపుట్టాక మనిషిగా బ్రతికటం నేర్చుకో- ఒక పయోముఖవిషకుంభమునుంచి పొందిన ప్రతిబిందువు విషముమాత్రమే అని నాకు తెలుసు మధూ." అనేసి తారాజువ్వలా దూసుకుపోయింది రజని. పదిలక్షలరూపాయలపజిల్లో ఫస్టుప్రైయిజు వచ్చిందని టెలిగ్రాంవస్తే ఉబ్బి తబ్బిబ్బయిపోతూ వున్న జూదగానికి వెనువెంటనే "క్షమించండి— మీకు కాదు" అని మరొక టెలిగ్రాంవస్తే యెలా వుంటుందో అలావుంది అప్పటి మధు మనసు.

అర్థం తెలియకుండా కంఠస్థంచేసిన యింగ్లీషు పద్యాన్ని విశ్వవిద్యాలయపరీక్షలో వ్రాసి ప్యాసయినట్లే— రజనీమాధవయ్యగార్ల కళ్యాణం అయ్యిందంటే యిర్యందనిపించారు. కనకయ్య పెదాలు నవ్వుతూ

వున్నా కళ్లు యేడుస్తూ వుండేవి. పద్మ ఒక్క పెట్టున బావురుమని యేడ్చేది. ఎంతసేపు వూరుకోబెట్టినా వూరుకోలేకపోయింది పెళ్ళినాడు. చివరకు రజని వచ్చి "వూరుకో పద్మా! నాకు లేనిబాధ నీకెందుకు — శుభమా అంటూ కన్నీళ్లు పెట్టకమ్మా" అనేటప్పటికి — ప్రపంచాన్ని జయించాలని ఆశించి తుదకు తన దేశములోనే బహిష్కరింపబడిన నెపోలియన్ లాగ — పూర్తిగా ఓడిపోయింది పద్మ. పెళ్ళయిన మూడవనాడే రజని అత్తవారింటికి వెళ్ళిపోయింది. కనకయ్య యింటికి యాభై, అరవై గజాలదూరంలో అవతలవీధిలో వుంది మాధవయ్యగారి యిల్లు. రెండు మూడురోజులకొకసారి రజని పుట్టింటికి వచ్చి చూచి వెళుతూ వుండేది. రజని వచ్చినప్పుడల్లా ఆమెకు జరిగిన అన్యాయాన్ని తలచి తలచి యేడ్చేది పద్మ. పద్మ పెళ్లిగురించి మాట్లాడేది రజని. ఒకసారి మాటల సందర్భంలో ఆ మాట వచ్చింది. అగ్గిమీద గుగ్గిలంలా భగ్గుమంది పద్మ. "చాలక! యింకొ అటువంటి వేషాలు వేస్తే చెప్పుతీసుకొని పళ్లు రాలగొడతానని కబురంపు" అంటూ పళ్లు పటపటలాడించింది పద్మ. రజని సరదాగా నవ్వి వేళాకోళంగా అంది. "ఇంక నన్ను మరిచిపోతావులే! దగ్గరగా నువ్వున్నావుగా — మళ్లా నీమీద పట్టిస్తాడు" రజని నవ్వు చూచి సహించలేక గుండుదెబ్బతిన్న ఆడుపులిలా అరచింది పద్మ. "ఏమిటే! నామీదా — అసలు నాకింక కన్నెత్తిచూడమని చెపుతాను — ఇంక యీ వూళ్లో బ్రతికి బట్టకడతాడా — తల గొరిగించేయనూ" రజని నవ్వి అంది. "నువ్వెంతటిదానవే చెల్లీ — నువ్వంటే మగాళ్లకే కాదు మగవాడన్న ప్రతివాడికీ హడలే — మా మరిదికేం చేస్తావో మరి —" చెల్లెలి చెంపలు నిమిరి ముద్దు పెట్టుకొంది రజని.

మాధవయ్యకు యే క్షణంలోనూ పనిగాని తీరుబడిగానీ వుండదు. ఇంట్లో వున్నంతసేపూ పిల్లలు లేరని బాధపడిపోవటం — వీధిలోకి వెళితే కనుపించిన వాడినల్లా పిలిచి ఎందుకో ఒకందుకు చీవాట్లు పెట్టటం మాధవయ్యగారి ముఖ్యమైనపనులు. గ్రామానికంతకూ ధనికుడు కాబట్టి పెద్దగా చెలామణీ అయిపోతున్నాడు.

ఆవేళ రజని కెందుచేతనో మనసు బాగా లేదు. దిష్టితగిలిన చంటిపిల్లలలాగ యేమీ లేకుండానే మాటిమాటికీ త్రుళ్లిపడుతూ వుంది. మనస్సు వున్నట్టుండి ఒక్క గంతులో అమెరికా వెళ్లి వాలింది. ఆ పరధ్యానంలో బంగారు పొన్నుకఱ్ఱ టకటక శబ్దంగానీ మాధవయ్య పిలుపు గానీ వినలేకపోయింది రజని. "ఏమే నిన్నే —" కొంచెం గట్టిగానే అన్నాడు మాధవయ్య.

"ఆ! పిలిచారా! వస్తున్నా" ఉలుక్కిపడి లేచి నిలుచుంది.

"ఎందుకండీ పిలిచారు?" ఇప్పటికి పూర్తిగా మెలకువ వచ్చింది.

"భర్త భార్యను పిలవటానికికూడా కారణం కావాలా" నెరసి నెరసి వున్న కోరమీసాల్లోంచి సన్నగా ముసిముసి నవ్వులు నవ్వాడు మాధవయ్య. ముదిమి రెండవ బాల్య మన్నట్లుగా ఆ వృద్ధునిలో తిరిగి యౌవనలక్షణాలు పొటమరించాయేమో! ఆ మాటకు రజని యేలా అర్థం చెప్పుకుందో గానీ ముఖం మాత్రం గంభీరంగా మారిపోయింది. ఆ యెడబుదనాన్ని తగ్గించుకోవటానికి ఆమెకు కొద్ది క్షణాలు పట్టాయి. "చాల్లే — చెప్పండి — ఎందుకూ పిలిచారు?" ఎంతో తియ్యగా మెత్తగా అడిగింది. ఆమె మాటల్లో నిండు భార్యాత్వాన్నీ — ఆప్యాయతను చూడగలిగిన మాధవయ్య మనసు సంతృప్తితో పులకించింది. రజనిలో తన మొదటిభార్యను చూడగలిగాడు మాధవయ్య.

"మాకు — మన శేఖరాన్ని నువ్వెరుగుదువు కదూ — నువ్వెరుగకపోవటమేమిటి మా మేనత్త కొడుకే కదూ — నాకు స్వయానా వేలువిడిచిన పెదతాతగారి మనుమడి కొడుకు — నీకు తెలిసేవుంటుంది - నాలుగేళ్ళ క్రితం అతన్ని ప్రభుత్వం చదువుకోసం అమెరికా పంపించింది —" శేఖరం అనేటప్పటికి అతని క్షేమం వినాలని అహమహమికతో తహతహలాడిపోతూ వున్న రజని మాధవయ్య చెప్పే పాత పురాణాన్ని వినలేక మధ్యలోనే ఆపుచేసి అడిగింది. "శేఖరం బాపున్నాడా అండీ!" తాను చదువు చెప్పించి కొడుకులా చూచుకొంటూవున్న శేఖరం అంత గొప్పవాడయ్యేసరికే మాధవయ్య నిలువునా సంబరపడిపోతూవున్నాడు. మధ్య మధ్య తన కన్న కొడుకు అలాగ అయితేనా అనుకొంటూ నిట్టూరుస్తూ రజనివంక దీక్షగా చూస్తూవున్నాడు.

ఇంతలో రజని మళ్లా అడిగింది "ఏమండీ! ఎలా వున్నాడు శేఖరం?" "దొరగా వున్నాడు — చదువు పూర్తయిపోయిందట — యింటి క్రితమే వచ్చేశాడు — ముందుగా టెలిగ్రాం యివ్వటానికికూడా టయిము లేకపోయిందట పాపం". శేఖరం వచ్చాడనగానే — కనకాభిషేకం పొందినప్పుడు శ్రీనాథకవికి కలిగినంత ఆనందం కలిగింది రజనికి. "మన రాష్ట్రానికంతకూ పెద్ద యింజనీరు అవుతాడట — రేపో యెల్లుండో వెళ్ళిపోవాలట — అందుకు రేపే మన యింట్లో విందు ఏర్పాటు చేస్తున్నాను." మనుచరిత్ర కృతి స్వీకారం నాడు శ్రీకృష్ణదేవరాయలు పొందినంత మహోహర్షాన్ని పొంది పొంగిపోతూ బయటకు వెళ్ళిపోయాడు మాధవయ్య. రజని మనస్సులోని ఆనందవిచారాలు గంగా యమునల్లాగ — తెల్లగా — నల్లగా — కలసిపోయి — అంతర్వాహినులై ప్రవహిస్తున్నాయి. పగిలిన కుండపెంకుల్లా చెల్లాచెదరైపోయిన అనేకవిధ భావాలతో సతమతమవుతూ వుంది రజని.

ఆ సాయంకాలం అవ్యక్తచిత్తంతో రజని వీధిచావడిలో రేడియోముందు కూర్చుని వుంది. మరెవ్వరూ లేరు. మనసు శేఖరంమీదకి పోవటంతో రేడియో వినలేక దాన్ని ఆపుచేసి ఆలోచిస్తూ వుంది. "శేఖరం బావతో మాట్లాడటమెలాగ? మాట్లాడకుండా వుండటమెలాగ? చనిపోయిన మాధవయ్య భార్యలను పిలిచినట్లుగా తననుకూడా "పిన్నీ" అని పిలుస్తాడా? ఘోరం! ఏముఖం పెట్టుకొని తాను బావను — మీదుమిక్కిలి వలచి వలపించుకొన్న ప్రియుని — కొడుకులా భావించగలదు?" ఇలాంటి భావాలతో సంఘర్షణపడుతూ వుండగా వీధిలో ఎవరిదో కేక వినిపించింది. "మాధవయ్యగారూ" అంటూ మళ్లా కేక! "ఎవరువారూ" అంటూ రజని యింకా గుమ్మంలోకి వెళ్ళకముందే మధు లోపలకు వచ్చేశాడు. మధును చూడగానే రజనిముఖం — తుఫాను పట్టబోయేముందు ఎరుపెక్కిన ఆకాశంలాగ — గంభీర గౌరవర్ణారుణారుణమైపోయింది. ముందుగా అతనే ప్రారంభించాడు.

"మాధవయ్యగారింట్లో లేరని చెప్పబోతున్నావు కదూ! నీకా శ్రమ అక్కరలేదు. లేరని తెలిసే యిలా వచ్చాను."

"అయితే మరెందుకు వచ్చావ్" వంటిమీద ప్రాకుతూవున్న జెర్రిని విదిలించినట్లుగా సీత్కారంతో అడిగింది.

"నీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి."

"అక్కరలేదు. తమరు వెంటనే వెళ్ళిపోతే మంచిది."

"ముందు నేను చెప్పేది విని తర్వాత నీయిష్టం వచ్చినట్లుగా చెయ్" అంటూ ఆమె మాట్లాడటానికి అవకాశం యివ్వకుండానే మధు ప్రారంభించాడు. "శేఖరం ఎల్లుండి వెళ్ళిపోతాడు — మనంకూడా యెల్లుండే లేచిపోదాం — మీ రిద్దరూ ప్రేమించుకొన్నట్లు ఈ వూరివాళ్లందరూ యెరుగుదురు కాబట్టి శేఖరమే నిన్ను తీసుకుపోయాడనుకొంటారు. నీవు శేఖరం చేసిన దగాకు పగ తీర్చుకోవచ్చు — పోలీసులు అతన్నే పట్టుకొంటారు. మన మీలోపులో బొంబాయి —" అతనిమాట యింకా పూర్తికాకముందే చెంపలు పేలిపోయేటట్లు ఛెళ్లు — ఛెళ్లుమని రెండు చెంపకాయలు తగిలాయి. మధు పిడుగుపడినవాడిలా — మాడిపోయాడు. రజని — మహిషాసురమర్దనంనాటి కాళికాదేవిలాగ — మహోగ్ర రౌద్రరూపిణియై మూడవసారి చేయెత్తి సిద్ధంగా వుంది. లంచంతిన్న గుమాస్తా పట్టుబడిపోయి అధికారిముందు నేరం ఒప్పుకొన్నట్లుగా నిస్సహాయంగా చూచి "రజనీ" బాధగా అన్నాడు. మరొకసారి చెంప ఛెడేలుమంది. "నోరు ముయ్! స్త్రీ అంటే హృదయం లేని జంతువనో మెదడులేని యంత్రమనో అనుకొంటున్నావు కాబోలు నీయిష్టం వచ్చినట్లుగా ఉపయోగపడటానికి! జాగ్రత్త — పో బయటకు!" అల్లసాని పెద్దనామాత్యుని పద్యకుఠారానికి వెరగంది వెనుదిరిగిన గజపతిలాగ ముఖం పైకెత్తకుండా వెళ్ళిపోయాడు మధు.

ఆ మరునాడు శేఖరం గౌరవార్థం మాధవయ్యగారియింట్లో విందు జరిగింది. గ్రామపెద్దలు చుట్టుపట్లనున్న ఉద్యోగులు చాలమంది హాజరయ్యారు. కాబోయే యింజనీరు శేఖరాన్ని యెన్నో విధాల ప్రశంసించారు. అవేవీ శేఖరం చెవి కెక్కటంలేదు. కళ్లు రజనికోసం దూరదర్శిని యంత్రాలుగా వెదుకుతున్నాయి. కనీసం గొంతుకయినా వినిపించదేమా అని శేఖరం మహోత్కంఠతో నిరీక్షిస్తున్నాడు. కడకు "శెలవు వెళ్ళిపోతున్నాను — వెళ్లిపోయేముందు

కడసారి దర్శనమిస్తే సంతోషం—ఆశీర్వదించి పంపిస్తావని నమ్ముతున్నాను—" అని చిన్న చీటీవ్రాసి రమచేతికిచ్చి పంపించాడు.

ఆరాత్రి మాధవయ్యతో చెప్పి రజని పుట్టింటికి వచ్చింది. రజని వచ్చేటప్పటికి రమ నిద్రపోతూవుంది. పద్మ యేడుస్తూవున్నట్టుగా అనిపించింది రజనికి. కాని వెంటనే లేచి కనుపించకుండా కళ్లు తుడుచుకొని బలవంతంగా చిరునవ్వు తెచ్చుకొంది పద్మ. కనకయ్య పద్మపెళ్ళిసంబంధానికని పొరుగూరు వెళ్ళాడు. అక్కాచెల్లెళ్ళిద్దరూ కాస్సేపు లోకాభిరామాయణ పారాయణ చేసినతర్వాత "శేఖరంతో మాట్లాడటానికి" వచ్చానని—చెప్పింది రజని.

"ఈ రాత్రే వెళ్ళకపోతే రేపు పగలు వెళ్ళకూడదా" అడిగింది పద్మ.

"నలుగురి కళ్ళల్లోను పడటం నా కిష్టం లేదు."

"కళ్ళల్లో పడకపోతే పాపం కాకపోతుందా."

"నేనే పాపకార్యం చేయటానికీ అక్కడకు వెళ్ళటం లేదు."

"అవును. పాపం అనుకొంటే నువ్వలా చేయనే లేవుగా—తండ్రి సంగతీ—భర్త సంగతీ తెలిసీకూడా—అర్ధరాత్రివేళ పరపురుషునిదగ్గరకు—అందులోనూ యింతకుముందు ప్రేమించుకొన్న మేనత్తకొడుకు దగ్గరకు—ఒంటరిగా వెళుతున్నావంటే — యెంత సాహసం" లాయరులా వాదించింది పద్మ.

"పద్మా—నన్ను అపార్థం చేసుకోకు."

"నేను చేసుకోకపోతే లోకం చేసుకోదా—కట్టుకొన్న మగడు చేసుకోడా—" జ్యోతిషం చెప్పింది పద్మ. "చెల్లీ! యిందులో నీకు తెలియని దాపరికమేమీ లేదు. బావా నేను ఎంతగా ప్రేమించుకొన్నామో—మా కెటువంటి పాట్లు పట్టాయో చూస్తూ నేవున్నావు. బావ రేపు వెళ్ళిపోతూవున్నాడు. ఒక్కసారి మాట్లాడటానికి రమ్మంటే వెళుతున్నాను. బహుశా యీక జన్మలో మరెప్పుడూ బావతో మాట్లాడవలసి రాదనుకొంటున్నాను పద్మా" జాలిగా అంది. "అయితే బావదగ్గరనుంచి తిరిగి వస్తావా" పుల్లవిరిచి కొ(?)రడిచినట్టు—కఠినంగా అంది పద్మ. "అంటే—" అర్థంకాక తెల్లముఖం పెట్టింది రజని. "బావ రేపు వెళ్ళిపోతూవున్నాడుగా—" అర్థోక్తిలో "నువ్వుకూడా" అన్నట్లు సాగ తీసింది పద్మ. అప్పటికి అర్థమయ్యింది రజనికి. గుండెల్లో గునపాలు గ్రుచ్చినట్లుగా లోలోన రోదించింది. పద్మమీద కలిగిన అసహ్యంతో—కోపంగా "రాను—" ధీమాగా అంది రజని.

"అక్కడనే పడుకొంటావా—" మాట మార్చి పోటుపొడిచింది.

"అవును—" అదే కోపం—యేడుస్తూవున్న చంటిబిడ్డను సముదాయించలేక—విసుగెత్తిన తల్లి "ఏడు—చావు" అని వ్యతిరేకంగా అన్నట్లే—రజని మాటల్లో వ్యతిరేకభావం స్పష్టంగా మెరసింది.

"ఈ సంగతి వింటే పిల్లలకోసం తపసు చేస్తున్న మా మనిలిబావగారేమనుకొన్నా— నాన్న వింటేమాత్రం సహించడు."

రజని వళ్ళు మండిపోయింది—చాచి చెంపమీద ఛెళ్లుమనిపించింది. "పద్మా—హద్దూ పద్దూ లేకుండా నోటికి వచ్చినట్లుగా మాట్లాడకు. నీ మనస్సింత నికృష్టం—యింత పాపభూయిష్టం అని నేనెప్పుడూ అనుకోలేదు. మంచిగా ఆలోచించటం నేర్చుకో" అధికారస్వరంతో మందలించింది రజని. పద్మ పరాభవంతో—పౌరుషం పట్టలేక—కసిగా యేడుస్తూ ముసుగుబిగించి పడుకొంది. ఉరిశిక్షను విధిస్తూ న్యాయమూర్తి తీర్పు చెప్పేముందు బోనులో వున్న హంతకుడు కంపించిపోయేటట్లు — యేదో మహాప్రమాదం వస్తున్నట్లుగా పద్మ వణికిపోతూవుంది.

కనకయ్యగారియింటికి రెండిళ్లు అవతలవుంది శేఖరంయిల్లు. వృద్ధురాలయిన తల్లి మధ్యగదిలో నిద్రపోతూవుంటే శేఖరం వసారాలో పడుకొని రజని రాకకోసం యెదురుచూస్తున్నాడు. మెత్తని అడుగుల చప్పుడు పసిగట్టి యెదురువచ్చి రజనిని లోనికాహ్వానించాడు. "వచ్చావా రజనీ—రా—" రజని లోపలకు వచ్చి చాపమీద కూర్చుంటూ అంది: "నా హృదయం పిలిచినతర్వాత రాకుండా యెలావుంటుంది బావా" శేఖరం కళ్ళల్లోకి చూడలేకపోయింది.

"రజనీ — నీ హృదయంలో యింకా నాకు తావుందా"

"అనవసర ప్రశ్న! ప్రయోజనంలేని జవాబు కోసం యింకా యెదురు చూస్తున్నావా బావా" శేఖరం నిలువునా నీరయిపోయాడు. "రజని యెంతగా మారిపోయింది. ఎంత తియ్యటిమాటలు యెంత కటువుగా వినిపించాయి." విస్తుపోయాడు శేఖరం.

"ఎంతపని చేశావు రజనీ"

"నేను చేయగలిగిందింతే బావా"

"కాదు. నువ్వవద్దంటే యింతకాలం ఆగినవాళ్లు యీ నాలుగురోజులు ఆగకపోనుగా — నేనింక తిరిగి రానేరాననుకొన్నావా? వచ్చినా నిన్ను పెళ్లాడననుకొన్నావా — నా మనసు నీకు తెలియదా"

"తెలుసు బావా — కాని పరిస్థితుల ప్రభావం — విధి —"

"కాదు. నన్నవమానించావు. ఏదో పెద్ద ఆఫీసరునయ్యానని — నిన్ను మరిచిపోయాననుకొన్నావు" ఏదో ఉద్రేకం ముంచుకు వచ్చింది. ఆవేశంతో రజని చేతులుపట్టుకొని "రజనీ — యెలా మరిచిపోగలను రజనీ నిన్ను —" దగ్గరకు లాక్కోబోయాడు. "శేఖరం! మూర్ఖుడవైపోకు — చేతులు విడిచిపెట్టు —" అంటూనే చేతులు లాగికొని లేచి దూరంగా నిలుచుంది. "నీ చేతులు విడిచి యెలా బ్రతికగలను రజనీ"

"ఈ పరిస్థితుల్లో నేను చేయగలిగిందిమాత్రమేముంది బావా"

"మావయ్యగారికి విడాకులిచ్చేసేయ్ రజనీ! మీ నాన్న ఋణం యెంతవున్నా తీరుస్తాను. నిన్ను నేను పెళ్లాడతాను — విడాకులిచ్చేసేయ్ రజనీ —" ఒకసారి తీక్షణంగా చూచి అంది.

"తిన్నయింటివాసాలను లెక్కపెడుతున్నావా బావా? నిన్నింత అభివృద్ధిలోకి తెచ్చిన ఆయనకే యింత ద్రోహమా"

"కావచ్చు — కానీ — చేతులారా నా జీవితాన్ని నేను నాశనం చేసుకోలేను రజనీ — కావాలని నువ్వు నాశనం చేయకు — రజనీ —"

"పిచ్చివ్యామోహంలోపడి వివేకాన్ని పోగొట్టుకోకు బావా! నీకు అంకితమైన హృదయాన్ని మరొకరికివ్వలేనట్లే మరొకరి కర్పించిన శరీరాన్ని నీకెలా యివ్వగలను బావా"

"నా గుండెల్లోని మంటను చూడకుండా మాట్లాడుతున్నావు"

"అవును బావా! నా గుండెలు మండిమండి మాడి మసయిపోతాయి"

"అందుకే నేను చెప్పినట్లు చేయి. తిరిగి జీవితానందాన్ని పొందవచ్చు"

"కాదు శేఖరంబావా! యింతవరకు కళంకపడని మన చరిత్రను జీవితాంతం పవిత్రంగానే నిలుపుకొందాం. ఇక నామాట మరిచిపో బావా" ఆ మాటల్లో యేదో అనుమానం — ఏదో అసంతృప్తి — స్పష్టంగా కనుపించాయతనికి. ఏమూలనుంచో యింతవరకు అణచిపెట్టబడిఉన్న — మనోదౌర్బల్యం ఒక్కసారిగా ఉబికి బయటకు వచ్చింది. మానవసహజమైన అనుమానం — అసూయ — అతన్ని దారి తప్పించాయి. "రజనీ! నువ్వు నన్ను నిజంగా ప్రేమించలేదు. అప్పుడు — ఆ రోజుల్లో కట్నం లేకుండా పెళ్లి కాదని భయపడి — పెళ్లాడతాను కదా అని — నన్ను ప్రేమించినట్లుగా నటించావు. ఇప్పుడొక లక్షాధికారి భర్తగా వచ్చాడు కాబట్టి నా అవసరం తీరిపోయింది. నా అమ్మ అందుకే యేడ్చింది — పెళ్ళినాడు నా మాటయినా తలపెట్టకుండా కులుకుతూ తిరిగేవటగా — యిప్పుడర్థమయ్యింది నీ ప్రేమ. ఇష్టంలేదని చెప్పక యెందుకలా "పవిత్ర ప్రేమ" అంటూ డొంకతిరుగుడుగా మాట్లాడుతావు — వంకనాచిభాగ" శేఖరం ఒక్కసారిగా మానవత్వన్నుంచి నాలుగు మెట్లు క్రిందికి దిగజారాడు. క్షణంలో ఉద్రేకం పొందినట్లే క్షణంలో పశ్చాత్తాపంకూడా పొందుతాడని రజనికి బాగా తెలుసు. అయినా ఆమె ముఖం కందగడ్డలా కందిపోయింది. "ఒకనాడు మామకూడా యిలాగే దెప్పిపొడిచాడు. ఇప్పుడు శేఖరంకూడా యిలాగే అంటున్నాడు. ఇక యిద్దరికీ భేదమేమిటి? ఏమో భేదమాత్రం బ్రహ్మాండంగానే వున్నట్టు తోచింది. శేఖరంమీద తనకు కోపంలేదు. కానీ బాధమాత్రం నిలువునా దహించేస్తావుంది." అప్పటికే శేఖరం తానెంత అసభ్యంగా మాట్లాడేడో గుర్తించి లోలోన కుమ్ముకొంటున్నాడు. తెలియక తప్పుచేసి తగాదా తెచ్చి తనముందు గడగడలాడుతూ వున్న కొడుకును తల్లి చూచినట్లుగా చూచి బరువుగా నిట్టూర్చి అంది. "ఇటువంటి మాటలు వినవలసివస్తా

యనుకుంటే అసలు రాకపోదును బావా! నువ్వనుకున్నా నాకు బాధలేదు. నిర్జీవమైన యంత్రాల మధ్య ప్రతిక్షణ మిచ్చిన నీకు సజీవమైన మానవ హృదయ రహస్యాలు అర్థంకావులే—" పైటచెంగుతో కళ్ళు తుడుచుకోవటం చూచిన శేఖరం వెన్నలా కరిగిపోయాడు. ప్రాధేయపడుతూ అడిగాడు. "క్షమించు. రజనీ—" "అది నీ తప్పుకాదు బావా! పరిస్థితుల ఒత్తిడికి మానవుడు లొంగకతప్పదు. ఇప్పుడు నువ్వున్న పరిస్థితిలో నేనున్నా నీలాగ వట్టి మాటలతో సరిపెట్టి వూరుకోనని నాకు తెలుసు. మన యిద్దరిలో యే ఒక్కరూ యే తప్పూ చేయలేదని అందరకూ తెలుసు—అయినా యెందుకు మనకీ భరించరాని శిక్ష. అదే బావా విధి.—అనుకోకుండా వచ్చిన యీ విచిత్ర పరిణామాన్ని హృదయపూర్వకంగా స్వీకరించి మన చరిత్రను పవిత్రం చేద్దాం బావా!" లేనివస్తువుకోసం మారాముచేస్తున్న చంటి వాడిని అమ్మ లాలించినట్లుగా అనునయంగా అంది.

"రజనీ" గత్యంతరంలేనట్లు జాలిగా చూశాడు.

"నిష్కల్మషమైన ఆత్మానందం — సంపూర్ణమైన మానసిక తృప్తి మరేవిధంగానూ రాదు బావా" శేఖరం చాలసేపు దీర్ఘంగా ఆలోచించి భారంగా నిట్టూర్చాడు. తర్వాత కొన్ని క్షణాలవరకూ యిద్దరి మధ్య మౌనం ఘనీభవించింది. చివరకు రజని మెల్లిగా అంది. "నిన్నొక వరం అడుగుదామని వచ్చాను-కోరుకోమంటావా బావా?" శేఖరం ఒకసారి ఆమె కళ్ళల్లోకి సూటిగా చూచి అన్నాడు "కోరుకోమంటావా—కాదు—ఆజ్ఞాపించు రజనీ" ఏం అడుగుతుందా అని యెదురుచూస్తున్నాడు. రజని నవ్వుతూ అన్నది.

"నువ్వు అన్నమాట దాటవని నాకు నమ్మకముంది. ఆ ధైర్యంతోనే — నువ్వు చెప్పినట్లుగా ఆజ్ఞాపిస్తున్నాను—వదినగారి హోదాలో."

"వదినగారి హోదాలోనా" నివ్వెరపోయాడు శేఖరం.

"అవును బావా! మా నాన్న మా పద్మకు కట్నమిచ్చి పెళ్లి చేయలేడు. కట్నంలేకుండా పెళ్లి కాదు. పెళ్లికావటంమాత్రమే ప్రధానమైతే మా చెల్లెలు నాకు అక్క అవుతుందేమోనని నా భయం. మా కుటుంబానికి మహోపకారం చేసినవాడవవుతావు. మా పద్మను పెళ్లాడు బావా—మన ప్రేమచిహ్నంగా యీ పవిత్ర కార్యం కలకాలముంటుంది." శేఖరం శిఖండిని చూచిన ద్రోణాచార్యునిలాగ నిశ్చేష్టుడైపోయాడు. అప్రయత్నంగానే అన్నాడు. "—పద్మనా—"

"అవును బావా! మా పద్మ నిప్పులాంటి మనిషి! అందంలోగాని గుణంలోగానీ నాకు తీసిపోదు నువ్వంటే దాని కెంతో మక్కువ."

"అందంకోసం కాదు రజనీ—" పూర్తి కాకుండానే చటుక్కున అందుకొంది రజని. "—కాదు—నాకు తెలుసు — నా ఆనందంకోసం — నా కిచ్చిన వాగ్దానంకోసం పద్మను చేసుకొంటావు. అవునా? ఈ జన్మకు నిన్ను నే నడిగేదీ—నువ్వు చేయవలసిందీ యిదొక్కటే బావా" ధర్మరాజు జూదంలో ద్రౌపదిని పణముగా పెట్టినప్పుడు ఫలితంకోసం యెదురు చూస్తున్న దుర్యోధనునిలా యెదురుచూస్తూవుంది రజని. తన కిష్టం లేకపోయినా ప్రజాభిప్రాయాన్ని మన్నించటంకోసం సీతను అరణ్యాలకు పంపుతూవున్న శ్రీరాముడిలాగ గంభీరంగా నిలుచుని తీవిగా అన్నాడు. "అలాగే రజనీ — నీ ఆనందం కోసం యింకేకాదు ప్రాణత్యాగమైనా చేయగలను — పెళ్ళాడతాను రజనీ" రజని ఆనందానికి అంతులేకపోయింది. "సంతోషం! ఉద్యోగంలో చేరి సెలవు తీసికొని వస్తావుకదూ! ఈలోపునే ముహూర్తం నిర్ణయించి తెలియపరుస్తాం — చాలా టయిమయ్యింది యిక వెళ్ళనా బావా?". "వెళ్ళిరా! రజనీ! కాని వెళ్ళేముందు నీ చెల్లెలిని ప్రేమించగలశక్తి యీ భగ్న హృదయానికి కలిగేటట్లు ఆశీర్వదించి మరీ వెళ్లు రజనీ" ఆతని మాటలు — హిమాలయ పర్వతశిఖరాలు విరిగి మహాసముద్రంలోకి దొర్లి పడుతున్నట్లుగా — బరువుగా — మెల్లిగా బయటకు వచ్చాయి. "మీ రిద్దరూ నూరేళ్లు వర్ధిల్లాలి" రజని నిండు హృదయంతో దీవించింది. ఆమె "సెలవు బావా" అని చెప్పటంగాని వెళ్ళిపోవటంగాని శేఖరం గమనించ లేదు "పద్మ—పద్మ — ఆ పెంకిపిల్ల — ఆ రౌడీ పిల్ల — తన భార్య!" యేదో అసంతృప్తి యేదో ఆందోళన — అతని గుండెలను గాలంలా పట్టుకు లాగాయి.

తన చెల్లెలిని పెళ్లాడటానికి శేఖరం అంగీకరించాడన్న సంతోషంతో — యీ కమ్మని కబురు పద్మకు ఎప్పుడు చెప్పుదామా అన్న సంబరంతో రజని మూడుముళ్లలో పుట్టింటికి వచ్చేసింది. చెల్లెలికి పట్టబోతున్న అదృష్టానికి — చెల్లెలు అనుభవించబోయే శాంతి సౌఖ్యాలకు — రజని మనసులో ఆనందం సుడులు తిరుగుతూవుంది. అంతేక్రితం పద్మ అన్న మాటలు గానీ — తనకు పద్మమీద కలిగిన హేయభావం గానీ — జరిగిన రభస గానీ — రవ్వంతయినా — మాచాయగానైనా కనుపించటంలేదు రజని ముఖంలో. ఆమె హృదయం రక్తసంబంధపు ప్రేమతో నాట్యమాడుతూవుంది — పరవళ్లు త్రొక్కుతూ వుంది. సంతోషంతో నవ్వుకుంటూ ప్రహరీగుమ్మం దాటి దొడ్డిగుమ్మం మెట్లెక్కబోతూవుంది. — గుండెలు ఝల్లుమన్నాయి. "ఎవరా మాట్లాడేది." మధుగారి పెరట్లో — ప్రహరీగోడ అవతల యెవరో మాట్లాడుకొంటున్నారు. "ఈ పన్నెండుగంటల అర్ధరాత్రివేళ యెవరైవుంటారు?" ఆగి నిదానించింది. మధుగొంతుక స్పష్టంగానే తెలుస్తూవుంది. ప్రహరీగోడకు దగ్గరగా వెళ్ళింది. రెండవ వ్యక్తి స్త్రీలా వుంది — ఏడుస్తూవున్నట్లుంది. "పద్మ గొంతుకలా వుంది" అనుకోగానే రజని కాళ్లు వణికేయి. ముచ్చెమటలు ముంచెత్తాయి. తనకు తెలియకుండానే రజని నెమ్మదిగా ప్రహరీ తిరిగి — గేటు దాటి మల్లెపందిరిచాటుకు వెళ్ళింది. రజని హృదయం బ్రద్దలు కాబోయేముందున్న అగ్నిపర్వతంలాగ కుతకుతలాడిపోయింది. "పద్మ — మధు మాట్లాడుకొంటున్నారు." రజని హృదయం పాము నోటికి చిక్కిన కప్పలా గిజగిజలాడింది. "అబ్బా! యెంత — వంగనాచి — పద్మ! ఎంత చమత్కారంగా నమ్మించింది — తన చెల్లెలు — శేఖరంబావకు కాబోయే భార్య — నిప్పులాంటి మనిషి —" ఇంక ఆలోచించలేకపోయింది రజని.

"నన్నేం చేదామని." వెక్కి వెక్కి యేడుస్తూ వుంది పద్మ.

"నేను చేయటానికేముంది — మామూలుగానే వుంటావు."

"నువ్వు బొంబాయి వెళ్ళిపోతున్నావటగా" అన్న పద్మమాటలు విని రజని మెదడు తిరిగీ పని చేయటం ప్రారంభించింది. పాతమాట యేదో జ్ఞాపకంవచ్చి గుండెలు గతుక్కుమన్నాయి. ఒళ్లు గగుర్పొడిచింది.

"ఎవరన్నారు?" కోపంగానే అడిగాడు మధు.

"మా దాసీది చెప్పింది."

"అవును. వెళతాను. తెల్లవారుఝామునే వెళతాను" సీతను తిరిగి రాముని చెంతకు పంపించేయమని బ్రతిమాలినప్పుడు మండోదరిని రావణాసురుడు ధిక్కరించినట్లుగా అన్నాడు. "అయితే నా గతేం గాను?" దుఃఖం పొంగిపోతూ అంది. "నాకేం తెలుసు?" "నాకు నెలతప్పిందని తెలుసుగా" రజని గుండెలపై అటంబాంబు పడ్డట్లయింది. ఇక నిలుచోలేక — క్రింద పడిపోకుండా — కూర్చుంది.

"అది నా తప్పుగాదు" — "నాదేనా తప్పు?"

"అవును! కొవ్వెక్కి నన్ను కవ్వించావ్! నన్ను నీ ఆనందానికి వినియోగించుకొన్నావు. నీ కామతృష్ణ తీర్చుకోవటానికి నాదగ్గరకు చేరావు. దాని ఫలితంగా గర్భవతివైతే అందుకు నేను బాధ్యుణ్ణిగాను." పద్మ నోటిలో పమిట చెంగు కుక్కుకొని కుమిలి కుమిలి యేడుస్తూవుంది. "నేను రేపే వెళ్ళిపోతున్నాను — కావలిస్తే యిదిగో యీ డబ్బు పట్టుకొని వెళ్లు" అంటూ ఓ గుప్పెడు నోట్లు పద్మ ముఖంమీదికి విసిరి — శకుంతల పుట్టినప్పుడు మేనకను, పసికందును నట్టడివిలో వదిలి వెళ్లిపోయిన విశ్వామిత్రునిలాగ — దరదరా లోపలకు పోయి తలుపులు మూసుకొన్నాడు మధు. రజని హృదయం —సమాను త్రాడు తెగిన తెరచాపలా — రెపరెపా కొట్టుకొంటూ వుంది. "నెల తప్పిన పద్మను — కన్నుగప్పి తన ప్రేమ దేవుని మెడను గట్టటమా — ఈ సంగతి తండ్రి వింటే యేం జరుగుతుంది" సమాధానం — ధూమ్ర కోశాలు కలిసిన చోటులాగ అగమ్యంగా వుంది. పద్మ దుఃఖం చూడలేక రజని గుండెలు తరుక్కుపోతున్నాయి. అనాలోచితంగానే ముందుకు వెళ్ళి "పద్మా" అంది. పద్మ త్రుళ్ళిపడి రజనిని చూచి — చెలియలికట్ట దాటివచ్చిన మహాసముద్రంలాగ పొంగి పొరలెత్తిన దుఃఖంతో "అక్కా!" అంటూ రజని పాదాలపై వాలిపోయింది. అన్ని భావాలను అధిగమించి రక్తసంబంధపు వాత్సల్య సౌహార్ద్రాలు ఒక్కుమ్మడిగా ఉబికివచ్చి "చెల్లీ" అంటూ రజని పద్మను కౌగిలించుకొంది.

మరునాడు "రజని — మధుతో లేచిపోయింది" అనే వార్త క్షణంలో వూరంతా గుప్పుమంది. గంటల్లో గ్రామాలు దాటి ప్రాకిపోయింది. "మధు బొంబాయి వెళ్లాడు — పద్మ కనిపించటంలేదు — కాబట్టి యిద్దరూ లేచిపోయారు" అని నిర్ణయించింది లోకం. కనకయ్య అవమానంతో వీధిముఖం చూడ లేకపోతున్నాడు. పద్మ కుళ్లికుళ్లి యేడుస్తూవుంది. "నన్ను వంచించింది—నమ్మించింది—వంగనాచి— నేను లేని యీ నాలుగేళ్లూ వాడితో...ఛీ! ఛీ! ఇదా పవిత్ర ప్రేమ! దీనికోసమా యే త్యాగమైనా చేదా మనుకొన్నాను —" అసూయతో అసహ్యంతో పళ్లు కొరికేడు శేఖరం! వెంటనే తల్లిని తీసుకొని ఉద్యో గానికని వెళ్ళిపోయాడు. "పిల్లలు కలుగలేదు సరి గదా పెళ్ళాం యిలా చేసిందేమిటా" అనుకొంటూ మాధవయ్య పడకగదిలోకి వెళ్ళి—రజని పట్టుకుపోయిం దనుకొన్న నగలు — ఉత్తరం — వుండటంచూచి ఖిన్నుడైపోయి కంగారుతో వుత్తరం చదువసాగాడు.

శ్రీవారికి నమస్కారాలు!

నేను వెళుతున్నాను. తిరిగి రాను. ఇందుకు కారణం మీరు గాదు. నేనుకూడా గాదు. అయినా వెళ్ళిపోతున్నాను. పిల్లలకోసం రెండువేలు వదులు కొని నన్ను పెళ్లాడేరు. నావల్లకూడా మీకు పిల్లలు కలుగరని నా నమ్మకం. మీ రెండు వేలకు ప్రతిఫలంగా మా చెల్లెలు పద్మను పెళ్లాడండి! వెంటనే పెళ్ళా డండి! దానికడుపున పిల్లలు తప్పకుండా పుడతారు. నాలో యే దోషం లేదనిమాత్రం నమ్మండి! తప్పులు చేసివుంటాను తెలియక — మీతో వున్న కొద్దికాలం లోనూ—! దయతో క్షమించండి! ఇట్లు

—రజని

మాధవయ్య ఉత్తరం పట్టుకొనివచ్చి కనకయ్య కిచ్చాడు. కనకయ్య సమాధానం చెప్పకముందే "అలాగే అను నాన్నా—అక్క చెప్పిందానికి నేను ఒప్పుకొంటున్నాను" అంది పద్మ. ఆనవాయితీ తప్పిం చాలని పద్మ మెడలో పసుపుకొమ్ముకట్టి తీసుకు పోయాడు మాధవయ్య. ఆ సాయంకాలం మాధవయ్య గారి పాలేరు గుండెలు బాదుకొంటూ పరుగెత్తుకు వచ్చి "పై పెరడు పాతబావిలో యేదో శవం వుందని" చెప్పాడు. చూచేటప్పటికి అది రజని శవం! "రజని లేచిపోలేదా" మాధవయ్య కనకయ్య మొగ మొగాలు చూచుకొని యేడ్చేరు. పద్మ లోలోపల పుటం పెట్టి నట్లుగా కుమిలిపోతూవుంది. పోలీసులకు తెలిస్తే అనవసరపు రభస జరుగుతుందని—పాడుపడిన పాత బావిని పూడ్పించేసినట్లు—రజని శవాన్ని అందు లోనే వుంచి—నూతిని కప్పించేడు మాధవయ్య. గుట్టుచప్పుడు కాకుండా రజనికి తిలోదకాలు వదిలేరు.

పెళ్లయి ఎనిమిది నెలలు నిండగానే పద్మ పనస తొనలాంటి కొడుకును కన్నది. పుత్రోదయానంద ములో తన్మయుడైన మాధవయ్య 'ఆ నెలల సంగతి' పట్టించుకోలేదు. "ఎంత కాలానికి దొరికాడు తనకు వారసుడు!"

నాటికీ నేటికీ ప్రజల దృష్టిలో రజని "వంగ నాచి"గానే కనబడుతూవుంది. పద్మమాత్రం ప్రతి రోజూ ఉదయాన్నే "రహస్యంగా" పద్మ ఫొటోకు నమస్కరించి కొడుకుచేత నమస్కారం చేయించేది. ఆ "నమ్మించిన వంగనాచి"ని తలచుకొని యిప్పటికీ— రౌలిజబెత్ థర్డ్—యింజనీరు—జాన్ చంద్రశేఖర్ పళ్లు పటపటా కొరుకుతూనే వున్నాడు.

# ద్రౌపది మాతృహృదయము

## భారత భాగవతావిష్కరణములు

శ్రీ యస్వీ జోగారావు

మహాభారతము, శ్రీమద్భాగవతము రెండును వ్యాసకృతములేయని పలువురు పండితుల తలంపు. కాని రెంటిట కావ్యాంతరసామ్యములను స్పృశించి ఆయా గ్రంథకర్తల శైలీవైషమ్యమును బట్టి యిద్దఱి శైలి, సదృశ కథాసన్నివేశములందలి ఆయా పాత్రచిత్రణము, ఆ పాత్రలలోనుండి తొంగిచూచు కవి యాత్మీయతయు బహుధా సాదృశ్యముకంటె భేదమునే స్ఫురింపజేయుచున్నవి. భారతశైలి యట నట జటిలములగు వ్యాసఘట్టములను గలిగియున్నను భాగవతశైలి యంత గాఢపాకము గలది కాదు. ఇట శైలినిమాట యప్రస్తుతము. ఏకైక కథాసందర్భమునందు రెండిట నెట్లొక్క సన్నివేశము భిన్నమార్గముల నడచినదో మాత్రము. ద్రౌపదీపుత్రశోకఘట్టము మహాభారతమున సౌప్తికపర్వమునను (ఏకాదశాధ్యాయము — శ్లో॥ 13, 14, 15 వరకు॥), భాగవతమున ప్రథమస్కంధమునను (సప్తమాధ్యాయము — శ్లో॥ 42 - 47 వరకు॥) గలదు. ఆ పట్టున నా రెంటిట నామె మాతృత్వ మావిష్కరింపబడిన తీరు వేరు. అదే ప్రకృతవ్యాసవిషయము.

భారతయుద్ధమైపోయినది. ఇక పాండవులదే కురుక్షేత్రమున ఏకచ్ఛత్రాధిపత్యము. పాండవుల పట్టమహిషి ద్రౌపది పట్టిన పంతములెల్ల నెరవేరినవి. ఆమె ఉల్లాసమహోర్మి నోలలాడుచుండిన సమయమది. కాని అప్పటికే యామెకొక కోశమున శోకము కొంత లేకపోలేదు. అది పితృశోకము. తన సపత్నులగు హిడింబా సుభద్రలవలె పుత్రశోకమమాత్ర మప్పటి కెరుగ దామె. తన పతులకు జయము నిశ్చయమై యిక నట్టి విపత్కరవిషయము నూహింప నక్కరలేని పరిస్థితి యామెది. కాని హఠాత్తుగా అశ్వత్థామ సౌప్తికపర్వము నిర్వహించిన కఠోరదుర్వార్త యామె కర్ణపుటముల బడినది. అపు డామెకు పుత్రశోకము కన్న పుత్రఘాతి యగు నశ్వత్థామపై నాగ్రహ మెక్కువగా ప్రజ్వరిల్లి పాండవు లశ్వత్థామను సపరివారముగా నాశనముచేయునన్న తానే ప్రాయోపవేశముచేయుటకు ప్రతిన బట్టిన దని భారత మిట్లు చెప్పుచున్నది:

'తస్య పాపకృతో ద్రౌణేర్న చే దద్య త్వయా రణే
హ్రియతే సానుబంధస్య యుధి విక్రమ్య జీవితమ్॥'
'ఇహైవ ప్రాయ మాసిష్యే తన్నిబోధత పాండవాః
న చేత్ఫల మవాప్నోతి ద్రౌణిః పాపస్య కర్మణః॥'

—సౌప్తిక XI-14, 15.

ద్రౌపది యెన్నడైన నోములు వ్రతములను బట్టినదో లేదో కాని ఇట్టి ప్రతినలు బట్టుటమాత్ర మామెయెడల సామాన్యమైన విషయమే. ఐనను నింత ఘోరమైన ప్రతినను తన ప్రాణమే పణముపెట్టిన ప్రతిన నిదివరకామె తన జీవితమునందు పట్టియుండలేదు. ఆమె పంతములు చెల్లింప భీముడున్నాడు. మహాభారతము ప్రకారము మఱిదే యామెచే నియోగింపబడినవాడు కాని కృష్ణార్జునులు, ధర్మజుడు వానిని ననుసరించినట్లును, అర్జునాశ్వత్థామలకు ఘోరయుద్ధము జరిగినట్లును, వ్యాసభగవానుడే దిగివచ్చి యా తగవును పరిష్కరించినట్లును చెప్పబడినది.

భాగవతమున ద్రౌపది తన కొడుకులకోసము తా శోకించుటయే గాని యొక ప్రతిన బట్టినట్లు గాని, అశ్వత్థామను హతమార్పవలసినదని యొకరి నాదేశించినట్లు గాని చెప్పబడలేదు. పైగా అత్యంతవ్యసనమునను శాంతితో నశ్వత్థామను క్షమించినది. అర్జునుడే అశ్వత్థామను హతమార్ప నుద్యముగా ప్రతినబూని బయలుదేరును. ఆ సందర్భమున వ్యాసుడెక్కడను అవతరింపడు. అర్జునుడాశ్వత్థామను బంధించి ద్రౌపదికడకు గొనివచ్చును. అపుడు కట్టికట్ల కర్మజుగుప్సితుడై అవాఙ్ముఖుడైయున్న అశ్వత్థామను జూచి ద్రౌపది

ఎంత చెడినను గురుపుత్రుడని కాళ్లకు నమస్కరించినదట! ('వామస్వభావా కృపయా వనామ చ' అని భాగవతము. అట నా ద్రౌపదీ విశేషణమునకు భాగవతవ్యాఖ్యాతలగు శ్రీధరుడు శోభనస్వభావ యనియు, వీరరాఘవుడు అక్రోధన స్వభావ యనియు అర్థములు చెప్పిరి). వెంటనే ఎంత శాంతికు డైనను అత డట్లు బంధనముతో గొనిరాబడుట సహింపనిదై 'ముచ్యతాం ముచ్యతా మేష బ్రాహ్మణో౽నితరాం గురుః' అనగా విడువుడు విడువుడితడు బ్రాహ్మణుడు, గురువుకంటె వేరుకాడని యన్నదట. తనుపరి యర్జును నుపలక్షించి యిట్లన్నది:

'సరహస్యో ధనుర్వేదః సవిసర్గోపసంయమః
అస్త్రగ్రామశ్చ భవతా శిక్షితో యదనుగ్రహాత్ ||'
'స ఏష భగవాన్ ద్రోణః ప్రజారూపేణ వర్తతే
తస్యాత్మనో౽ర్ధం పత్న్యాస్తే నాన్వగాద్వీరసూః కృపీ.
— భాగ. ప్రథమస్కంధము, VII 44-45.

అనగా, ప్రయోగోపసంహార పూర్వకమగు ధనుర్వేదము సరహస్యముగా సానుగ్రహముగా నీకు నేర్పిన ద్రోణభగవాను డీపుత్రరూపమున గన్పట్టుచున్నవాడు, (అందుచేతనే) వీరమాతయగు ఆయన యర్ధాంగి కృపి పతి ననుగమింపలేదు. అని యర్థము. అవెంటనే ధర్మరాజా నుద్దేశించి:

'తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవం కులమ్
వృజినం నార్హతి ప్రాప్తుం పూజ్యం వంద్య మభీక్ష్ణశః'
శ్లో. 46.

(ధర్మజ్ఞ! మహాభాగ! మీవలన పూజ్యము వంద్యమునగునట్టి గురుకులమునకు చేటు గలుగరాదు)

'మారోదీ దస్య జననీ గౌతమీ పతిదేవతా
యథాహం మృతవత్సార్తా రోదిమ్యశ్రుముఖీ
ముహుః' — శ్లో. 47.

(నేనెట్లు మృతవత్సనై అశ్రుముఖినై మాటికి నేడ్చుచుంటినో పతిదేవతయగు కృపియు నట్లేడువ దగదు)

'యైః కోపితం బ్రహ్మకులం రాజన్యై రజితాత్మభిః
తత్కులం ప్రదహత్యాశు సానుబంధం శుచార్పితమ్.'
శ్లో. 48.

[అజితేంద్రియులగు ఏ రాజులవలన బ్రాహ్మణకులమునకు కోపము గలుగునో ఆ రాజకులము నే తత్కోపాగ్ని దహించును] అని యన్నది.

అప్పటి యామె మాటలలోని ధర్మన్యాయదయాన్వితము, నిర్వ్యళీకము, సమభావసముల్లసితము నైనదనియు, ధర్మజాదులు తత్రత్యులగు ద్విజులు నామె నభినందించిరనియు భాగవతమున నిట్లు చెప్పబడినది:

'ధర్మ్యం న్యాయ్యం సకరుణం
నిర్వ్యళీకం సమం మహత్
రాజా ధర్మసుతో రాజ్ఞ్యాః
ప్రత్యనందద్వచో ద్విజః' శ్లో. 49.

అప్పటి కింకను భీము డొక్కడే అశ్వత్థామ వధార్హుడని వాదించువాడుగా మిగిలినాడు. అతడు చేయి చేసికొనులోపున కృష్ణుడు కలుగజేసికొనుటచే అశ్వత్థామ రక్షింపబడెను. అదే భాగవత ద్రౌపదికథ మతమైనది. ఆ పాత్రలో భాగవతకర్త ఎంత మహోన్నత మాతృభావము నిమిడ్చినాడు! ఎంత హృదయస్పందితమైన సన్నివేశమది!

అపుడు ద్రౌపది కురుక్షేత్రమహారాజ్ఞి. అచ్చో న్యాయాన్యాయ విచారమొనర్చుట కామె కధికారము గలదు. శిశుహంతకునకు శిక్ష ఉరికి తక్క వ మరిలేదు. ఈసందర్భమున ఆ మహారాజ్ఞియే ఆ నేరమున కర్త యైనది. అదికాక ఆమెకు ద్రోహియగు నశ్వత్థామునకు తమతమ తండ్రులనాటినుండి యొక పగ సరిపాటిగా వచ్చుచుండినది. (ద్రోణుడు తన్నవమానించెనని ద్రుపదుని పరాభవించును. ద్రుపదుడా పరాభవము సహింపజాలక యొక యజ్ఞముచేసి ద్రోణుని జంపగల కొడుకును ధృష్టద్యుమ్నుని బడసినాడు. భారతయుద్ధములో ద్రోణుడు తన ప్రతాపమును పాండవులపై బట్టించినాడు. ద్రుపదుని గడతేర్చినాడు. ధృష్టద్యుమ్నుడు ప్రాయోపవిష్టుడైయున్న ద్రోణుని కంఠము త్తరించినాడు. అశ్వత్థామ ఉపపాండవులతో పాటు ధృష్టద్యుమ్నుని హతమార్చినాడు). భాగవతమున ద్రౌపది కా ప్రతీకారస్మృతియైన యున్నట్లు చెప్పబడలేదు. అందు ద్రౌపది ద్రోహి నొక మహారాజ్ఞివలెగాక మాతృత్వము మూర్తిభవించిన యొక మహాదేవతవలె చూచినది. అందును ఆ మాతృత్వము తన బిడ్డలనుమాత్రమే ప్రేమింపగలిగి వారి మృతికి దుఃఖించు సామాన్య మాతృత్వము గాదు; ఏ తల్లి బిడ్డలయెడనైన హేరాళముగా ప్రకటింపగల వాత్సల్యము, ఏ బిడ్డలతల్లియెడనైన సానుభూతి ప్రకటింప గల

యౌదార్యమును గల మహోదాత్త మాతృత్వము. అదే మానవృతమైన మాతృత్వరహస్యము. మాతృత్వ మహిమ కది పరిసీమ.

భారతద్రౌపదిపాత్రలో రాజసప్రవృత్తి గన్పట్టును. అందు పుత్రశోక మామెయందె క్రోధముగా పరిణమించి ఆ క్రోధం బ్రతీకారమై ప్రతీకారమునకు ప్రేరేచినది. భాగవతమున అసలే అతి మృదులమగు నా మాతృహృదయమునకు మరింత మార్దవము చేకూర్చినది పుత్రశోకము. ఆ విషయమున భారతచిత్రణము లోకసామాన్యమైన వాస్తవికతకు చాల సన్నిహితముగా నున్నదనుటగాక కాని భాగవత చిత్రణ మా మహాగ్రంథ పరమార్థమునకు దగినట్లు లోకోత్తరమై ఆదర్శప్రాయమై యొప్పుచున్నది.

ఈ ద్రౌపదీ పుత్రశోకసందర్భ మొక్కటి చాలును భారత భాగవతములు రెండు నేకకర్తృకము లని పరంపరగా వచ్చు నభిప్రాయార్థమును సంశయించుటకు. భాగవతము అష్టాదశ పురాణములలో నొకటి. పురాణములెల్ల వ్యాసప్రణీతములని యొక అభిప్రాయము. కాని పురాణములలో ఒక కథయే భిన్న గ్రంథములందు భిన్నరీతుల వ్యాఖ్యానింపబడుట తరచుగా గన్పట్టును. అవి యెల్ల నేకకర్తృకము లనుట సమంజసముగా తోపదు. విషయవికల్పితమాట యటుండ నొక గ్రంథకర్త యొక జన్మలో నన్ని బృహద్గ్రంథములు స్వకపోలకల్పితములుగా అకు లక్షరముల కాకరములైన యా శ్లోకాలలో రచించె నన్న నమ్మకమునకు దిమ్మచాలనిమాట. భిన్నవ్యక్తుల చేతనైనను నవి యన్నియు నొక్క కాలమున రచింపబడి యుండెనని తోచును. అందలి గాథలు దేశము వివిధభాగములం దుప్పతిల్లి తరతరముల జనుల నాలుకలపై నాని నాని పండితులచే చిత్ర విచిత్రములైన ఆభిమానిక వ్యాఖ్యానములకులోనై వ్యాసుని కాలమున నతనిచే సంకలితములై పరిష్కరింపబడి గ్రంథరూపము దాల్చి యుండెవచ్చును. వ్యాసుని అనంతర మందం దనేక ప్రక్షిప్తములు చేరియుండవచ్చును. అందుచేతనే ఒక పురాణమునకును మరియొక పురాణమునకును అంత ఏకవిషయ వైకల్పము. అంతే కాని వ్యాసునివంటి లోకోత్తర మనీషి, మహర్షి గ్రంథ గ్రంథమునకును తన యభిప్రాయము వట్లు మార్చుకొనడు. అయితే అతని స్వతంత్ర కృతిగా చెప్పబడుమన్న భారతమునందలి వస్తువే భాగవతపురాణము నందు మారియుండుట చూచియున్నాము. మరి భాగవత రచన ఆయన చేతిమీదుగనే నడచియుండిన నా మార్పెట్లు సంభవించినది? కొందరు భాగవత మతని పిదపరచనయై, అప్పటి కతని యభిప్రాయములు మారియుండెనవచ్చు ననవచ్చును. భాగవతము, భారతమునకు పిదపరచనయే కావచ్చును. కాని మహాభారత రచనాకాలమునకే అసాధారణ మేధానిధి, అంతర్ముఖుడు, స్థితప్రజ్ఞుడగు కోవిదుడు, సంయమిప్రవరుడునైనట్లు కన్పించు వ్యాసభట్టారకుడు తన భారతభావములకు తానే భాగవతమున తిరుగాత రచించి యుండిన నందింత మార్పంగీకరించి యుండునా? అది కాక భారత భాగవత రచనాశైలులలో భేద మధికముగా జూపట్టుచున్నది. ఆ కారణము చేతను రెండిటి భిన్నకర్తృత్వము నంగీకరించుట లెస్స యనిపించుచున్నది. అనగా భారత భాగవతకర్తలిరువురును వ్యాసనామధేయులే కావచ్చును కాని భిన్నవ్యక్తులై యుందురనుట. శైలీవిషయము నుపేక్షించి వస్తువిషయమున ప్రక్షిప్తవాదమును పురస్కరించుకొని యీ ద్రౌపదీ పుత్రశోకఘట్ట మట్టి ప్రక్షిప్తభాగములలో నొకటి యనిన ననవచ్చును. అట్లైన భాగవత ద్రౌపదిపాత్ర చిత్రణవిషయమునకైన భారతకర్తకు శోక్యము లేదనుట నంగీకరింపవలసివచ్చును. నా యుద్దేశము భాగవత ద్రౌపది భారతకర్తయగు వ్యాసుని సృష్టి కాదనియే. ఇందుల కింకొక యూహ యుపబలకముగా నున్నది. భారతకథ కనేక ముఖ్యపాత్రల పరస్పర ప్రతీకారవాంఛ ఆయువుపట్టుగా దోచును. ఆ కథలో ననేక సన్నివేశములందా ప్రతీకార తత్త్వస్వరూపము పరిస్ఫురించినది. గ్రంథకర్తయగు వ్యాసున కట్టి సన్నివేశములను చిత్రించుట యందతిమాత్రమైన ఔత్సుక్య ముండినట్లు తోచును. మహాప్రథనసన్నివేశప్రధానము ఆ గ్రంథము రచన కది తగియున్నది. కాని భాగవతము తీరు వేరు. ఇందలి కవి యాత్మీయత వేరు, వివిధకథా సన్నివేశపర్యవసానములందలి కావ్యన్యాయ్యము వేరు. అవి ప్రాయికముగ కరుణామూలకములై యుండును. ద్రౌపదిపుత్రశోకఘట్టము భారత భాగవతములందు తత్తత్ప్రధాన తత్త్వానుసారిగనే చిత్రింపబడినది. ఇదే సంస్కృత భారతభాగవతముల విషయము.

ఇక నప్పట్టున భారత భాగవతాంధ్రీకర్త లెట్లు వ్యవహరించిరో యించుక పరిశీలించుట అప్రస్తుతము గాదు. ఆ పట్టున భారతాంధ్రీకర్త తిక్కన మూల విధేయముగనే రచన సాగించినాడు. చూడుడు:

'అశ్వత్థామోద్దామ రణకరణ స్మరణంబు దన చిత్తంబు దత్తిలపెట్టఁ గోపంబు దీపింప' ద్రౌపది ధర్మరాజుతో నిట్లనుచున్నది:

'భూరమణా గాఢనిద్రం
గూరినసమయమున ముట్టికొని నా సుతులం
గ్రూరతఁ దెగటార్చెను బా
పారంభుఁడు గురుతనూజుఁ డక్రమలీలన్.

'అది యాతని పెనుచిచ్చై
మదిఁ గాల్పఁగ దోషంగ దీనిమాన్ప నుపాయం
బు దలంప నొండు లేద
య్యవినయుని ముట్టికొని వాని మడఁచుట దక్కన్.

'వాయుసుతుఁ బిలిచి నేఁ డటు
సేయింపక తక్కఁ దేనిఁ జెప్పెద విను మేఁ
బ్రాయోపవేశమున నీ
కాయము పెట్టింతుఁ జుమ్ము కౌరవనాథా'

—ఆం. భార. సౌప్తిక, II 31,32 & 33.

'వ్యాసముని ప్రణీత పరమార్థము'నే భజించినాడు సోమయాజి. కాని భాగవతతత్త్వమును నవనాడులలోను జీర్ణించుకొన్న మహాకవి పోతన తానప్పట్టున మూలకర్త యడుగుజాడలలోనే నడచెను ఆ యడుగు వేయుటలోనే యొక యడుగొక క్రొత్త యొఱవుతో జేసినాడు. ద్రౌపదిచే నశ్వత్థామ నుద్దేశించి యొక సంభాషణము చేయించినాడు. అది అమూలకమైనను మనోజ్ఞమైన కూర్పు. చూడుడు:

'అర్జునుండు తెచ్చిచూపిన, బాలవధ జనిత లజ్జా పరాఙ్ముఖుండైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావ యగు ద్రౌపది యిట్లనియె:

పరఁగన్ మా మగవారలందఱును మున్
బాణప్రయోగోపసం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రో
ణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్త్రాకృతి నున్న ద్రోణుఁడవు నీ
చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్
ఖండింపఁగాఁ బాడియే?

భూసురుఁడవు, బుద్ధి దయా
భాసురుఁడవు, శుద్ధ వీర భట సంఘా
గ్రేసరుఁడవు, శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!

ఉద్రేకంబున రారు, శస్త్రధరులై
యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలో
త్సేకంబుతోఁ జీఁకటిన్
భద్రాకారులఁ జిన్నపాపల రణ
ప్రౌఢక్రియాహీనులన్,
నిద్రాసక్తుల సంహరింప నకటా
నీచేతు లెట్లాడెనో!

అక్కట పుత్త్రశోకజని
తాకుల భార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్న భంగి నిముఁ
గోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట స
హింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టి శోకమున
నే క్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో!'

—ఆం. భాగ. I., 126.180.

ఇందలి కొన్ని భావము లమూలకములు, కొన్ని మూలమున ద్రౌపది యర్జునాదులతో సంభాషించిన సందర్భమునందలివే కాని యిం దొక క్రొత్తదనమును దెచ్చుకొన్నవి. ఆ సమయమున ద్రౌపది తన కడుపున జిచ్చుపెట్టిన యా ద్రోహిని పలుకరింపక అతని తలిదండ్రులను దలచి క్షమించుటయే చాలు, నైనను తనవంటి మహారాజ్ఞి యట్టి నీచుని పలుకరింపరాదనక పూని యతని నుద్దేశించి '...ధర్మమగునే తండ్రీ, నీ చేతు లెట్లాడెనో, భవదీయమాత నేఁ డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో' అని మాటలాడుట, ఆ యాడిన తీరుగో తన పుత్త్రశోకాతురతను, మాతృప్రేమను, ఎదిరిపరిస్థితిని సానుభూతితో గ్రహింపగల యుదారతను మాత్రమే ప్రకటించి ద్రోహిని పల్లెత్తు పలుకనాడక గౌరవించిన భంగి యామె మాతృత్వప్రతిష్ఠకు మరింత వన్నె పెట్టుచున్నది. అనగా ద్రౌపదీమాతృహృదయావిష్కరణ సందర్భమున సంస్కృతాంధ్ర భారతము లొక్క తీరుగను వానిని సంస్కృత భాగవతము, దాని నాంధ్రభాగవతము నతిశయించుచు నున్నవనుట స్పష్టము.

# వానరహస్తం

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

పాత్రలు: రామేశం, జానకమ్మ, రఘు, కల్నల్‌మూర్తి, ప్లీడర్ శంకరం

అది ఊరికి దూరంగా, ఏకాంతంకోసం, శివార్ల కో మూలలో ఎన్నడో ఇక్ష్వాకులు కట్టించిన భవంతి ముందుగది. ఆగదిలోనుండి వంటింట్లోకి, వసారాలోకి రెండుద్వారాలు వేర్వేరుగా వుంటాయి. ద్వారాలు కనుక తెఱచి వున్నట్లయితే వీధిలో జరిగే రాకపోకలు, వంటింట్లోవుండే పాత్రసామగ్రి స్పష్టంగా కనిపిస్తుంటాయి. గదిలో మాత్రం ఓ బల్ల, దానికిచుట్టూ కొన్ని పేముకుర్చీలూ, పుస్తకాలబీరువా ఒకటీ, గోడకు కొందరుదేముళ్లూ వుంటారు. బల్లపై కొద్దిగా ఒక పెద్దసైజు అద్దం, బిగ్ బెన్, మరో రెండు మూడు అత్యవసరవస్తువులూ క్రమపద్ధతిలో అమర్చబడి వుంటాయి. ప్రస్తుతానికి సర్వత్రా ప్రశాంతమైన వాతావరణం కన్పిస్తుంటుంది.

## 1

* * తెఱ తొలగేసరికి, జానకమ్మ ఓ పడక్కుర్చీలో కూర్చొని, ప్రక్కనే చదరంగం ఆడుతూ దీర్ఘంగా ఆలోచిస్తున్న తండ్రీకొడుకులవైపు పరిహాస పూర్వకంగా చూస్తుంటుంది. రామేశం ఓడిపోతున్నట్లు అతని ముఖవైఖరినిబట్టి స్పష్టంగా గ్రహించుకోవచ్చు. చెదరినజుట్టు, ముక్కుకొనలకు జారిన కళ్లద్దాలు, బొమ ముడిపడిన అతని భ్రూయుగ్మం ఆటలోని అతని పట్టుదలను, బాహ్యప్రకృతిపై గల నిర్లక్ష్యాన్ని సూచిస్తుంటాయి. గదిలో వెలుగుతున్న బ్లూలైట్ వింత కాంతుల్లో గెలుపులోవున్న రఘు హుషారుగా కన్పిస్తుంటాడు. వంటింటి తలుపు, వీధి ద్వారం మూయబడివుంటాయి. కాని అప్పుడప్పుడు గాలి చేస్తున్న సద్దు మాత్రం విన్పిస్తూనే వుంటుంది

రామేశం : రఘూ! ఇదిగో శకటు. ఇహ కదుపు నీ రాజును చూద్దాం!

రఘు : ఓహ్! అనుకొన్నంత పనీ చేశావు కదు నాన్నా?

జానకమ్మ : ఓడిపోయావా రఘూ?

రఘు : (నవ్వుతూ) లేదమ్మా! తమాషాకు—

రామే : ఆటల్లో హాస్యాలేమిటి రఘూ? ఆడదల్చుకుంటే, సరిగా ఆడు. లేకపోతే శుభ్రంగా మానేద్దాం.

రఘు : అదికాదు నాన్నా! మరి లేకటు నెవరైనా మూడుగళ్లు పక్కకు కదుపుతారా? నియమాల్లేని ఆట, నీతిలేని భార్య ఒకటే అని మీరేకదూ చెప్పింది మొన్న!

రామే : (విసుగ్గా) నియమాలూ! నీతులూ! బ్రతుకునో భారంగా చేయడానికి.

జాన : ఆటలో అంత విసుగెందుకండీ! అయినా పిల్లవాళ్లతో మీకు పంతాలేమిటి?

రఘు : మొదటి రెండాటలూ నాన్నగారే గెల్చారమ్మా! కానీ—

జాన : కానీ?

రఘు : మిగిలిన రెండాటలూ నేను గెల్చుకున్నాను. ఇది అయిదో ఆట.

రామే : (సంభాషణ మార్చాలని) అబ్బబ్బ! గాలి చాలా తీవ్రంగా వున్నట్టుందే! వానగూడా వస్తుందేమో కొంపతీసి.

రఘు : వస్తే రానూవచ్చు, లేకపోతే లేకపోనూ వచ్చు, అన్నారు నాన్నా నిన్న రేడియోలో!

రామే : అయితే మూర్తిరావడం అసంభవమేమో ఈ రాత్రికి?

జాన : బహుశా, శతవిధాలకు.

రామే : అంటే?

జాన : ఎవరింట్లో ఏ పిల్లి ఎన్ని కూనలు పెట్టిన విషయం దగ్గర్నుంచీ, ఏ దేశంలో ఎందరు జాతీయవాదులు హత్య చెయ్యబడిన విషయం వరకూ మీకే అవసరమూరా! మీస్నేహితు లెందుకు రాకుండా మానుకుంటారు లెండి!

రఘు : మూర్తిగారు వస్తే సరదాగా గడిచిపోతుంది కదు నాన్నా కాలం?

రామే : తప్పకుండా! ఊరికి దూరంగా ఒకరితో సంబంధం లేనట్టి ఇల్లు — ఇంటికి చుట్టూ ఎక్కడ చూచినా మరుభూమి—ఇంట్లో ముగ్గురే ముగ్గురు వ్యక్తులు. ఓహ్! చాలా బావుంది కదూ ఈ ఏకాంతం?

జాని : అర్ధరాత్రి గొంతుపిసికినా దిక్కూ దిబాసీ లేదు. ఎందుకొన్నారో ఏమో యీ భూతగృహాన్ని!

రామే : అవును మరి సంవత్సరాలతరబడి తపస్సు చేసినా నడిపట్నంలో అంగుళమైనా స్థలం దొరకలేదు. ఎంతకాలమని పరులపంచల్లో తలదాచుకోవాలి?

రఘు : ఊరికి దూరంగా కావలసినంత ఖాళీస్థలం. చాలన్నా వినకుండా వీచేగాలి. మన బ్రతుకులు మనం బ్రతకడానికి ఇంతకన్నా ఏం కావాలమ్మా!

జాని : దీనికోసం అప్పుతెచ్చిన డబ్బుసంగతి? కాస్తా కూస్తా కాదు. వెయ్యిరూపాయలు తిలరెత్తుకోగలమా మళ్లీ మనం?

రఘు : ఈ చిన్న మొత్తంకోసం అంత విచారం ఎందుకమ్మా! ఒక్క మూడుసంవత్సరాలు. ప్రమోషన్ కూడా వస్తుందని అంతా అనుకుంటున్నారు. నెల కోపాతిక చొప్పున కూడబెట్టినా సరిపోతుంది.

జాని : ఇదంతా మా కుటుంబభరత్వానికేగా?

రఘు : ఏమిటమ్మా!

జాని : కొడుకులసంపాదన తలిదండ్రుల సౌఖ్యానికే నాయనా! ఎవ్వరూ కాదనరు.

రఘు : ఏమిటమ్మా నీ సందేహం?

జాని : నీకూ ఒకయింటివాడవు కావలసిన వయసు వచ్చింది. నలుగురితో బాటు నువ్వూ ఓ కులమింటికోతిని పెళ్లాడి గోనెడు కొడుకులూ గంపెడుకూతుళ్లతో వర్ధిల్లితే అంతకన్నా మా కొక్కవలసిం దేముంది బాబూ!

రఘు : పెళ్లి చేసుకుంటున్నవారంతా ఏం బావుకుంటున్నారమ్మా! నేను సుఖపడడం లేదనడానికి?

జాని : అదేమిటి రఘూ అలా అంటావు? నీవూ నీ భార్యా చిలకా గోరింకల్లా ఓ పది కాలాలపాటు మా కళ్లముందు చల్లగా మెలగాలనికానీ, లేకపోతే ఎందుకు నాయనా మా జన్మలింకా?

రఘు : (కొంత విసుగ్గా) ఏమిటి నాన్నా అమ్మకీచ్చాదస్తం! అస్తమానం నా పెండ్లివూసు తప్పించి ఆమెకు వేరే ధ్యాస లేనట్లుంది చూస్తే!

రామే : రఘూ!

రఘు : అవును నాన్నా! రాత్రల్లా కార్ఖానాలో ఆ యంత్రాలమధ్య బాధపడడం పగలల్లా పెండ్లికోసం కలవరించడం బాగా వేవుంది జీవితం?

(బయట తలుపుదప్పుడు)

జాని : గాలి కేలా తలుపు లూగిపోతున్నాదో!

రామే : కల్నల్ వచ్చాడట్లుంది రఘూ!

జాని : ఇంకేం కావలసినవన్నీ వింతలూ, విశేషాలూ? [రామేశంవెళ్ళి తలుపు తీయగానే కల్నల్ మూర్తి యూనిఫారంలో వుంటాడు. ఎడమచెయ్యి మొండిచెయ్యి. కొద్దిగా మిలటరీదర్పంతో లోపలకు విసురుగా ప్రవేశిస్తాడు]

కల్నల్ : అబ్బబ్బ! ఏంగాలి! ఏంచలి! ఒక్క మైలు నడిచేసరికి ప్రాణాలు గడ్డకట్టుకుపోతే! అందులోనూ గతుకులుపడిన ఈ కంకరబాట మీద!

జాని : పర్వాలేదు. ఆ కోటూ అదీ ఆ వంకెకు తగిలించండి.

రామే : అయినా ఊరు సద్దు మణిగేదాకా ఎక్కడున్నావు మూర్తీ?

కల్నల్ : అనుకుంటూ వేవున్నా నాకోసం మీరంతా నిరీక్షిస్తుంటారని.

జాని : (ఫ్లాస్కులో కాఫీ కప్పులోపోస్తూ) మూర్తిగారు కాఫీ తాగింతర్వాత అందరూ కులాసాగా కబుర్లు చెప్పుకోవచ్చు. కాస్త వారికి విశ్రాంతికల్గిస్తే ప్రస్తుతానికి.

రామే : నిరభ్యంతరంగా.

కల్నల్ : నాకోసం ఎందుకండీ మీ కందరికీ ఈ శ్రమ? రామేశం — అర్ధరాత్రి అతిథి మర్యాద లేమిటోయ్!

రఘు : ద్రవపదార్థం పుచ్చుకోనడాని కూడా అంత బెట్టుసరి చేస్తారేం కల్నల్? పోనీ క్రొత్తవారెవరైనా వున్నా సబబుండును.

కల్నల్ : (రఘును అప్పుడే చూస్తూ) అరె—ఇంకా నువ్వు వెళ్ళనే లేదా? కార్ఖానా అంతా నీకోసంకని పెట్టుకుని కూర్చుందనుకున్నాను! పగటిపూటా, రాత్రివేళా నువు పనిచేయ వలసింది?

రఘు : కొన్ని రోజులు పగటిపూట పనిచేస్తే, మరి కొన్ని సమయాల్లో రాత్రి వేళల పడిగాపులు గాయాలి! అంతా యాంత్రిక జీవితం.

కల్నల్ : ఈ రోజు వెళ్ళలేదు?

రఘు : ఇంకో గంటసేపు కులాసాగా కాలక్షేపం చెయ్యవచ్చు.

కల్నల్ : అలాగా! అయినా మీ బ్రతుకులకేన్లే. చెయ్యవలిస్తే తలమునిగే పని. లేకపోతే అంతులేని విశ్రాంతి

రఘు : అదేమిటి మూర్తిగారూ ఒక్కసారి అలా అనేశారు!

కల్నల్ : అవునోయ్! ఎడా తెరపీలేని వర్షాల్లో, అధికారుల ఆజ్ఞలు శిరసావహిస్తూ చచ్చీ చెడీ పెరేడి చేసే సైనికుడికన్న మీరు సుఖంగా లేరూ? యుద్ధంలో జయించామనే అహంభావంతో పరాయి రాజ్యపు పొలిమేరల్లో మే మధికారం చెలాయిస్తుంటే 'వీరేనా మా దేశాన్ని శ్మశానంకన్న నికృష్టంగా మార్చింది?' అని ఆ ప్రజలు ఏలా చూసే వారంటావు మా వేపు? తలెత్తిచూచే ధైర్యం లేక అలానే నడిచి వెళ్ళేవారం! ఏముందీ మా జీవితం—ఎండా వానల కలవాటుపడిన ప్రాణులం మేము?

జాని : వానలో తడవకుండా గొడుగులుంచుకునే వారు కాదూ మీరు?

కల్నల్ : గొడుగులు?—హ్హా! హ్హా! బావుంది! మూర్తీ! చాలా బావుంది కదూ? విన్నావా ఏమన్నదో—గొడుగులుట! మేమూ-గొడుగు లుంచుకోవాలట! హ్హా! హ్హా! అవున్లే—ఆడవాళ్ళకు సైనికుడి జీవితంగురించి ఏం తెలుస్తుందీ?

రఘు : కల్నల్! మా అమ్మగారు సానునయపూర్వకంగా పలకాలని గానీ—

కల్నల్ : నాకూ తెలుసు రఘూ! సైనికుడి హృదయం కర్కశం. కష్టపడడానికే అతడు జన్మిం

చాడు. బాధపడుతున్నా నవ్వుతూనే అతను భరిస్తాడు. కండలు కరిగేలా శ్రమించినా స్వార్థంకోసం కాక పరార్థంకోసం ప్రాకు లాడుతాడు. కానీ ప్రతిఫలం? గుండుదెబ్బ కాహుతి కావడం!

జాని : చెప్పిందల్లా జరగలే దనిపిస్తుంది మీ విష యంలో ఆ మొండి చెయ్యి మినహాయించి- (కాఫీ చల్లారుతుండడం చూచి రఘు చేతి కిస్తుంది అతని కిమ్మన్నట్లుగా)

కల్నల్ : (కోటు లోపలున్న పతకా న్నొకదాన్ని చూపిస్తూ) అందుగ్గాను నా కిచ్చిన బహు మానం—ఈ పతకం. (తనలో తా ననుకుంటు న్నట్లుగా) నాలోని మృగత్వ మంతా నాశన మైంది. ఇక చివరకు మిగిలింది?

రామే : కాఫీ తీసుకో మూర్తీ! మళ్లా ఆలోచించు కోవచ్చు.

కల్నల్ : (కప్పు నందుకుంటూ) నీ కక్కర్లేదా రఘూ కాఫీ?

రఘు : తరువాత తీసుకుంటానండి. ఆ యంత్రాల మధ్య ఏమాత్రం ఏమరుపాటుగా వున్నా ఈ దేహం ఇక ఇంటికి చేరదనుకుంటూ వుండేను.

జాని : అసుభం మాటలేమిటి రఘూ?

రఘు : సరదా కన్నా అలా భయపడతా నెందు కమ్మా!

కల్నల్ : అవునయ్యా! మీ రంతా యాంత్రికపు మను షులు మరి. తాంత్రికమో, మాంత్రికమో గాని, కాంతి - అని అనీ అనకముందే అంధ కార మంతా మటుమాయ మై దేదీప్యమానంగా దిశదిశలా దీపకాంతులు ప్రజ్వరిల్లడమా? శక్తి—అన్నారో లేదో ట్రాములు గణు క్కుంటూ పరుగెత్తడమా? శబ్దాన్ని మన సులోనైనా పూహించకముందే ప్రపంచపు నాల్గు చెఱగులకూ వ్యాపించడమా? చెప్పొద్దూ నాకూ మొదట్లో ఈ యంత్రాలు తంత్రాలమీద నమ్మకం లేదు కాని జీవితంలో ప్రత్యక్షంగా అనుభవించినప్పుడు ఏలా కాదంటాను?

రఘు : ఆ మలబారు స్వాములు బోధించిన మాయ లేనా? అంతా మోసం - దగా. కల్నల్! అంతా నటన.

కల్నల్ : మోసమా? నేను ప్రత్యక్షంగా చూసేను.

రఘు : చూచావా నాన్నా! మూర్తిగారికి ప్రత్య క్షంగా అనుభవమైనవట ఈ మాయలూ మంత్రాలూ?

కల్నల్ : కనికట్టు సంగతి విన్నారా మీరు? ఇంద్ర జాలం ఎప్పుడన్నా అనుభవమైందా మీకు? పోనీ 'బుట్టలో గారడీ' చూచారా మీరు?

రఘు : వాటిని చేయడ మంత ఘనకార్యం కాదే? కొద్దిగా సాధన కావాలి అంతే.

కల్నల్ : ఇది విన్నావా? ఆధార మేమీ లేకుండా, నిస్సహాయంగా గాలిలో వ్రేలాడే తాడును పట్టుకు, పైకి వెళ్ళి అక్కడ ఆకస్మాత్తుగా అదృశ్యం కావడం—

రఘు : ఆలాగా! (ప్రక్కనే టేబిలుమీదున్న అరటిపండ్లలో ఒకదాన్ని తీసుకుని కావా లని తెచ్చుకున్న అతి వినయంతో కల్నల్ కు ఈయబోతాడు.)

కల్నల్ : అరటి—! నా కెందుకు?

రఘు : మీరు మాకీనాడిన్ని వింత సంగతులు వెల్ల డించినందుకు.

కల్నల్ : (భార్యాభర్త లిద్దరూ సన్నగా నవ్వుతుం డడం చూచి) అంటే నామాటల్లో నమ్మకం లేదా?

రామే : కోపం తెచ్చుకోకు మూర్తీ నవ్వులాటకన్న మాట లవి!

కల్నల్ : (రఘు ఆ ఫలాన్ని యథాస్థానంలో వుంచడం చూచి) కానీ యథార్థమది. చెప్ప దలిస్తే అనేకం విశదపర్చవచ్చు. కాని నమ్మరు మీరు! అయినా ఇటుపై చెప్ప దలుచుకోనలేదు కూడా!

రామే : ఏమిటి మూర్తీ—ఆడే పాడే యీడువాళ్లను చూచి అంతగా ఆగ్రహించడం. (కుర్చీ కల్నల్ కు దగ్గరగా జరుపుకుంటూ) సరి

గాని నిన్న అదేదో 'వానర హస్తం' అంటూ మొదలెట్టావు—అదేమిటి?

జాని : (ఆశ్చర్యంతో) వానర హస్తం!

రామే : నిన్న ఆ విషయంమీద చర్చ కూడా జరిగింది.

కల్నల్ : అబ్బే! ఏమీ లేదు. రామేశం — అనవసరంగా కలత చెందకు. (ఖాళీ అయిన కాఫీ కప్పును నోటిదగ్గర పెట్టుకోబోతే) అరె! నింపుకున్నదే? అవును. ఎప్పుడు ఆ విషయాన్ని గూర్చి తలపోసినా అదేమిటో మతిమఱుపు కలుగుతుంటుంది. కారణ మనూహ్యం—

రామే : (కప్పులో మరికొంత కాఫీ పోస్తూ) సర్వకాలాలూ నీ వెంటనే వుంటుందన్నావు?

కల్నల్ : అవును. ఏ వేళ ఏ ప్రమాదం ముంచుకొస్తుందో అనే భయంతో, సర్వకాల సర్వావస్థల్లోనూ నావద్దనే వుంచుకొంటుంటాను దాన్ని.

జాని : అంత అవసర మేమిటో!

కల్నల్ : చెప్పినా నమ్మరు.

రఘు : నమ్మదగ్గ విషయాన్ని తప్పకుండా నమ్ముతాం!

కల్నల్ : అయితే మాయ! నవ్వుతున్నావు కదూ?

రఘు : లేదే. ఆ హస్తం మీవద్ద వున్నదా?

కల్నల్ : అహా.

రఘు : చూడకూడని రహస్యమా?

కల్నల్ : అంతగా మోజుపడి చూడవలసిందేమీ కాదు. (జేబు తడుముకుంటూ) సాధారణమైన— సర్వసాధారణమైన— ఓ వృద్ధ వానర హస్తం. ఎండా వానలకు తడిసి ఎండింది. (ప్రక్కనే బల్లపై పెడుతూ) ఇదిగో!

జాని : (ఆత్రుతగా వంగి, పరిశీలించి) ఓహ్!

రఘు : ఏముందీ—ఎండిపోయిన ఓ బొమిక.

కల్నల్ : మొదలే చెప్పాను కదూ! (గాలి రొద విన వస్తుంది. తలుపులు కొట్టుకోవడం చూచి)

జాని : అబ్బబ్బ! ఇంకా తగ్గలేదీ పాడు గాలి!

రామే : అయితే ఈ పాత బొమికను గూర్చి అంతగా చెప్పుకోవలసిందేమిటి?

కల్నల్ : దానిలో వున్న మహత్తు.

రామే : నిజం?

కల్నల్ : ఆ! ఒక సన్యాసివల్ల దీని కీమహత్తు సంక్రమించింది. చిన్నతనంలోనే సర్వసౌఖ్యాలను తృణప్రాయంగా త్యజించి, ఈ విశాల విశ్వంలోకి సత్యాన్వేషణకై వెళ్ళిపోయాడతను. దాదాపు ఓ పుష్కరంపాటు కనుపించిన ప్రతి చరాచర వస్తువులోనూ మూల బ్రహ్మాన్ని కనిపెట్టాలని ప్రయత్నించాడా జిజ్ఞాసువు. ఆసాధువు ప్రయత్నం కర్మకు దాసులై మానవులు పరిభ్రమిస్తున్నారని నిరూపణ చేయాలని—అంటే ప్రతివస్తువూ తన హేతువుకు కారణమైన మూలానికి భిన్నంగా సంచరించినపుడు నశించక తప్పదని. అందుచేతనే అనామకమైన ఈ వానర హస్తంలో బీజాక్షరాలను సంపుటిచేసి దివ్యమైన శక్తి కలగడానికి కారణభూతుడైనాడు. ప్రత్యేకమైన వానర హస్తానికే ఈ అదృష్టం లభ్యం కావటానికి తగిన కారణమేమీ లేదు. కాని తనకు దృగ్గోచరమైన మొదటి వస్తువుకే ఈ మహత్తు సంక్రమింపచేయాలనుకున్నాడు. అందుచేతనే ముగ్గురు వ్యక్తులు తా మభిలషించిన మూడు కోరికలనూ దీని సాయంచేత తీర్చుకోగలిగారు!

[ఈ మాటలు విని జానకమ్మ కాక మిగిలిన యిద్దరూ పేలవంగా నవ్వుతారు]

జాని : ష్! తప్పు కదూ!

కల్నల్ : కానీ — జ్ఞాపకముంచుకోండి — వారు ముగ్గురూ కొసకు తామా కోరికలను కోరకపోతేనే బావుండేదనుకున్నారు.

రామే : వారి కోరిక లేలా తీరాయి?

కల్నల్ : ఆ సాధువు చెప్పలేదు. కానీ, చాలా స్వాభావికంగా, ఏదో సర్వసాధారణమైన సంఘటనతో ముడివడ్డట్టు అనుకొంటారు మీ రంతా!

రఘు : మీ రేమైనా ప్రయత్నం చేశారా?

కల్నల్ : (విషాదంగా) ఆ!

రఘు : మీరూ మూడు కోరికలు కోరుకున్నారా?

కల్నల్ : ఆ!

రఘు : అభీష్టం నెరవేరిందా?

కల్నల్: (విరక్తితో) బాగా నెరవేరింది.

రఘు : ఇంకెవరైనా కోరుకున్నారా?

కల్నల్: కోరుకున్నారు. మొదటివాడు తన మూడు కోరికలనూ కోరుకున్నాడు. (ఏదో జ్ఞాపకం తెచ్చుకున్నట్లుగా) అవును. ఔను. అతని మూడు కోరికలూ నెరవేరాయి. అతని మొదటి రెండు కోరికలేమిటో నాకు తెలీదు. (గంభీరంగా) మూడవది మాత్రం అతను కోరుకున్నది మరణాన్ని.

రఘు : బావుంది. చాలా బావుంది. అయితే దుష్ఫలితాలేమీ కలుగచేయని కోరికలనే కోరుకున్నారా మీరు?

కల్నల్ : (కాదన్నట్లు మూలుగుతాడు)

రామే : మూర్తీ! నీ అభీష్టం నీకు సిద్ధించిన తర్వాత అది నీకు నిరుపయోగమేగా! ఇంకా నీ సంరక్షణెందుకు దానికి?

కల్నల్: ఊరకనే. ఇదివరలో అమ్మాలనుకున్నాను. కాని అమ్మలేనేమో బహుశా ఇవ్వను. దానిమూలంగా జరుగవలసిన కీడు సమస్తం జరిగిపోయింది. అదీగాక దీన్నెవ్వరు కొంటారు? కొందరు కాకమ్మకథంటూ ఎగతాళి చేస్తే మరికొందరు మోసగాడంటూ నన్ను దూషించారు. ఒకరిద్దరు కొనాలని ముందుకు తూగినా ఫలితం పరీక్షించి గాని మూల్యం ఇవ్వరట! (నవ్వుతారు ముగ్గురూ)

జాని : మీరు మరో మూడు కోరికలు కోరినా సిద్ధిస్తాయా?

కల్నల్: (ఆ హస్తాన్ని చేతుల్లోనే వుంచుకొని మెల్లగా) తెలీదు — నాకు తెలీదు. (అకస్మాత్తుగా వచ్చిన ఆవేశంతో) కాని ఇక కోరుకుంటే నా పతనాన్నే కోరుకోవాలి.

రామే : (తొందరగా లేస్తూ) అదేమిటి! ఏం చెయ్యబోతున్నావు?

కల్నల్: ఏంలేదు. విరిచి వీధిలో పారేస్తాను.

రామే : పిచ్చివాడా! నీకవసరం లేకపోతే నాకిచ్చివెయ్!

కల్నల్ : (పిచ్చిగా నవ్వుతూ) నీకా? నీకేనా? ఇప్పటికే పాపంతో బరువెక్కి నా చేతులు బాధపడుతున్నాయి. దీన్ని నాశనం చేయనీ నన్ను. అలా జరుగకపోతే తదుపరి ఫలితాలకు మాత్రం నేను బాధ్యుణ్ని కాదుసుమా!

రామే : ఇష్టపూర్తిగా నే తీసుకోదలుస్తున్నాను. ఏమంటావు రఘూ?

జాని : ఎవరో వజ్రాలూ, వైడూర్యాలూ వీధిలోకి విసిరేసి బయటవున్న గులకనూ మట్టినీ ఇంట్లోకి తట్టలకొద్దీ తెచ్చుకున్నాడుట!

రామే : (కల్నల్ దగ్గరున్న ఆ హస్తాన్ని తీసుకుంటూ) అదికాదు నే కోరేది...

కల్నల్ : (అపార్థం చేసికొని, తీవ్రంగా) ఆగు. ముందు వెనుక ఆలోచించి ఏ పనికైనా నడుం బిగించు. అదికాదు కోరుకునే పద్ధతి.

రామే : మరింకేది?

జాని : పాముతో చెలగాటాలాడతారేమండి?

కల్నల్ : నే చెప్పదలచుకొన్నది కూడా అదే నమ్మా! అతన్నిపుడు నేను వారించకపోయివున్నట్లైతే ఏదో ఒక అఘాయిత్యం చేసేవాడు. కోరదలచినపుడు కుడిచేతిలో వస్తువునుంచుకొని ధ్యానిస్తే ఎవరైనా. అసలెందుకతనికీ బుద్ధి పొడమిందో!

రఘు : ఇదంతా త్రేతాయుగపు కట్టుకథలావుంది. చూస్తుంటే నాన్నా — రావణుడిలా ఓ పది చేతులు, బ్రహ్మలా నాల్గుముఖాలు, హనుమంతుడికున్నట్లు ఓ పెద్ద తోక, కోరుకుంటే ఇలా వుంటుందంటావు?

రామే : చాలా బాగా చెప్పావు రఘూ! నే కోరేది కూడా...

కల్నల్ : (ఆవేశంతో) ఆగండి! కోరుకోవలిస్తే సబబైనది కోరండి. రామేశం — మళ్ళీ బ్రతిమాలుకుంటున్నా దాని జోలికి పోవద్దని నామాట వినదల్చుకోకపోతే నేనీ గడప దాటిన తర్వాత కోరుకో. ఏదీ నాకోటు?

రామే : మూర్తీ! అనవసరంగా కలత చెందకు. అంతా సవ్యంగా జరుగుతుంది. (వెళ్ళిపోతాడు.)

కల్నల్: ఏమిటిది?

రామే : తీసుకో మూర్తీ! (అతని చేతిలో బలవంతంగా పెడ్తాడు).

కల్నల్: వెళ్ళొస్తాను అమ్మా! రామేశం చెప్పినా వినేటట్లు లేడు. కనీసం నువ్వైనా కని పెట్టి వుంటావు కదూ? రఘూ! జాగ్రత్త. వెళ్ళొస్తాను.

[మూర్తి వెళ్ళిపోగానే రామేశం ద్వారం మూసేసి మెల్లగా రఘు దగ్గరకు వస్తాడు.]

రఘు : ఇదివరలో చెప్పిన కథల్లాంటిదయితే ఇహ మనం మూర్తిగారికి ఉద్వాసన చెప్పటం మంచిదేమో!

జాని : మీరేదో అతగాడికి ముట్టజెప్పారట్లుంది?

రామే : వద్దంటున్నా, బావుండదని బలవంతంగా ఓ చిన్న మొత్తం కట్టబెట్టాను.

జాని : ఈలా ముందువెనుకలు చూడకుండా ఖర్చు పెట్టడం—అప్పులు తీరలేదంటూ తర్వాత మళ్ళీ మనమే బాధపడడం—బాగానే వుందీతంతు?

రామే : ఇప్పుడనిపిస్తోంది నాకు, దాన్ని మన మెందుకు తీసుకున్నామా అని.

రఘు : కీర్తి, ధనం, సుఖం కొనుక్కోవడానికి.

జాని : ఎందుకొచ్చిన బెడద కాని వీధిలో పారేయండి వెధవ బొమ్మను.

రఘు : ఈ ధరాతలానికంతటికీ ఏకైక చక్రవర్తిగా వుండాలని కోరుకో నాన్నా! ముఖ్యంగా ఈ అప్పులవాళ్ళ బాధ లప్పుడు తప్పించుకోవచ్చు.

జాని : వయసొచ్చినా కుర్రతనం వదల్లేదింకా.

రామే : రఘూ—ఏం కోరాలో కూడా అర్థంకాకుండా వుంది. మనకేం లేకపోయిందనీ!

రఘు : (మాతృవదనంలోకి చూచి) నాన్నా! ఈ ఈ అప్పులన్నీ వదలిపోవడం నీకూ సంతోషమే కదూ! కోరుకో నాన్నా—వెయ్యి రూపాయలు కావాలని.

రామే : (నవ్వుతూ) నిజంగా?

రఘు : కోరుకో నాన్నా — ఇంకా సందేహ మెందుకు?

జాని : అమానుష శక్తులతో మనకేమిటండీ పంతాలు!

రఘు : కోరుకో నాన్నా.

రామే : (ఏదో నిశ్చయానికి వచ్చినట్లు, ఆ వానర హస్తాన్ని కుడిచేత్తో గట్టిగా పట్టుకుని) నేను—నేను, వెయ్యి రూపాయలు కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నా. (ఈమాట లంటూనే రామేశం ఒక్కసారిగా అరిచి ఆ హస్తాన్ని జారవిడుస్తాడు).

రఘు, జాని : ఎందుకరిచారు?

రామే : (భయం భయంగా) కదిలింది. అది ... అది...నా చేతుల్లో — నా చేతుల్లో పాములా మెలికలు తిరిగింది.

రఘు : ఛా! ఛా! కదలే మెదలని ఓ పాతబొమ్మను చూచి ఏమిటి నాన్నా అలా భయపడ్తారు?

జాని : అపాయమేమీ జరుగలేదుగదా?

రఘు : ఏదినాన్నా డబ్బు? మంత్రాలకు చింతకాయలు రాల్తాయా?

రామే : నిజంగా కదిలింది రఘూ!

రఘు : సరిసరి! (గడియారం చూసుకొని) అరె! పది దాటిందినాన్నా! ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఇక వెళ్తాను అబ్బ! ఎంత సంతోషంగా గడిచిందీ సాయంత్రం!

జాని : పెందలకడనే వస్తావుకదూ?

రఘు : సాధ్యమైనంతవరకు సూర్యోదయానికల్లా వస్తాను. నాకోసం నిరీక్షిస్తూ మాత్రం వుండకండి సుమా! నాన్నా — మీరు నిద్ర లేచేసరికి మీ మంచంమీద ఆ వెయ్యిరూపాయలూ వుండవచ్చు కాని ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తుండకండేం? బై. బై.

జాని : భద్రంగా రా రఘూ! (తలుపు వెయ్యటానికి వెళ్ళి గడియలు సరిగా వుండవట్లు గమనిస్తుంది) ఈ ద్వారాలు చాలా బిరుసుగా వున్నాయండి.

రామే : రేప్రొద్దున మనవాడిచేత బాగుచేయిద్దాం లెద్దూ!

[ప్రక్కగదిలోకి వెళ్ళబోతున్న వాడల్లా వూరకనే అద్దం ముందుకువచ్చి నిలబడతాడు. అద్దంలో చూడగానే అతనివాలకం మారుతుంది. క్రమంగా మనిషి కంపిస్తాడు]

రామే : (పెద్దగా అరుస్తూ) జానకీ! జాన...

జాన : (వెళ్ళబోతున్నదల్లా ఆగి) ఏమిటండీ?

రామే : (తమాయించుకొని) ఆ! — ఏమీ లేదు. ఏవో కొన్ని — కొన్ని ముఖాలు కనుపించాయీ అద్దంలో వికృతంగా.

జాన : మరీ చిన్నపిల్లలవుతున్నారు.

[అతని చేయి పుచ్చుకుని ఆమె ప్రక్కగదిలోకి తీసుకుపోతుంది. అతడామె ననుసరిస్తున్నా వెనుకకు భయం భయంగా చూస్తుంటాడు] — తెర.

## 2

* * బంగారుకిరణాలు నలుదెసలా ప్రసరిస్తుంటాయి. అదేగది. కిటికీకి దగ్గరగా బల్ల ఒకటి వుండి అందుమీద కొన్ని ఫలాలు, కాఫీ అమర్చబడి వుంటాయి. జానికమ్మ బల్లదగ్గరగా ఏదో పనిలో నిమగ్నమై వుంటుంది. రామేశం కిటికీలోనుండి బయటకు చూస్తుంటాడు. వీధి ద్వారం తెరచి వుంటుంది

రామే : ప్రతినిత్యం ఇంత ఉదయాన్నే అంతదూరం నుంచి రఘు నడచిరావాలి.

జాన : ఏడు దాటినట్లుంది. ఈసరికి వస్తూ వుండాలి.

రామే : అర్ధగంటపైగా పడ్తుంది నడిచి రావడానికి. తప్పకుండా ఈపాటికి ఈ పొలిమేరలు సమీపించి వుండాలి.

జాని : ఇంకో పదినిముషాల్లో ఇంటికి చేరుకోవచ్చు.

రామే : ఇంతకూ వాడికి ఫలహార మేం చేశావు?

జాని : నిన్న ప్రొద్దునే అడిగాడు 'సేమ్యా ఇడ్లీ చేయకపోయినావా ? అని. (బల్లమీదకు యదాలాపంగా చూస్తూ) అరె! ఇంకా ఈ పాడుబొమిక ఇక్కడే వున్నది? మూర్తిగారి కల్లబొల్లి కబుర్లను నమ్మినందుకనుకోవాలి.

రామే : ఆ! ఆ! వాడూ — వాడి కథలూ! వృద్ధులైన ప్రతివారికీ మతిచాంచల్యం తప్పదనుకుంటా

జాని : మీరు కాఫీ పుచ్చుకోండి. తనకోసం నిరీక్షించడం వాడికి సుతరామూ ఇష్టముండదు.

రామే : మరి నీవు?

జాని : పిల్లవాడు రాకుండా ఏలాగండి?

రామే : జానీ — నన్నూ అలానే అనుకోరాదూ!

జాని : ఏమండీ, ఈ కలికాలంలో కోరికలేలా సిద్ధిస్తాయంటారు?

రామే : ఏమిటే! రాత్రల్లా దాన్ని గూర్చే ఆలోచిస్తున్నావా?

జాని : మీ పలవరింతలు నిద్ర పట్టనిస్తేనా.

రామే : రాత్రల్లా దుస్స్వప్నాలతో బాధ పడ్డాను జానకీ!

జాని : అదీగాక ఒకటే గాలిరొద తుఫానేమో ననుకున్నాను.

రామే : నాకేమీ తెలీదు. నిద్రపట్టకుండా మహాయాతన ననుభవించాను.

జాని : ఆ పాడు బొమికను గూర్చి ఆలోచిస్తూ రాత్రల్లా గడిపారా? వెయ్యిరూపాయల కోసం! అదీగాక మూర్తిగారు చెప్పనే చెప్పారు కదూ — ఒకవేళ మీకోరిక నెరవేరితే అది చాలా స్వాభావికంగా జరిగిపోతుందని.

రామే : అయినా కోరికలకు దాసుణ్ణయ్యాను.

జాని : ఇక అది నెరవేరదు కూడా! (బయటతలుపు చప్పుడు. ఆమె ఒక్కసారి ఉలిక్కిపడుతుంది) ఏమిటది?

రామే : ఉత్తరాలేమైనా వచ్చాయేమో!

జాని : ఉత్తరమేనండి వచ్చింది.

రామే : (నవ్వుతూ) అందులో ఏముంటుందంటావు?

జాని : ఏమండీ—! ఏమండీ—! బహుశా —?

రామే : బహుశా ఏమిటి?

జాని : బహుశా అందులో వెయ్యిరూపాయలుంటే

రామే : (ఆదుర్దా అణచుకుంటూ) ఎంత పిచ్చిదానవు జానకీ! పోనీ నువ్వే తీసుకో ఆ ఉత్తరం.

జాని : (ద్వారంవద్దకు పరుగెత్తి, ఉత్తరాన్ని తీసుకుంటూ) చాలా బరువుగా వుందండి.

రామే : ఏదీ? (ఉత్తరాన్ని తీసుకుంటూ) ఏవీ నాకళ్ళద్దాలు?

జాన : నన్ను చదువమంటారా ఉత్తరం?

రామే : ఓహో! దాన్ని ముట్టవద్దుసుమా! ఏవీ నా కళ్లద్దాలు.

జాన : లక్ష్మీపేరు వినేసరికి మనుషుల మనసులు మార్తాయిగామోసు.

రామే : కొద్దిగా నాకళ్లద్దాలు వెతికి పెట్టూ.

జాన : (కళ్లద్దాలిస్తూ) ఇదిగోనండి. ఉత్తరాన్ని మీ చిత్తమొచ్చినట్లు చింపకండి.

రామే : ఏమీ ఫర్వాలేదు.

జాన : బ్యాంకీ నోట్లుండవచ్చునండీ.

రామే : (ఉత్తరం చూచి, అందులోనుండి ఓఖరారు పత్రం పైకితీసి) జానకీ! నువు పిచ్చిదానవయ్యావు. నన్ను పిచ్చివాణ్ని చేశావు. (అతడు చదువుతాడు) అయ్యా! మీరు ఇల్లు కొనగలందులకై పుచ్చుకొన్న వెయ్యిరూపాయలకూ పంపినవడ్డీ మాకు ముట్టినది. అందుగ్గాను ఇచ్చిన ఈ రసీదును తీసుకోవలసింది.

[వారిద్దరూ ఒకరివేపు ఒకరు చూచుకొంటారు. జానికమ్మ కిటికీవద్దకు వెళ్ళి నిలబడుతుంది]

జాని : ఇదంతా ఆకల్నల్ మాటలు నమ్మినఫలితం?

రామే : అతనో కబుర్లకామయ్య.

జాని : మీరందులో బ్యాంకీ నోట్లున్నయ్యనుకున్నారు.

రామే : నేనా? నే ననుకొన్నదీ...

జాని : మన తెలివి తక్కువతనం రఘుకు తెలిస్తే ఏలావుంటుందంటారు?

రామే : నువు చెప్పవని నాకు తెలుసుగా!

జాని : (చిలిపిగా చూస్తూ) అలాగా! అయితే తప్పకుండా చెప్తాను. రఘు వేళాకోళంగా నవ్వుతూంటే ఎంత బావుంటుంది! నిన్న రాత్రి మీ చాదస్తం చూచి వాడెంతగా నవ్వుకున్నాడు!

రామే : అయితే అది కదల్లేదంటావు? ప్రమాణపూర్తిగా చెప్తున్నాను. ఆ వానరహస్తం నా చేతుల్లో పాములా మెలికలు తిరిగింది.

జాని : (కిటికీగుండా బయటికి చూస్తూ) మీరు చెప్పింది నిజమంటారు?

రామే : అవును. దానిమూలంగా నే నెంత బాధపడుతోందీ కూడా నీకు తెలుసు. అయినప్పుడూ ఎందుకు నమ్మలేవు?

జాని : (బయటికి చూస్తూనే) నమ్మలేను.

రామే : ఎందుకని అని.

జాని : నమ్మశక్యంకాని విషయం కాబట్టి.

రామే : రఘు వస్తున్నాడా?

జాని : లేదు.

రామే : బహుశా వస్తుండవచ్చు. ఎందుకలా చూస్తావు!

జాని : ఏమీ లేదు. ఎవరో ఓ పెద్దమనిషి. నల్లకోటొకటి తొడుక్కున్నాడు...

రామే : అయితే...

జాని : మన యింటిముందు తారట్లాడుతున్నాడు లోపలకు రావాలన్నట్లుగా. ఇంకా ఏదీ నిర్ణయించుకోనట్లుంది పాపం!

రామే : వీధిలో వాళ్ళ రాకపోకల్నిగూర్చి ఏమిటి జానకీ అంత శ్రద్ధ?

జాన : అతను మన యింటివేపే చూస్తున్నాడు. లేదు లేదు—వెళ్ళిపోతున్నాడు. (ఆత్రుతగా) ఏమండీ—అతనో ప్లీడరులా కనిపిస్తున్నాడండి.

రామే : ప్రయోజనం?

జాన : చెప్తే నవ్వుతారేమో! అతను ఆ వెయ్యిరూపాయలనుగూర్చి మాట్లాడ్డానికి వచ్చినట్లైతే...

రామే : ఏమిటి జానకీ అంత వెర్రిబాగుల్దాని వౌతున్నావు. అతడు వెళ్ళిపోయాడా?

జాన : ఆ! వెళ్లిపోయినట్లే. లేదండి ..అతడు మళ్లీ వెనక్కు తిరిగాడు. ఏదో నిర్ధారించుకొన్నట్లున్నాడు. ఇటే వస్తున్నాడండీ! ఏమండి!

రామే : ఏమిటి జానకీ అంత ఆదుర్దా. అతనూ పొరబడి వుంటాడు.

ప్లీడర్ శంకరం : (బయటనుంచి) రామేశం గారిల్లిదేనాండి.

జాన : లోపలకు రాండి!

ప్లీడర్ : (లోపలకు వస్తూ) నన్ను ప్లీడర్ శంకరం అంటారండి.

రామే : కూచోండి దయచేసి.

ప్లీడర్ : (గాబరాగా) కూచుంటాను — ఎందుకు కూచోనూ? తప్పకుండా —అహా— తప్పకుండా.

రామే : (సంభాషణ విధిలేక సాగించవలసివచ్చిందన్నట్లుగా) బయట గాలి చాలా బావుంది కదండీ ప్లీడరుగారూ!

ప్లీడర్ : ఓ—అవును—ఔనౌను. (కొద్ది నిశ్శబ్దం. మాట్లాడ్డానికి ప్రయత్నిస్తున్నట్లు) నా పేరు శంకరం— నేను వచ్చిన పని....

రామే : బహుశా మీరు మా రఘుకోసం వచ్చి వుంటారు. కూర్చోండి. ఇంకో కొద్దిసేపట్లో వచ్చేస్తాడు. మేం కూడా వాడికోసమే చూస్తున్నాం!

ప్లీడర్ : (అడ్డు తగుల్తూ) అబ్బే......లేదు. (కొద్ది నిశ్శబ్దం) నేనూ అక్కడినుండే వస్తున్నాను.

జాన : అయితే మీరూ వాడూ కలిసే రావలసింది..

ప్లీడర్ : లేదు — లేదు. నేనూ — ఒంటరిగానే వచ్చాను.

రామే : ఏమయినా మాతో మాట్లాడాలా?

ప్లీడర్ : నేనూ —మీకో సంగతి చెప్దామని.

జాన : (అకస్మాత్తుగా) రఘూ కేమైనా జరిగిందా? దెబ్బలేమైనా తగిలాయా? బాగా తగిలాయా దెబ్బలు.

రామే : తొందరపడి నిర్ణయాలకు రాకు జానకీ! ప్లీడరుగారిని మాట్లాడనీ. మీరేమీ చెడు వార్త తీసుకురాలేదు కదండీ?

ప్లీడ : క్షమించాలి.

జాని : వాడికి గాయాలు తగిలాయా? (ప్లీడరు ఔనన్నట్లు తలూపుతాడు) బాగా?

ప్లీడ : చాలా తీవ్రంగా.

జాని : (బాధగా) ఏమండీ!

రామే : రఘుకు బాధ ఎక్కువగా వుందా?

ప్లీడ : అతని కెటువంటి బాధలూ లేవు.

జాని : భగవాన్! (భర్తవేపు చూస్తుంది. ప్లీడర్ చెప్పినమాటల అర్థం స్ఫురించగానే) ఆ! అంటే?

[ప్లీడరు ఆమెవేపు చూడలేక తలవంచుకుంటాడు. రామేశం మెల్లగా ఆమెను ఒక కుర్చీలో కూర్చోబెట్టి ప్లీడరుకూ ఆమెకూ మధ్యగా వచ్చి నిలబడతాడు]

రామే : జరిగిందేమిటో చెప్పండి ప్లీడరుగారూ?

ప్లీడరు : రఘు తన స్నేహితుల కందరికి ఏదో కథ చెప్తున్నాడు. ఆ కథ ఇక్కడే జరిగిందట. గత రాత్రి. ఆ నవ్వుల్లో, ఆ సంతోషంలో ఏం చేస్తున్నదీ వూహించుకోకుండా — ఇంతలో ఓ యంత్రంలో చిక్కుకుపోయాడు. (జానకమ్మ బాధగా దుఃఖిస్తుంటుంది)

రామే : నిజమే! యంత్రమే — అతన్ని — పట్టుకుంది. ఒక్కగానొక్క కొడుకు. అబ్బా!

ప్లీడరు : మా యజమాని మీకు తన హృదయపూర్వకమైన సానుభూతి అందజేయమని నన్ను పంపాడు. తీర్చలేని ఈ మీకష్టాన్ని...

రామే : నిజమే. తీర్చరాని—కష్టం!

ప్లీడరు : ఇంకో చిన్న సంగతి మీకు చెప్పాలి. నేను వారి సేవకుణ్ణి మాత్రమే—వారు చెయ్యమన్న పని చెయ్యడం తప్ప—

రామే : తీర్చలేని కష్టం!

ప్లీడరు : (కవరొకటి బల్లమీద పెడుతూ) మా యజమాని ఈ దుస్సంఘటనకు పూర్తి బాధ్యత

మీ కుమారుడికే నంటున్నాను. కానీ మీకు జరిగిన నష్టానికీ, రఘు చేసిన సేవకు ప్రతిఫలంగా కొంత మొత్తం మీకు ముట్టచెప్ప దలిచాను. (ద్వారంవద్దకు వెళతాడు).

రామే : మాకు జరిగిన—నష్టం! (అకస్మాత్తుగా—భయంతో) ఎంత?

ప్లీడరు : వెయ్యి రూపాయలు! (వెళ్ళిపోతాడు).

[జానకమ్మ దుఃఖం పెద్దదౌతుంది. ఆమె వేపైనా చూడకుండా రామేశం తనలో తనే నవ్వుకుంటుంటాడు. పిచ్చిగా నవ్వుతున్న రామేశాన్ని చూచి, భయంతో జానకమ్మ తన దుఃఖం తానే మానుకొని భర్తను చేరబోతుంది ]

**3**

* * అదే గది. కానీ వస్తువు లన్నీ చిందరవందరగా పడివుంటాయి. పడక్కుర్చీలో పడుకుని రామేశం మగతగా తనలో తానే ఆలోచించుకుంటుంటాడు. శూన్యంలోకి చూస్తూ జానకమ్మ కిటికీవద్ద కూర్చొని వుంటుంది. బల్లమీదున్న క్రొవ్వొత్తి దీపం చివరి నిశ్వాసాన్ని వదుల్తోంది.

రామే : (కళ్ళు తెరిచి, చుట్టుప్రక్కల పిచ్చిగా చూస్తూ) జానకీ! జానూ!

జాన : ఆ!

రామే : ఎక్కడున్నావు?

జాన : కిటికీవద్ద.

రామే : ఏం చేస్తున్నావు?

జాన : శూన్యంలోకి చూస్తున్నా.

రామే : ఏం లాభం జానకీ? ఏం లాభం?

జాన : ప్రతిరోజూ ఆ అడ్డదారివెంటనే నడిచి వచ్చేవాడు. అదిగో ఆ చెట్టుక్రిందనే మనం ముగ్గురం కూర్చుని ఫొటో కూడా తీయించుకున్నాం.

రామే : వారం రోజులయిందా బాబు మనను విడిచి-కైమెంత ?

జాన : నాకు తెలీదు.

రామే : అయినా మనకు కాలంతో ఇంకేం పని. ఆరిపోయాయి మన ఆశ లన్నీ.

జాన : రాడు కదూ మన రఘు తిరిగి? ఈ ఇంటి కిక రాడు నాకు. ఏమండీ—నా బంగారు కొండ నిజంగా మాయమయ్యాడూ? మనసులో మాట చెప్పుకోనడానికైనా లేడూ మన రఘు?

రామే : పిచ్చిదానా ఆలోచనలకు కూడా దూరమయ్యాడు. ఇంకా ఎందుకు ఆ నిరీక్షణ? కిటికీ మూసివెయ్! అసలే నీది వాతప్రకృతి.

జాన : కానీ రఘు వుండేచోట ఇంకా చల్లగా ఉంటుందిగా!

రామే : అవును. మనను విడిచి శాశ్వతంగా వెళ్ళిపోయాడు.

జాన : నా వరాల తండ్రి!

రామే : ఇంత చిన్న వయస్సులోనే కోరిక లన్నీ తీర్చుకొని—

జాన : ఊఁ! మన కోరిక లన్నీ—(ఒక్కసారిగా) ఏమండీ?

రామే : ఏమిటి జానకీ?

జాన : (మితిమీరిన ఆత్రుతతో) ఆ హస్తం! ఏదీ ఆ వానరహస్తం?

రామే : ఎక్కడ? ఎక్కడుంది? దాని అవసరమేమిటి?

జాన : నాకు కావాలి! దానితో మన అవసరాలు పూర్తిగా తీరలేదు!

రామే : అప్పటినుంచి- నేను దాన్ని చూడలేదు— ఎందుకూ!

జాన : నాక్కావాలి! చూడండి ఎక్కడుందో.

రామే : (బల్లక్రింద చూస్తూ) ఓహో! ఇక్కడ. ఇక్కడుందది! దీని ప్రయోజనం? (అక్కడే దాన్ని వదలి పెడతాడు.)

జాన : దానితో మన కెందుకు ప్రయోజనం లేదూ?

రామే : ఏం ప్రయోజనం ?

జాన : ఇంకా రెండుకోరికలు మిగిలేవున్నాయి.

రామే : (భయంతో) ఏమిటి ?

జాన : మనం ఒక్కసారే కదూ కోరుకున్నది ?

రామే : (విషాదంగా) అది చాలదూ ?

జాన : లేదు. ఇంకోసారి కోరుకుందాం! (ఆ హస్తాన్ని తన చేతుల్లోకి తీసుకుంటూ) తీసుకోండి దీన్ని త్వరగా. ఊఁ!

రామే : ఏం కోరాలి ?

జాన : ఓహ్! ఇంత మందబుద్ధులేమండీ ? మన కుర్రవాడు సజీవుడై రావాలని కోరుకోండి.

రామే : అరి భగవంతుడా! మతి చలించలేదు కదా నీకు!

జాన : తీసుకోండి. త్వరగా కోరండి. (దీనంగా) బాబూ! రఘూ! ఎక్కడున్నావోయి ?

రామే : జానకీ! వెళ్లు. కాసేపు ప్రశాంతంగా పడుకో. నీవేం మాట్లాడుతున్నావో నీకే తెలీకుండా వుంది.

జాన : మనం అభిలషించిన మొదటికోరిక నెఱవేరింది. రెండవదిమాత్రం...

రామే : వాడు మనను విడిచిపోయి దాదాపు వారం కావచ్చింది. కనీసం మన వాడి మృతదేహాన్నైనా చూడటం తటస్థించలేదు.

జాన : అవన్నీ నాకనవసరం. నాక్కావలసింది 'అమ్మా' అంటూ నా రఘు నన్ను పిలవడం!

రామే : నే నా వానర హస్తాన్ని ముట్టుకోలేను జానకీ:

జాన : ఇదిగో! ఇదిగో! కోరుకోండి.

రామే : జానకీ!

జాన : కోరుకోండీ!

రామే : (భయపడుతున్నా భార్య అవస్థను చూడలేక) నేను — నేను — నా పుత్రుడు. సజీవుడై తిరిగి రావాలని కోరుకుంటున్నాను. [అరుస్తూ అతడా వానర హస్తాన్ని క్రింద పడేస్తాడు. దీపం ఆరిపోతుంది. గదిలో అంతా అంధకారం. తడుముకుంటూ ఓ కుర్చీ చూసుకుని అతడందులో కూలబడతాడు. జానకమ్మ త్వరత్వరగా కిటికీ వద్దకు వస్తుంది. కిటికీలోగుండా చంద్ర కిరణాలామెమీద పడుతుంటాయి]

జాన : రఘు రాలేదూ ?

రామే : దయామయుడివి భగవంతుడా!

జాన : ఫలితం శూన్యమేనా ? ప్రకృతి అంతా నిశ్శబ్దంగానే వుంది ? (కిటికీ మూసేస్తూ) లాభం లేదు ఈ జీవితాలిక నిష్ప్రయోజనాలు.

రామే : నిజమే! గతించిన ఆ మధుర వసంతాలను జ్ఞప్తి చేసుకుంటూనే ఇక మనం శేషజీవితాలు గడపాలి ?

జాన : (భర్తను సమీపిస్తూ) మనలో వున్న సంతోషం ఆరిపోయింది. బాబును చూచుకుంటూనే బ్రతుకులు గడిపేవారం! మనం మళ్లీ బ్రతుకును మొదలెట్టలేం ? ఈశూన్యంలో ఈ అంధకారంలో తిరిగి ఆశాకిరణాలు వెలుగు రేఖలు — మన కసాధ్యమైనపని.

రామే : (సముదాయింపుగా) మరణానికి చాలా దూరంగానే వున్నాం జానకీ! అంత నిరాశ అనవసరం...

జాన : ప్రతిక్షణమూ మనకొక యుగం!

రామే : జానకీ! ఎంతసేపీ కటికచీకటిలో వుండాలి.

జాన : కటిక చీకటి మాత్రమే కాదు. ఈప్రదేశం శ్మశానాల పొలిమేరకూడా!

రామే : దీపమేదీ ? అగ్గిపెట్టె ఎక్కడ ? మనం చీకటిలో వుండకూడదు జానకీ! (దీపం వెలిగించి, తగ్గుస్థాయిలో) ఎందుకలా బాధపడతావు ? వెళ్లి కాసేపు నిద్రపో. బాధను కొంతసేపైనా మర్చిపోవచ్చు.

జాన : మేలుకొన్నా, నిద్రపోయినా, పనిచేసినా : పాటపాడినా, నా రఘునావద్ద వుంటేనే మనసుకు తృప్తి, ఆత్మశాంతి!

(వీధిద్వారంవద్ద దీర్ఘమైన ఓ తలుపుచప్పుడు)

రామే : ఎలుకల్లు. ఇల్లంతా ఎలుకల మయం! ఏమిటది ? (తలుపు చప్పుడు పెద్దదౌతుంది. ఆమె బయలు దేరుతుంది తలుపు తీయడానికి రామేశం ఆమెను వెళ్లనీయకుండా) ఆగు ?

జాన : (ఆవేశంతో) నా పిల్లవాడు! వాడే నా రఘు! మర్చిపోయ్యాను ఓ మైలు దూరం నడిచి రావాలన్న సంగతి. నన్నెందుకు పట్టుకుంటారు? నా పిల్లవాణ్ణి నే నాహ్వానించాలి. వదలండి!

[అంగులేకుండా తలుపుదగ్గర శబ్దం వినిపిస్తుంటుంది. ఒకోక్క సారి పెద్దగా—మరో సారి సన్నగా—మధ్యమధ్య కొద్ది విశ్రాంతితో]

రామే : అరె భగవాన్!

జాన : (భర్త పట్టునుండి విడిపించుకోటానికి ప్రయత్నిస్తూ) నన్ను బంధించకండి!

రామే : తలుపు తీయవద్దు జానకీ!

జాన : నన్ను వదలరూ?

రామే : నన్ను ఆలోచించుకోనీ ఒక్క క్షణం నీవు:

జాన : నన్ను పంచమని పుట్టిన నాపిల్లవాని ప్రేత రూపం చూచి నేభయపడ్తానని మీరు సందేహిస్తున్నారా? నన్ను వదలండి. (తప్పించుకొని ద్వారంవద్దకు పరుగెత్తుతుంది) బాబూ! రఘు! వస్తున్నా నాయనా—నీకోసం—మీ నాన్నగారినికూడా ఎదిరించి వస్తున్నా నాయనా!

రామే : తలుపు తెరవ్వకు! జానకీ! తలుపు తెరవద్దు. (ఆమె తలుపు తెరవబోతుంది. కానీ గడియ ఆమె కందదు)

రామే : (అకస్మాత్తుగా) హస్తం! ఏదీ ఆ వానర హస్తం! (క్రిందంతా వెదకుతాడు)

జాన : ఏమండీ! రారూ? తలుపు రావడం లేదు. మీ కుర్రవాణ్ణి నా కందియ్యడానికి రాలేరూ!

రామే : (ఆవేశంతో) మూడవకోరిక ఇంకా మిగిలే వుంది! (తలుపుదబ్బుకు మరింత పెద్దదై ఏకశ్రుతిగా వినవస్తుంటుంది)

జాన : మీకు వినిపించటంలేదూ ఆశబ్దం? మీ ఒక్కగా నొక్క కొడుకు మిమ్ములను పిలుస్తూ...

రామే : అదెక్కడుంది? ఎక్కడ పడిపోయిందది?

జాన : రారూ? సహాయం చేయరూ? తల్లీ బిడ్డల్ని వేరు చేస్తారా?

రామే : ఎక్కడ పడిపోయిందది? కనుపించడంలేదు నాక్కనుపిం...

జాన : (శబ్దం పెద్దదవడం చూచి) రఘూ! రఘూ! నా చిట్టితండ్రీ! కొద్దిక్షణాలు ఓపిక పట్టు! నీ కన్నతల్లి స్వయానా తలుపు తీస్తోంది నాయనా! ఆఁ గడియ వూడింది బాబూ! వస్తున్నా...

రామే : భగవంతుడా! (వానరహస్తం కనిపిస్తుంది) అమ్మయ్యా!

జాన : (గడియదీస్తూ) రఘూ!

రామే : (మోకాళ్లపై అని ప్రార్థనాస్వరంలో) అతను మరణించాలని కోరుకుంటున్నాను. (అకస్మాత్తుగా శబ్దం ఆగిపోతుంది) అతను మరణించాలనీ, అతని ఆత్మ శాంతిగా వుండాలనీ కోరుకుంటున్నాను.

జాన : (తలుపుతీసి) రఘూ!

[జాబిలి వెలుగులూ, నిర్జీవమైన ప్రకృతీ మాత్రమే ఆమెకు దృగ్గోచరమౌతాయి. ఆ వృద్ధుడాలాగే ప్రార్థనలో మునిగి వుంటాడు ఆమె ద్వారబంధాన్నానుకొని స్మృతివుండే దాకా అలానే వుండిపోతుంది].

* W. W. జాకబ్స్ రచన ఆధారంగా

# కోహలుని నాట్యశాస్త్రము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

చివరి యధ్యాయమున నాట్యశాస్త్రములో :

"కోహలాదిభి రేవం తు వత్సశాండిల్య దత్తిలైః"

అని గలదు. మొదటి అధ్యాయమున:

'శాండిల్యం చైవ వాత్స్యంచ కోహలం దత్తిలం తథా'

అని గలదు. కోహల, దత్తిలులు భరతుని పుత్రులుగా చెప్పబడినారు. ఇట్లే తండు (నంది), తాండాయని, శాండిల్యుడు అనువారలు కూడ భరతపుత్రులలో లెక్కింపబడినారు. వీరందరు భరతుని సమకాలీను లని మనము భావించి తీరవలె నని భావము. తండు లేక నంది చెప్పిన నాట్యశాస్త్ర మొకటి గలదని సంప్రదాయ వచనము గలదు. ఇట్లే కోహల, దత్తిలురు కూడ నాట్యశాస్త్రములను రచించినారు. ఈ గ్రంథములలోని కొన్ని విషయములు ఈ నాట్యశాస్త్రములోనికి వచ్చినవి. ఏకాదశాంగములు నాట్యమున గలవను అరవ అధ్యాయములోని శ్లోకము స్పష్టముగా కోహల విరచితము:

"బ్రహ్మేవ కవిః, శక్ర ఇవ ప్రయోజయితా,
భరత ఇవ నాట్యానా మాచార్యః,
కోహలా దయ ఇవ నటాః
అప్సరస ఇవ సుకుమారోపకరణం,
స్వాతిరివ వాదనద్ధవిత్, నారదవ ద్గీతజ్ఞః"
(అ. భా. I. 48)

అని అభినవగుప్తు డనుటవలన కోహలుడు ఆదర్శ నటుడని, అతి ప్రాచీనుడని, భరత సమకాలీనుడని స్పష్టముగా తెలియుచున్నది. భరతు డెంత ప్రామాణికుడో, కోహలుడు కూడ నంతే యనుటచే అభినవుడీతని శ్లోకముల నతి గౌరవముతో ఉపహరించుట గలదు. ఇట్టి ఉదాహృతభాగములను కొన్నిటిని జూపిన కోహలకృతి నాట్యశాస్త్ర మెంత ప్రధానమైనదో తెలియగలదు.

నికుట్టనకరణమును వ్యాఖ్యానించుచు :

"'ఉన్నమనం వినమనం స్యాదంగస్య నికుట్టనమ్'
—ఇతి కోహలః" (అ. భా. I. 108)

అని అభినవుడు కోహలుని నికుట్టనలక్షణము నాపాదించెను.

"తోటక ప్రకరణ రాసక ప్రభృతేష్వదసంగ్రహీతం. తథాపి నాట్యరూపత్వాత్ కోహలస్తు బ్రవీతీతి చ పరిహారస్య సమానత్వాత్"
(అ. భా. I. 173)

అని యొకచో ననినాడు. తాండవ విధానావసరమున

"తదుక్తం కోహలేన—

'సంధ్యాయాం నృత్యతః శంభో ర్భక్త్యా ద్రా నారదః పురా,
గీతవాం స్త్రిపురోన్మాథం తచ్చిత్త స్త్వథ గీతకే
చకారాభినయం ప్రీత స్తత స్తండుం చ సోఽబ్రవీత్
నాట్యోక్త్యాభినయే నేదం వత్స యోజయ తాండవమ్'
ఇతి" (అ. భా. I. 182)

అని చెప్పినాడు. కావ్యలక్షణమును చెప్పువేళ :

"యథోక్తం కోహలేన—
'లయాంతర ప్రయోగేణ రాగైశ్చాపి విచిత్రితమ్
నానారసం సునిర్వాహ్యకథం కావ్యమితి
స్మృతమ్'—ఇతి" (అ. భా. I. 184)

అని కోహలుని నిర్వచనమును వచించినాడు.

"చకారేణ అంగుష్ఠమధ్యమాగ్ర నిష్పీడితాగ్రమధ్యతర్జనీలక్షణోఽపి కూర్మభాస్వరవిద్యాదాద్యభినయవిషయే నృత్తాచార్య ప్రవాహసిద్ధః కోహలలిఖితోఽపి హస్తః సంగతో భవతీతి హస్తాంతరాణ్యుత్ప్రేక్ష్యాణి" (అ. భా. II 26)

అని అభినవుడు కోహలుడు ప్రపంచించిన విశేష హస్తములను ప్రామాణికములుగనే గ్రహించినాడు.

"కోహలాది శాస్త్రలక్ష్య ప్రవాహసిద్ధ మపి చిత్రాభినయం సూచయతి" (III. 7)

అని ఇరువదిరెండవఅధ్యాయమున పల్కుచు అభినవుడు కోహలుని శాస్త్రమును ప్రామాణికముగా సంగీకరించుచు, హస్తాంతరవినియోగముల నిచ్చుచు కోహలుడు భరతునకు సహితము ప్రామాణికుడే యని చెప్పినాడు. ఈ నాట్యశాస్త్రమునకు కోహలుని గ్రంథము పూరణ గ్రంథము మాత్రమే గాక, కొంత వరకు మాతృక యని గూడ స్పష్టమగుచున్నది.

"అసంయుతాః కరా హ్యేతే" అని నాట్యశాస్త్రమున కల్పించుచుండగా, "నాస్యేతి ఏవ, కోహలాదిభి రన్యేషాం దర్శనాత్" (అ. భా. *II*. 55) అని పల్కుచు కోహలుడు చెప్పిన ఇతర సంయుత హస్తములను గూడ స్వీకరించవలె నని అభినవుడు మూలమునకు భిన్నముగా వ్యాఖ్యానించెను. పాత్ర ప్రవేశానంతరమున ప్రయోగవలనమును కోహలుడు చెప్పినాడని "వలనికేతి కోహలేన ప్రయోగవలనా వ్యపదిష్టం" (అ. భా. *II*. 130) అని అభినవు డనినాడు.

"తథా చోత్తమ పరిగ్రహే ద్విపదీ కోహలేనోక్తా-
'స్యాదుత్తమానాం ద్విపదీ చతుర్గురు సమన్వితా
తత్రోత్క్షేపనిపాతాభ్యాం యస్మాత్పాదద్వయం
భవేత్', ఇతి" (అ. భా. *II*. 133)

అని కోహలుడు ద్విపదీ నిర్వచనము గావించినాడు. ప్రచ్ఛన్నకామితమున గతిని వివరించుచు మిశ్రప్రయోగగతిని అభినవుడు నిరూపించి, కోహలుడిచట సుభద్ర యను ధ్రువాతాలమును చెప్పినాడని పలికెను. (అ. భా. *II*. 142).

"తథాచ కోహలముఖాః కలాతపర్థద్వయలక్షణేన
వర్తనకోత్ఫుల్లకాదినా రౌద్రాదౌ పరిక్రమ
మాహుః" (*II*. 144)

అని రౌద్ర పరిక్రమమున వర్తనకమును కోహలుడు విధించెనని గలదు.

"అత ఏవాత్ర విలంబిత లయేన లఘుత్రయేణ ద్రుత
లయేన గురుప్లుతమాత్రేణ చ విరామేణ జంఘటీ
కాఖ్యో లయః కోహలేన దర్శితః" (*II*. 146)

అని కరుణలో జంఘటికను కోహలుడు విధించెననినాడు. భయానకమున ధారాలయను (*II*. 148), రథగతియందు ఖండధారాలయను (*II*. 151), కాంచుకీయ గమనమున ఖంజక హేలావిలంబిత లఘుమయముగు గతిని (*II*. 155) కోహలుడు నిర్దేశించెనని గలదు. వీటినిబట్టి కోహలుడు ముఖ్యముగా నాట్యమును, నాట్యమునకు సంబంధించిన గీతాతోద్యములను వివరించెనని స్పష్టమగుచున్నది.

భరతుడు దశరూపకాధ్యాయమున ప్రధానముగా పదివిధముల రూపకములనే గ్రహించినాడు. కాని ఇతర రూపకవిశేషములకు గూడ గతి కల్పింపదలంచి

"ఉక్తవ్యాఖ్యానే తు కోహలాదిలక్షిత
తోటక సట్టక రాసకాది సంగ్రహః ఫలం"
(*II*. 407)

అని అభినవుడు కోహలుని మతమును తనకు ప్రామాణికముగా తెచ్చినాడు తోటకాద్యుపరూపకములను సహితము నిర్వచించినవాడు కోహలుడు. అంకతంత్రవిన్యాసము సాధించుటకు:

"తథాచోక్తం కోహలేన.—
'త్రిధాంకోఽంకావతారేణ మాడయాంకముఖేన వా
అర్థోపక్షేపణం మాడా బహ్వర్థైః సూతిసంధిభిః.
అంకస్యాంకాంతరే యోగస్త్వవతారః ప్రకీర్తితః
విశ్లిష్టముఖ మంకస్య స్త్రియా వా పురుషేణ వా
యదుపక్షిప్యతే పూర్వం తదంకముఖ మిష్యతే' ఇతి"
(*II*. 417)

అని కోహలుని శ్లోకములను ప్రమాణికములుగా ఉదాహరించెను. మాలిక, అంకావతారము, అంకముఖము, ప్రవేశకము, విష్కంభకము అను ఐదు తెరగులు గలవని చెప్పుచు "తథాచ కోహలోఽర్థోపక్షేప పంచక ముక్తవాన్" (*II*. 421) అని అభినవుడనినాడు.

"నను కోహలేన ముఖాంకస్య ఛాయ యంత
రాంతరే విహితః,
'మధ్యమపురుషనియోజ్యో నాటకముఖసంధిమాత్ర
సంచారః
విష్కంభకో హి కార్యో నాటకయోగే ప్రవేశకవత్'
ఇతి. తత్కథ ముక్త మంకాంతరానుసారీతి ? ఉప
లక్షణార్థ మేత దిత్యదోషః" (*II*. 434)

అని చెప్పినపుడు కోహల సిద్ధాంతమునకు భిన్నముగా చెప్పుట అభినవునకు సమ్మతము కాదని స్పష్టమగుచున్నది. కాని:

"యత్తు 'శృంగారహాస్య కరుణై రిహ కైశికీ స్యాత్'
ఇతి కోహలేనోక్తం తన్మునిమతవిరోధా దుపేక్ష్య
మేవ" (*II*. 452)

అని యనునప్పుడు కోహలుని మతమును అభినవుడు నిరాకరించుచు గ్రంథసమన్వయమును ముఖ్యముగా నెంచినాడు.

గండమను వీథ్యంగమును:

"వచసాం సంబద్ధానా మంతే యత్ప్రాప్య త్వసంబంధః
సంబద్ధ మివాభాతి హి తద్గండో నామ వీథ్యంగమ్"
(*II.* 459)

అని కోహలుడు నిర్వచించినాడు. వీథియందు నాయక విభేదమును:

"ఉత్తమాధమమధ్యాభి ర్యుక్తా ప్రకృతిభి స్తథా
ఏకహార్యద్విహార్యా వా సా వీథ్యభిసంజ్ఞితా"
(*II.* 459)

అని కోహలుడు స్పష్టీకరించెను.

ఇరువదిరెండవ అధ్యాయాంతమున అభినవుడు కోహలుని నాట్యశాస్త్రముగా భావించి:

"సామాన్యాభినయాధ్యాయా త్ప్రభృతి ఏతద ధ్యాయపర్యంతం యే కర్తవ్యతా రూపాభినయానాం విషయ ఉక్తాః సమ్యగ్విజ్ఞేయా ఇతి వదన్ కోహలాది శాస్త్ర లక్ష్య ప్రవాహసిద్ధ మపి చిత్రాభినయం సూచయతి" (*III.* 77)

అని పలికినాడు. కోహలశాస్త్రములోని విషయము గూడ ఇక్కడ అనువర్తింపజేయవలె నని భావము. ఇంతటితో నాగక:

"తత శ్చాహరణాత్ సంవర్తనామైవా, సాధూ త్సంప్రదాయవిచ్ఛేద ఇతి"

యనినాడు. సంప్రదాయ విచ్ఛేదము జరుగకుండా చేయుటకై కోహలశాస్త్రములోని లక్ష్యోదాహరణములగు 38 శ్లోకముల నిచ్చియున్నాడు. ఈశ్లోకముల వలన కోహలునిశాస్త్రము కారికారూపమున గలదని, భరతుని గ్రంథములోని విషయముల నే విస్తృతముగా, విశదముగా కోహలుడు ప్రపంచించెనని, ఇందులో కన్పించని విషయముల సహితము కోహలునిచే వివరింపబడినవని, ముఖ్యముగా నాట్యమునకు జెందిన విషయముల నే కోహలుడు స్పృశించెనని తెలియవగును.

"అన్యే పున రానంత్యం వర్ణయంతి శ్రుతీనామ్. తథా చాహ కోహలః—
'ద్వావింశతిం కేచి దుదాహరంతి శ్రుతీః శ్రుతిజ్ఞాన విచారదక్షాః
షట్షష్టిభిన్నాః ఖలు కేచి దాసా మానంత్య మేవ ప్రతి పాదయంతి' ఇతి" (పే. 357)

అని కల్లినాథుడు సంగీత రత్నాకర వ్యాఖ్యలో వచినాడు. ఇది సంగీత విషయకమైన వాక్యము. కోహలుడు నాట్యముతోబాటు సంగీతమును గూడ చేబట్టెను.

"యథాహ మతంగః 'భరత కోహలాదిభి రాచార్యై ర్దైవతలోప స్యానిష్టత్వా త్కేచి త్షడ్జగ్రామాశ్రిత ఏవాయ మితి మన్యంతే...'" (పే. 164)

అని కల్లినాథు డనుటచే మతంగునకన్న పూర్వమే కోహలుడు గలడని చెప్పవలసి వచ్చుచున్నది.

నాట్యమున వర్తనలు కొన్ని గలవు. ఈ సందర్భమున:

"గ్రంథకారేణానుక్తానా మపి తాసాం స్వరూప పరిజ్ఞానార్థం కోహలోక్తాః కాశ్చన వర్తనాః కథ్యంతే. యథా—'అథ వర్తనాః...'"

అని 39 శ్లోకములు సంగీత రత్నాకర వ్యాఖ్యలో (పే 675 - 679) కల్లినాథునిచే నుదహరింపబడినవి. ఈ కారికలలో నందికేశ్వరుని శాస్త్రమే గాక, కీర్తిధరుని గ్రంథము గూడ కోహలునిచే ప్రస్తుతింపబడుచున్నది.

ఇవిగాక చాలకము లని కొన్ని గలవు. వీటిని గురించి తెలిసికొనగోరి శార్దూలముని ప్రశ్నించగా కోహలుడు 50 చాలకములను వివరించియున్నాడని కల్లినాథు డుదహరించినాడు (పే 680). ఈ శ్లోకములవలన చాలకము లసంఖ్యాకము లని తెలియవచ్చుచున్నది. సదాశివ భరతమున సహస్రసంఖ్యాకములగు చాలకములు వివరించబడినవని ఈ శ్లోకముల వలననే గాక,

"కరరేచక రత్నాఖ్యం లక్షితం తత్పురారిణా"
(పే. 687)

అను పంక్తిద్వారా కూడ తెలియనగును. సదాశివ భరతమైన తర్వాత, ఇందలి విషయములను సంక్షేపముగా చెప్పిన నారదాదుల శాస్త్రములు బయలుదేరినవి

"పురోదంప్రభృతి తత్తు నిర్దిష్టం పూర్వసూరిభిః"
(పే. 682)

అనియు, 'ప్రాచ్యసూరిభిః', 'మనీషిభిః' ఇత్యాది పదములను ప్రస్తుతించుచు, పూర్వ శాస్త్రకారులను కోహలుడు స్మరించినాడు. కాని

"విశృంగాటక బంధాఖ్యం మతంగ స్తమువాద హ"
(పే 684):

అను పంక్తిలో మతంగుని శాస్త్రమునకు సూచన గలదు. మతంగుడే కోహలుని స్మరించె నని వెనుక చెప్పితిని.

"తిర్యగ్గత స్వస్తికాగ్రం తదుద్దిష్టం సుమంతునా"
(పే. 688)

"సుమంతునా తదుద్దిష్టం కర్తరీయుగ్మ ప్రకీర్ణకమ్"
(పే. 688)

ఈ పంక్తులలో సుమంతుని శాస్త్రమునకు సూచన తీయబడినది. ఇతడు సుమంతుడా? లేక సుబంధువా? సుబంధువు గూడ వార్తికాదులను రచించె నని కొందర నినారు.

"తత్స్వస్తిక త్రికోణాఖ్యం క్షేమరాజేన లక్షితమ్"
(పే. 688)

అను పంక్తిలో నభినవుని శిష్యుడగు క్షేమరాజు ప్రస్తుతించబడినాడు.

"నవరత్న ముఖం తిత్రి ప్రాహ లోహిత భట్టకః"
(పే. 689)

అనుచో లోహితభట్టు అను మరియొక శాస్త్రకర్త కన్పించుచున్నాడు.

చాలకముల నన్నిటిని వివరించినపిమ్మట కోహలుడు కొన్ని శ్లోకములను చెప్పి అధ్యాయవిషయము నుపసంహరించినాడు—

"ఇతీదం తపతాం శ్రేష్ఠ యదాదిష్టం స్వయంభువా
లక్షణం చాలకానాం వై ప్రత్యపాది మయాధునా
ఏతేషాం భాగ్య విజయప్రస్తావామరభూరుహాః [రాః
జీవానాం భూసురాణాం చ పార్థివానాం ప్రియంక
అనంత మంగళగ్రాహ్యలీలా విభ్రమమండనాః
నృత్తలక్ష్యవిశేషేణ ప్రాణసర్వస్వమేవ చ [కాః
యథార్హం తే ప్రయుక్తాః స్యుః కీర్తిమంగళదాయ
ఖిలానాం ప్రతికిముక్తేన సంధ్యాకాలేషు సర్వదా
నానానృత్తకలోల్లాసశాలినోఽపి మహీశితుః
అలపస్మృక సంజ్ఞాస్తే సంకీర్ణా నేహ లక్షితాః
అత్యంతవల్లభా స్త్రైవ సిద్ధానాం నాకినా మపి
అన్యోన్యయుక్తా యుక్తాశ్చ హస్తా నృత్తాశ్రయాః
ప్రసంగానుప్రసంగేన కోహలేన మయోదితాః [పకే
యథాలక్షణ మాఖ్యాతా మునిశార్దూల తత్త్వతః॥
ఇతి కోహల శార్దూలసంవాదే సంగీతమేరౌ యుక్తాయుక్తనృత్త హస్తాశ్రయ చాలకభేద ప్రభేదలక్షణం నామ ద్వితీయమాహ్నికం సమాప్తమ్" (పే. 689)

శార్దూలముని, కోహలుడు అనువారల సంవాదరూపమైన సంగీతమేరువునుండి ఈశ్లోకములు గ్రహించబడినవని కల్లినాథు డనుచున్నాడు. కాని "కోహలేన మయోదితాః" అని ఇచ్చట చెప్పుటను గమనించితిమేని ఈశ్లోకములను కోహలుడే రచించె నని చెప్పగలమా ?

మతంగుడు, కీర్తిధరుడు మొదలగువారు కోహలునకన్న నర్వాచీనులు. కోహలుడు భరతుని శిష్యులలోనివాడేగాక, భరతునివలె ప్రామాణికుడని, నటశ్రేష్ఠుడని సంప్రదాయము చెప్పుచున్నది. కాని పై కారికలలో మతంగ, కీర్తిధరాదులు స్మరించబడుట ఆశ్చర్యకరము. తర్వాతి వారి చేతులలో భరతుని గ్రంథమున కేగతిపట్టెనో, అట్టి స్థితియే కోహలుని శాస్త్రమునకు గూడ సంభవించె నని దీనివలన తెలియవచ్చుచున్నది. ఇతరుల చేతులలోబడిన కోహలుని గ్రంథములో నాయా సందర్భములలో ఇతరులు స్వేచ్ఛగా తమకు తోచిన కారికలను జొప్పించియున్నారు. ఈ కారికలను నమ్మి కోహలునకు కీర్తిధరాదులకంటె నర్వాచీను డని నిశ్చయించుట ప్రామాదికము.

కోహలుడొక నాట్యశాస్త్రకర్త. ఈతని నాట్యశాస్త్రములోని ముఖ్యవిషయమంతయు ప్రస్తుత భరతగ్రంథములోనికి వచ్చినట్లున్నది. కావుననే కోహలుని శాస్త్రము చాలవరకు విస్మృతమై, నామమాత్రావశిష్టమై మనకు నేడు కన్పించుచున్నది. రూపకమునకు చెందిన విషయముల జోలికి కోహలుడు పోయినట్లు కన్పించదు

# జ్వలితజ్వాల

'ఉషశ్రీ'

లీలావతి కూర్చున్న కుర్చీ కెదురుగా గోడమీద వ్రేలాడుతూన్న రెండు ఫొటోల్లో ఒకటి ఆమెను చూసి జాలిపడుతున్నట్లూ, రెండోది హేళన చేస్తూన్నట్టూ ఆమెకు గోచరిస్తున్నాయి.

లీలావతి చేతులు గజగజలాడుతున్నవి.

లీలావతి చేతిలోని ఉత్తరం రెపరెపలాడుతున్నది.

ఆమెశరీరం ఆపాదమస్తకం కంపించిపోతున్నది.

మనసులో ఏవో బాధలు రేగి గుండెలోని తూట్లను జెలికి కలచివారేస్తున్నవి.

చేతిలోని ఉత్తరాన్ని అతి ప్రయత్నంమీద నిలిపి పట్టుకుని చూడసాగింది.

ఆమె కన్నులు ఉత్తరంలోని అక్షరాలను గుర్తుపట్టలేకపోతున్నవి.

విచారాన్ని గొంతులోపూడ్చి, కనుగొలుకుల్లో నొక్కిపట్టి ఉత్తరంలోకి దృష్టి పోనిచ్చింది.

* * * *

నాన్నగారికి!

నమస్కారాలు — ఈ పాడులోకంనుంచి నాకు విముక్తి లభించి పైలోకాలకు పోవటానికి తగిన కృషి చేస్తూన్న ఈ సమయంలో నా అంతిమ కర్తవ్యాన్ని నిర్వర్తించటానికి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

భూగోళంలోని మానవుడు అనుభవించగలిగినన్ని భోగాలూ రుచిమాశాను; భరించలేని బాధల్ని సహించాను. నన్ను ఇంతటి నీచుణ్ణిగా తయారు చేసిన మీగుండెలో చిచ్చు రగిలించటమే నా ఆఖరు లక్ష్యం.

నాకు జ్ఞానం వచ్చిందిమొదలు మీరు నామీద ఎంతమాత్రం శ్రద్ధవహించలేదు; ఏ విధమయిన బాధ్యతా తీసికోలేదు. మీకొక కొడుకు ఉన్నట్లూ- వాడు మీరక్షణలో పెరిగి, పెద్దవాడు కావలసినట్లూ, వాడి భవిష్యత్తును దిద్ది తీర్చవలసిన భారం మీదే ననీ ఏఒక్కనాడూ మీరు భావించలేదు. మీ మనసులో —ఏక్షణంలో— అటువంటి బుద్ధిపుట్టినా నే నింతటి దౌర్భాగ్యుణ్ణయ్యేవాణ్ణి కాను.

కాను కానీ...అయినందుకు ఇప్పుడు నాకేం విచారంలేదు. ఫలానా వెంకట్రాయుడుచౌదరికొడుకు ఇంత పతిత అయాడని లోకం ఘోషిస్తుంటే మీ బి. యల్. పట్టా మీకు శాంతినివ్వగలదా; మీరావు సాహెబ్ బిరుదు మిమ్మల్ని ఓదార్చగలదా; మీస్థితిగతుల్ని చూసి చుట్టూ చేరే వాజమ్మలు ఒక్కరైనా ఈఅపవాదునుండి కాపాడగలరా? ఆలోచించండి...

అసలు నే నేం చేశానని నన్నింతటి అధోగతిపాలు చేశారు? దేశంలో పేరుప్రతిష్ఠలు సాధించుకున్న వెంకట్రాయుడు చౌదరి కొడుకు జారుడూ, చోరుడూ అయి తుదకొక హంతకుడు కూడా అయాడని లోకానికి తెలిసినప్పుడు కూడా మీరు గంభీర మానముద్రతో బ్రతికగలరా! — అసంభవం.

ఆ మరుక్షణంలో మీ గుండె కుతకుతలాడి క్రుళ్ళటం ఆరంభిస్తుంది. పటపట పళ్లుకొరుక్కొని, గుండెలో గిజగిజలాడితే ఏం ప్రయోజనం స్వామీ -

నాకు బాగా జ్ఞాపకం—

తన, మన భేదం తెలుస్తున్నది మొదలు మీరు నన్నెప్పుడూ దగ్గరకు చేరనివ్వలేదు. నా కోసం ప్రత్యేకించి రెండుగదులతో డాబా వేయించారు. అక్కడే నా అవసరాలు తీరుతూండేవి. అక్కడికే ప్రైవేటు మేష్టారు వచ్చేవారు. హైస్కూలు చదువు ప్రారంభించేవరకూ ఏ అల్లరిచేసినా అది కుర్రతనంగా పోయింది. అక్కడనుంచి మేష్టారితో నేను పేకా, కేరమ్సు పందెం వేసి ఆడుతున్నానని మీకు తెలిసినా మీరు ఏమీ ఎరగనట్టే ఊరుకున్నారు. నేను

స్కూలు ఎగేస్తున్నాననీ, చదువులో దగటవవుతున్నాననీ ఫిర్యాదులు వచ్చినా మీరు ఖాతరు చెయ్యలేదు. రెండుమూడుసార్లు అమ్మకూడా మీ అశ్రద్ధను చూసి ఏడుస్తూ నన్ను మందలించింది —"

ఇంతవరకూ బిగబట్టిన దుఃఖం చీల్చుకువచ్చింది, లీలావతికి. ఆమె కన్నులనుండి ధారాపాతంగా కన్నీరు స్రవిస్తున్నది. చెంగుతో కన్నీరు ఒత్తుకుని చదువసాగింది.

"...మీమీద ఉండే గౌరవంవల్ల కావొచ్చు, — నా సాహసకార్యాలకు భయపడి అయినా అవొచ్చు — నన్ను స్కూల్ ఫైనల్ వరకూ — పరీక్షలకు రాకపోయినా — ఫెయిల్ చేసే దమ్ములేక పోయింది, వారికి.

అదిమొదలు నాదురభ్యాసాలకు అంతులేకుండా పోయింది మాంఛి ప్రాక్టీసు ఉన్న అడ్వొకేట్ కొడుకునీ, నగరంలో సంపన్నుడయిన రాయుడు చౌదరి మనవణ్ణి అయాక నాకు విలాసాలకూ, వినోదాలకూ అడ్డేమిటి? నామీద మీరు ఏవిధమయిన చర్య తీసికోనప్పుడు...ఇంకా ఆలోచించాలా.

ఆ రోజుల్లో...

మనయింటి దాసీదాని మనవరాల్ని నేను బలవంతంగా గదిలోకి లాక్కుపోయి అనుభవించటం మీరెరుగుదురు. ఎరిగిఉండీ నన్నేమీ అనకుండా కొన్ని వందలరూపాయలతో దానినోరు కట్టేసి ఊరు నుంచి పంపేశారు. అంతతో నాజీవితం పూర్తిగా జారిపోయింది. అంతవరకూ — కాదు — ఇప్పటికీ - నాకు మీరంటే భయమే. భయంతప్ప మరోభావం మీమీద నా కెన్నడూ కలగలేదు; ఇంక కలగనక్కర్లేదు.

ఆ భయంలో కూడా మీరు నన్నేమీ చెయ్యలేరనే ధీమా కూడా ఉంది. ఆ సంఘటన తరువాయి నేను పూర్తిగా మారిపోయాను. ఒకో రోజు రాత్రి మూడుగంటలవేళ ఒళ్లు తెలీని మత్తులో కారుదిగి మేడ మెట్లు ఎక్కుతుంటెగా — నాకోసం కళ్లల్లో ఒత్తులు వేసుకు కూర్చున్న — అమ్మను కౌగిలించుకున్న మూర్ఖుణ్ణి......"

వణుకుతూన్న చేతుల్లో ఉన్న ఉత్తరాన్ని పట్టుకోలేక పోయింది, లీలావతి.

"చిట్టీ! —"

అని వెర్రికేక వేసి, కుర్చీలో వెనక్కు వ్రాలింది. వెక్కి, వెక్కి ఏడిచింది.

"ఇంతకన్న తుచ్ఛుడుంటాడా — అందుకే తగినశిక్షను అనుభవిస్తున్నాను. 'పశ్చాత్తాపంతో హృదయాన్ని క్షాళన చేసికోవటంకంటె ప్రాయశ్చిత్తం వేరేలేదు' అన్నాడు, బదరీనారాయణంలో కనిపించిన సాధువు. ఆ వాక్యంలోని బలం, దాని సత్యం ఇప్పుడు అర్థమవుతున్నవి.

నాలాగే మీరూ ఈబాధను అనుభవించి తీరాలి. మీవల్లనే నేనింతటి దౌర్భాగ్యుణ్ణి అయానని తెలుసుకుని, పశ్చాత్తాప పంచాగ్నిజ్వాలామధ్యంలో మీ హృదయం మాడుతూంటే నా బాధ కొంతయినా తగ్గుతుంది.

మీరు కూర్చునే పడకకుర్చీ కెదురుగా ఉన్న గోడమీది నటరాజరాజేశ్వరుని పాలరాతివిగ్రహం వైపు మాస్తూ, గుండెలమీద చేతులుంచుకుని చెప్పండి:

మన పక్కవీధిలో ఉన్న ప్లీడరు సుబ్బారావు మనవరాలు సుహాసిని మన ఇంటికి వచ్చినప్పుడు, నాగది గడపలోంచి కదులుతూండగా దాన్ని నేను లోపలకు లాగుతూండగా మీరు మాశారు మాసీ మాడనట్లు వెళ్లిపోయారు. పురుషస్పర్శ అంటే ఏమిటో తెలీని ఆయావనవతి నానుండి తాత్కాలికంగా ఏదో సుఖాన్ని పొందింది. పొందినా దాని జీవితం ముందు ముందు ఎలా మారుతుందో ఊహించారా? రెండేళ్లక్రితం కాబోలు అది అలహాబాదులో అవుపించింది. నేను గుర్తుపట్టలేకపోయాను; అదేపిలిచి తనభర్తకు పరిచయం చేసింది. ఆవెధవదాని మొగుడని తెలవగానే నాకు వెర్రెత్తింది. నడిరోడ్డుమీద వాణ్ణి పాడిచేసి దాన్ని తీసికెడదామనుకున్నాను. కానీ, నాలోని ఏ దౌర్బల్యమో నన్ను నొక్కేసింది; అది మళ్ళీ కనిపించకపోతుందా అనుకున్నాను. రెండు, మూడుసార్లు కలకత్తాలో వాడు తారసపడ్డాడు. కాని...అయితే ఆపెళ్లి తమ చేతిమీదుగానే జరిగించారటగా.

ప్రపంచజ్ఞానాన్ని కలిగించటానికి ఉపయోగపడని వెధవడిగ్రీలవి రెండు, మూడున్నంతలో వాడు పెళ్లికి అర్హుడా? ఓ నలభైఎకరాల ఆస్తీ, అయిదారు లక్షలు నిలవా ఉన్నంతలో వాడు సుహాసినిలాంటి

స్త్రీకి భర్త కాగలడా? జీవితం అంటే డిగ్రీలూ, ఆస్తులేనా? — చెప్పండి—అలా అనుకునే నన్ను ఇలా చేశారా; అలానే మీరు రావుసాహెబ్ బిరుదం సాధించినట్టున్నారు.

సుహాసినినీ — నన్నూ ఆ రాత్రి వదిలివస్తే పూర్తిగా విడిచేస్తే మే మిద్దరం చిలకా—గోరింకల్లా ఉండేవాళ్ళం కాదూ; అప్పుడు నాజీవితం యింత ఛండాలంగా ఉండేదా? అలా మమ్మల్నిద్దర్నీ వదిలేస్తే నేనెంత మంచివాణ్ణిగా మారేవాడినో ఊహిస్తారా?

బ్రతికుండగా దాన్ని కుంభీపాక నరకంలోకి త్రోసేశారు; నన్ను నందనవనంలోకి పంపించారు.

నిజం—

ఆరాత్రే—మీరు బజారునుంచి పదింటికి తిరిగి వస్తూనే, నా గదిలోకి వచ్చి వందరూపాయలనోట్ల కట్టలు నాముందు పెట్టి, 'తెల్లవారేసరికి ఈ రాష్ట్రపు పరిహద్దులు దాటిపో' అన్నారు.

తాగుడుకీ, ముండలకీ అలవాటుపడ్డ నాకళ్ళ ముందు పదిహేను వేల రూపాయలతో స్వేచ్ఛాలక్ష్మి వచ్చి నిలబడి వరిస్తుంటే, పద్దెనిమిదేళ్ళ యౌవన మదంలో ఉన్న నేను తిరస్కరించగలనా—తక్షణం—అమ్మతో కూడా చెప్పకుండా — రైలుకు బయల్దేరాను.

అనంతరం ...

నాలుగేళ్ళు గడిచాయి....

ఈనాడు ఈ ఉత్తరం రూపంలో నా ఆఖరు శ్వాసను అగ్నిహోత్రంలా మీమీదకు పంపుతున్నాను.

సందేహం లేదు.......

ఈరోజుకు తప్పించుకోగలిగినా వారంరోజుల్లో అయినా నేను పోలీసుల చేతుల్లో ఉంటాను; కోర్టులో నన్ను నిలబెట్టి, మీవంటి మరొకలాయరు నన్ను దోషిగా నిరూపిస్తే, ఉరిశిక్ష నాకు ప్రసాదిస్తారు. హత్యానేరం ఋజువయితే మరొకశిక్ష లభించడం సాధ్యం కాదు.

ఆశిక్షను నేను చిరునవ్వుతో స్వీకరిస్తాను. ఈ ఉత్తరం మీరు చదువుతూన్నప్పుడు నా అంతరాత్మ పొందే ఆనందం......

అమ్మా!......"

లీలావతి పాదాలమీది ఉత్తరంలోని ప్రతి వాక్యం ఆమె హృదయాన్ని ప్రేలుతూన్న అగ్ని పర్వతం మధ్యకు విసురుతున్నది; ఆమెకన్నులలో నీరు ఇంకిపోయింది.

* * * *

"అమ్మా!

ఈ ప్రపంచంలో నన్నెందుకు పారేశావు. నేను చేసిన పాపాలన్నీ ఒకయెత్తూ, నిన్ను ఏడిపించిందొక యెత్తూనూ. ఒకవేళ నిజంగా నరకమనేదే ఉంటే—అది ఉండితీరుతుంది—ఉండకపోతే నాలాటి జీవుల పాపానికి నిష్కృతి లేదు—అక్కడ నేను తలవాల్చి యమధర్మరాజుని ఇదే కోరుతాను:

"మహాప్రభూ! ధర్మమూర్తీ!

ఈ పాపి చేసిన పాపాలన్నిటికీ భూలోకంలోనే శిక్ష లభించింది. ఈలోకంలో నేను ఉండవలసినంతకాలం అమ్మను ఏడిపించిన మహాపాతకానికే శిక్షను ప్రసాదించు.

నవమాసాలూ మోసి, నానాయాతనలూ పడి కని పెంచిన కన్నతల్లి ఋణాన్ని తీర్చుకోగలవాడు లేడు. లేకపోగా, పన్నెండేళ్ళు వచ్చేవరకూ భూమిమీద కాలు మోపనివ్వకుండా, పొత్తిళ్లలో— చేతుల్లో పెంచిన ఆమాతృదేవి హృదయంలో ఆరని చిచ్చు రగుల్కొలిపిన మహాపాపిని. నేపాడింది పాటగా, ఆడింది ఆటగా సాగనిచ్చిన అమ్మగుండెలో కుండు నూగులు ప్రచ్ఛిన్నందుకు అనుభవించవలసిన శిక్షను నిర్దాక్షిణ్యంగా విధించు' ఇదే నేను వరంగా యాచిస్తాను......"

లీలావతి హృదయం ఛిన్నాభిన్నమయిపోయింది. ఆమె కన్నుల్లో దైన్యం మూర్తీభవించింది. శరీరంలోని ప్రతిఅవయవం మహాబాధతో సంకోచిస్తున్నది.

"అమ్మా!

ఈ పసివాడి అంతిమ వందనాలు అందుకో అమ్మా.

అమ్మా! ఒక్క వాగ్దానం చేస్తున్నాను. ఆయన నా కెంత అన్యాయం చేసినా నీమీద నాకుండే ప్రేమ కొద్దీ, ఏ సమయంలో అయినాసరే నేను నాతండ్రి పేరు చెప్పను. నీకోసం — అమ్మా! — నీకోసం ఆయనగౌరవాన్ని పాడుచెయ్యను......"

లీలావతి స్మృతిరహితస్థితిలోకి వచ్చింది. కాలి మీది పైఉత్తరం గాలికెగిరి పడిపోయింది. గోడ మీది ఫోటోల్లో ఒకదానిమీద సాలీడు గూడుకడుతూన్నది.

## 2

నాకు తెలుసు లీలావతీ—

నాకే కాదు—నీకూ తెలుసు లీలా—

క్షమించండి, లీలావతీదేవిగారూ; పాపం! నీకొక్కింకా కుర్రతనం పోలేదు.

వాడు ఏ దుర్ముహూర్తంలో నీ గర్భంలో పడ్డాడో నాటినుంచీ నీకు శాంతి లేదు; సుఖం లేదు.

నాకీ ఉత్తరం నన్ను మార్చి, మనిషిచేస్తుందనుకున్నాడే కాని ఆ ఉత్తరం నిన్నే మలమలలాడించి, విలవిలలాడిస్తుందనుకోలేదు. నిజం లీలావతీ! మనకు ఎదుటివాళ్ళమీద ఎంత ప్రేమా—అభిమానం ఉంటాయో వాళ్ళను అంతకంతా బాధిస్తాము — ఆ విషయం బాధించేవాళ్లకు తెలీదు—తెలీకుండానే హింసిస్తారు. అలానే నీ ముద్దులబిడ్డకు నీకు తెలీని వెన్నో విప్పిచెప్పి నీలో నిండుకుంటూ ఉన్న శాంతిని ఛిన్నాభిన్నం చేశాడు; నీగుండెలో మళ్లీ చిచ్చు ముట్టించాడు

ఏదో ఒకరోజున ఇటువంటి ఉత్తరం వస్తుందని నేననుకోలేదు కానీ ఎన్నాళ్ళకైనా సంఘటనలో నీకొడుకు చిక్కుకుని తీరతాడని నాకు తెలుసు. ఆ చిక్కులో అంతర్వ్యథనలో, మహావేదనలో పశ్చాత్తాప పడతాడనీ నాకు తెలుసు.

అటువంటిది నీకు తెలీకపోతే నువ్వు ఎంతో ప్రశాంతంగా జీవితాధ్యాయాన్ని ముగిస్తావను కున్నాను. నీ నుదుట ఆ అదృష్టంకూడా లేకుండా చేశాడు, వాడు.

లీలా! నిన్ను చూస్తే నాకు జాలీ, అసహ్యమూ కలుగుతాయి. ఒక్కగాను ఒక్క కొడుకును కని నువ్వు ఏమాత్రం సుఖాన్ని అనుభవించలేకపోయావు. నీతోపాటు నేనూ ఆవేదన అనుభవించాను.

రావుసాహెబ్ వెంకట్రామయ్యచౌదరి ఇంటికి కీర్తి—ప్రతిష్ఠల నెలా ఆర్జించాడో తెలుసా?

తెలుసు ననుకుంటావు నువ్వు.

నువ్వు కాలుపెట్టిన వేళావిశేషం మంచిదని నలుగురూ అంటూంటే ఉబ్బి, తబ్బిబ్బయిపోయే దానివి; ఒకవిధంగా అది సత్యమే కావొచ్చు.

నువ్వు వచ్చిన వేళావిశేషమో, నువ్వు పాదం ఉంచిన శుభశకునమో నా కీర్తిప్రతిష్ఠలకు కారణం అని అంటే అంగీకరించటానికి నాకు అభ్యంతరం లేదు.

నువ్వు ఈయింటికి వచ్చిన దగ్గర్నుంచీ—కాదు—నిన్ను పెళ్ళాడిన నాటినుంచీ నాకు చదవటం, తిరగటం పనయిపోయింది. నిన్ను కాపరానికి తీసి కొచ్చిన మొదటిరోజుల్లో కూడా నేను రాత్రి పది, పన్నెండూ దాటేవరకూ వచ్చేవాణ్ణే కాదు. వచ్చినా ఏదో ఎమర్జెన్సీ కేసుగురించి పుస్తకాలు తిరగేస్తున్నట్టే ఉండేవాడిని; ఏ ప్రధానవిషయం మీదనో అనుమానం వచ్చి బృహద్గ్రంథాలు పరిశీలించేవాడిని.

నిజానికి ఆరోజుల్లో నాకంతటి ప్రాక్టీసూ లేదు; పనీ లేదు. లేకపోయినా ఆ అలవాటు తప్పిందికాదు; తప్పకపోగా అనంతరం అది అనివార్యం అయింది. ఇవంతా నాకు నీతో మాట్లాట్టానికి కూడా తీరిక లేకుండా చేసింది. పైగా ఆరోజుల్లోనే నేను చదరంగం అభ్యాసం చేస్తున్నానేమో, మరీ తీరిక చిక్కేదికాదు.

నేను కోర్టునుంచి వస్తూనే సరాసరి లక్ష్మీనారాయణశాస్త్రిగారినో, నరసింహమూర్తినో తీసికొచ్చేవాడిని. నరసింహమూర్తికి చదరంగం బల్ల కనిపిస్తే 'మహారాజయోగం' పట్టబోతున్నా ఒక ఘడియ ఆగమంటాడు; శాస్త్రిగారు కూడా అంతకు తీసిపోరు.

నీకు తెలిసిన ఈ విషయాలు చెప్పి నిన్ను విసిగించను లే, ఒకందుకు నిన్నభినందించక తప్పదేమో లీలా! ఈ గడపలో అడుగుపెట్టింది మొదలు గతించిన రెండుదశలలో నువ్వు సాంసారికసుఖం అనుభవించకపోయినా అది మూడోకంటివాడికి తెలీనివ్వలేదు. నేనెంత గంభీరంగా ఉండేవాడినో నువ్వూ అంత కలకల్లాడుతూనే ఉండేదానివి.

నాహృదయంలో ఏ కోలాహలం రగులుకుని పొగలు సెగలు చిమ్ముతున్నదో నీహృదయంలోనూ అదే వ్యధ రాజుకుంటూన్నదని నాకు తెలుసు.

ఈరోజున చెప్తున్నాను లీలా! ఈరోజునా చెప్పేవాణ్ణి కాను; కానుకానీ ఇంకా ఈ విష

యాన్ని యిలాగే ఉంచి నీ అజ్ఞాత వేదనను తగ్గించక పోవటం నా కిష్టం లేదు; లేదు కనక నే వివరిస్తున్నాను—విను.

నీకొడుకు భావించినట్టు — నువ్వు పశ్చాత్తాపంతో కుమిలి, కుళ్ళి నశించాలని నేను కోరటం లేదు. నీపాపానికి ప్రాయశ్చిత్తంగా నీ హృదయంలో భోగిమంటలు రగిలించటం నా అభిమతం కాదు.

రావుసాహెబ్ వెంకట్రాయుడు చౌదరి ఇంత గౌరవనీయ జీవితాన్ని సాధించుకోవటానికి—నిజంగా — కారణం నువ్వు లీలావతీ! నిన్ను కాక నేను మరెవర్ని పెళ్ళాడినా సాంసారిక సుఖాలనుభవిస్తూ, అందరిలాగే పిల్లల్ని కని, వాళ్ళకోసం ఆస్తికూడబెట్టి, నేను చస్తే ఈ ఆస్తినంతనూ వీళ్లు ఏంతగలేస్తారో అని ఏడుస్తూ ఉండేవాడిని.

అటువంటి ప్రమాదంనుంచి నన్ను రక్షించిన నీకు జోహార్లర్పిస్తాను.

*    *    *    *

ఎరుగుదువు లీలావతీ—

నువ్వే కాదు,— నేనూ ఎరుగుదును.

ఎరుగుదును కాని నాకీ విషయం తెలిసినట్టు నీకు తెలీకపోవటంవల్లనే తృప్తిగా కాలం గడిపావు. తెలియజెప్ప లేదు కనక నే నా ఆత్మగౌరవశ్రీ చెక్కుచెదర లేదు.

ఒక్క విషయాన్ని—

విషసదృశవిషయాన్ని నా కంఠంలో కాలకూటంలా దాచుకోవటంవల్లనే ఇంత జరిగి, మన దాంపత్యం ఆదర్శంగా అందరినీ భ్రమింపజేసింది.

మరిచిపోలేను లీలా నేను—నువ్వూ మరిచిపోలేవు—ఆరోజు సాయంకాలం కాలేజీనుంచి వచ్చేసరికి మా వసారాలో ఒక సౌందర్యలహరి స్థిరసౌదామినివలె కూర్చుని ఉన్నది. ఆ లహరిని చూచి ఒక్క క్షణం నా మనసు ఊగిసలాడిపోయింది. ఆ సమయంలో ఆ సౌదామిని ప్రక్కనే కారుమేఘంవంటి పురుషుడొకడున్నట్లు నాకు తెలీదు. తెలిసిఉంటే నేనంత అచేతనంగా నిలబడి పిచ్చిగా నీవైపు చూడలేకపోయేవాణ్ణి.

అప్పుడు నిన్నూ, నీమావయ్యనూ మా నౌఖరు అప్పన్న ఎరుకపరిచాడు. ఆక్షణంలో నీ మావయ్యతోపాటు నీ సౌందర్యానికి కూడా నేను అంజలులర్పించాను. మీ రెందుకొచ్చారో నాకు తెలీకపోయినా, నేను ఏమనుకున్నానో అదే అయింది. తొలిచూపులోనే నా సర్వస్వం నీకు అంకితం అయిపోయింది. అంతవరకూ 'ఆడది' అంటే అసహ్యపడే వెంకట్రాయుడు ఆక్షణంలో తనహృదయాన్ని నీచేతుల్లో ఉంచటానికి సిద్ధపడ్డాడంటే నమ్మగలవా?

నీ మావయ్య మాంచివ్యవహర్త—ఉత్తి వ్యవహర్తపదం నా ఊహను సరిగా వ్యక్తం చెయ్యలేదు— ఎదుటివారి కన్నుల్లోంచి ఇంగితాన్ని పసిగట్టగలడు. ఆయన నన్ను సర్వతోముఖ వ్యూహంలోకి నడిపించే ప్రయత్నంలో పడ్డాడు.

నేనే కాదు లీలా—అనేకులు నీ సౌందర్య, లావణ్యాలకు సమ్మోహితులవుతారు. సువర్ణనాల్లాంటి నీ కనుపాపలు, చిరునవ్వులో సొట్టలుపడే నీబుగ్గలు శ్రీశుకుల ముకుపుటాలకయినా త్రాళ్ళు పోసేయగలవు.

*    *    *    *

నీకు జ్ఞాపకం ఉండే ఉంటుంది:

నువ్వు కాపరానికొచ్చింది ప్రారంభం ఏ ఆరు మాసాలకో, సంవత్సరానికో ఓమారు మన మేడవెనుక దొడ్లో పూలమొక్కలమధ్య సోఫాలో కూర్చుని కబురుచేసేవాణ్ణి. అలాటి సన్నివేశాలలో సోఫాకి చెరోచివరా ఇద్దరం కూర్చునేవాళ్లం. నేను మౌనంగా నీకన్నుల్లోకి పిచ్చివాడిలా చూస్తూ కాలంగడిపాను. అటువంటి సమయాల్లో నువ్వు ముంగుగా నవ్వేదానివి; సొట్టలుపడే నీబుగ్గలు నన్ను కవ్వించేవి. నీకన్నులు నా హృదయంలో పురాస్మృతులను కెలికి, గిలిగింతలు పెట్టేవి. అయినా నా గభీరప్రశాంతత చలించేదికాదు. దౌర్బల్యంతో నువ్వు నాదగ్గరగా జరిగేదానివి. రెండు, మూడుసార్లు కౌగిలించుకొనేందుకుకూడా ప్రయత్నించేదానివి...అంతే... అప్పుడు నీ అంతరాలలో నా కెన్ని శాపాలుదయించేవో తెలిసికోగలను.

నీ కన్నుల్లో అంత కైపెక్కించే అతీత శక్తి, సౌందర్యం లేకపోతే నువ్వు నా యిల్లాలివి కాలేకపోయేదానివి; గ్రహబలంవల్ల అయినా ఇంతకాలం ఈ యింట్లో ఉండనిచ్చేవాణ్ణి కాదు, లీలా...

*    *    *    *

ఆ రోజున...

మీ మావయ్య నిన్ను ఎదుట పెట్టి వ్యవహారం నడిపించాడు. నాకు నేనే సర్వాధికారిని కావటంవల్ల నా అనే ఆత్మీయులెవరూ నాకు లేకపోవటంవల్లా, నా అభిమతం నిన్ను వరించటంవల్ల నేను నీ పాణిగ్రహణం చేయటానికి సమ్మతించాను; అదే నిమిషంలో మీ మావయ్య మనిద్దరి చేతులూ కలిపేశాడు. ఆ కరస్పర్శలో ఎంత పులకించాను!

వరూధిని ఒంటరిగా రాక ఇంకొక్క చెలికత్తెను అడ్డం వేసికొని వ్యవహారం సాగిస్తే కుహనా ప్రవరుడు వచ్చేవాడు కాదు; కాని లీలా......ఆ క్షణంలో వరూధినిలాగే నువ్వు కనిపించావు నాకు.

అచిరకాలంలో...కాదు....అదే రాత్రి... ఆ రాత్రే...నాకు జన్మజన్మల స్వర్గసుఖాన్ని ప్రసాదించావు లీలా...

గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

అంతవరకూ ఏదో పిచ్చా-పాటీ చెప్పుకుపోతూన్న మీ మావయ్య అంతలో లేచి చుట్ట ముట్టించి 'దశావతారాలు చూడాలి, వస్తారా?' అన్నాడు. నాకు నవ్వు వచ్చింది; నాకసలు సినిమాలపిచ్చి లేదు. అందులోనూ సినిమా చూడాలంటే నాకు చాలా విషయాలు కుదరాలి. అందుచేత నేను రానన్నాను. నువ్వు కూడా 'రాను' అనాలని అనుకున్నాను, అనుకోవటమే కాదు—అంటావని నమ్మాను...నమ్మినట్టే నువ్వూ అనేశావు; అనేసరికి నా గుండె దడదడలాడింది; నా మనస్సు కులికింది. మీ మావయ్య ఏమంటాడో, ఏమనుకుంటాడో అని అనుమానించాను కానీ ఆయన అనకుండా, అనుకోకుండా వెళ్ళిపోయాడు.

మనిద్దరం మిగిలిపోయాం—మా నౌఖరప్పటికే వీధి గదిలో గుర్రుకొడుతున్నాడు. కొంతసేపు నిశ్శబ్దంగా గడిపాం. ప్రసంగం ఎలా ప్రారంభించాలో అర్థంకాక తికమకపడుతూన్న నన్ను మా కాలేజీ విషయాలడిగి భయంకరమైన నిశ్శబ్దాన్ని నీమృదుభాషణలతో ఛేదించావు. అలా గంట, గంటన్నర గడిపాక నువ్వు ఆవులింత లారంభించావు. చేతికందిన స్వర్గం జారిపోతూన్నదని భయపడ్డాను. కానీ—నీ ఆవులింతలు అభినయమని ఆ విధానం తెలిపింది.

కల్పించే చిరునవ్వులో తెచ్చిపెట్టుకుని ఆవులిస్తూ, చిటికెలు వేస్తూంటే అది అభినయం కాదని ఎలా అనుకోను. అయినా అప్పుడు నువ్వు అలా ప్రవర్తించటం నన్నెంతో ఆకర్షించింది. నాలో ప్రకోపిస్తూన్న ఉత్కృష్టమయిన ఆకాంక్షను లాలించి, రెచ్చగొట్టింది.

'మీరు మేడమీద గదిలో పడుకోండి' అన్నాను.

'ఫరవాలేదు. ఏమయినా చెప్పండి, మీకు కూడా నిద్రొచ్చేవరకూ ఉంటాను' అన్నావు.

అంటూనే ఆవులిస్తూ పైట జార్చేశావు. ఉబికి, ఉబికించే నీ సౌందర్య దర్శనంతో నన్ను ఉన్మత్తుణ్ణి చేయటానికి చేయగలిగినంత కృషి చేశావు.

ప్రశాంతమయిన వాతావరణం!

ఏకాంతం! మూర్తీభవించిన లావణ్యలహరి!

ఇరవై వసంతాల యౌవనంలో ఉన్న నన్ను రెచ్చగొట్టటంలో ఆశ్చర్యమేమిటి? అయినా మరికొంతసేపు ఏవో మాట్లాడుకున్నాం. మాట్లాడుతున్నంతసేపూ నా దృష్టి ఏ అజ్ఞాతమయిన అనుభూతులకో సమాపరితపిస్తూనే ఉంది; అననుభూతవాంఛ నన్ను గిలకరిస్తున్నది. నువ్వు నెమ్మదిగా లేచావు...

నీకు పడకగది చూపించేనెపంతో నేనూ లేచి అడుగులు వేశాను.

— అంతలో నా భుజంమీద నువ్వు చెయ్యి వేశావు; మెత్తని, వెచ్చని నీ శరీరస్పర్శతో నా శరీరంలో చల్లనివిద్యుత్తు ఉద్భవించి, వ్యాపించింది; ఆ తలంపే నేటికీ నన్ను కులికిస్తుంది లీలా!

మేడమీదున్న పదహారు మెట్లూ స్వర్గసోపానాల్లా ఉన్నాయి. ఎలాగో పడకగదిలో మంచందగ్గరకు తీసికొనివెళ్ళేసరికి నీకు నిద్ర క్రమ్ముకొచ్చేసింది. ఆ మైకంలో నా చేతిని వదలలేక నన్ను కూడా మంచం మీదికి లాగేశావు. సరిగ్గా మంచానికి దగ్గరే ఉన్న స్విచ్ మీదకు నీ ఎడంకాలు పాములా పాకేసింది.

గదంతా చీకటి...

ఆ చీకటిలో రోహిణీ — శుక్ర తారలులా నీ కన్నులు మెరుస్తున్నాయి; అంతలో అస్తమిస్తు

న్నాయి...ఈనా జీవన్నీ స్మృతిలో....లీలా..." అని పకాల్న నవ్వాడు. రావుసాహెబ్ వెంకట్రాయుడుచౌదరి.

అంతవరకూ — పద్దెనిమిదివసంతాల నవవధువులా భావనచేసికొంటూ, దివ్యలోకాలలో విహరిస్తూన్న లీలావతి హృదయం చివుక్కుమన్నది. ఒక్కసారిగా నందనవనంలో కల్పద్రుమానికి వ్రేలాడ తీయబడిన పూతీగల ఊయెల అమాంతం పుటుక్కున తెగిపోగా పాతాళంలోకి పోతూన్నట్టనిపించింది; రెండు చేతులూ ఆమెకు తెలీకుండా గుండెలమీంచి కన్నులపైకి నడిచినవి.

ఆపాదమస్తకం మహోద్వేగంలో గులాబిరేకులా కదలిపోతున్నది. సుడిగాలిలో తిరిగే రాలుటాకులా భ్రమిస్తున్నది మనస్సు; గిలగిలలాడుతోంది హృదయం.

"భయపడకు లీలా —

రావుసాహెబ్ వెంకట్రాయుడుచౌదరి మహామహిమాన్వితుడయిన యమధర్మరాజే; అయినా యమధర్మరాజు సామాన్యులు ఊహించేటంత భయంకరుడూ — క్రూరుడూ కాదు

ఒకానొక మానవునిశరీరంలో ప్రమాదకరమైన వ్యాధి అంకురించినప్పుడు వైద్యుడు కత్తులూ, కత్తెరలూ తీసి చికిత్స చేస్తాడు. కత్తులతో చీల్చి, సూదులతో సుకుమారచర్మాన్ని పొడిచే వైద్యుణ్ణి కర్కోటకుడంటామా?

అలానే యమధర్మరాజు కూడా చేసినపాపాలకు నిష్కృతి చేస్తాడు— అంతే!

న్యాయస్థానాన్ని అధిష్ఠించే వ్యక్తి— హత్యాభియోగం ఋజువు చేయబడినప్పుడు — దోషికి ఉరిశిక్షను ప్రసాదిస్తాడు; అంతలో ఆ జడ్జీ హంతకుడా?

అంతే లీలా — కొంచెం సంబాళించుకో. నుదురుమీదపట్టే చిరుచెమట తుడుచుకో. మన దాంపత్య జీవితాన్ని ఒక్కసారి మననంచేసికొని ఆనందిద్దాం"

అంటూ లేచి కిటికీవైపు నడిచి, జేబులోంచి చుట్టతీసి ముట్టించాడు.

లీలావతి డేగను చూసిన పావురంలా వణికిపోతూ అలానే కూర్చున్నది.

* * * *

"అతిరువాయి సలక్షణంగా మన వివాహం అయిపోయింది. నీ — నా స్నేహితు లందరూ వచ్చారు. ఝూమ్మంటూ ఊరేగింపులూ, కచేరీలూ, మేజువాణీలూ....ఎంత శోభాయమానంగా ఉంది ఆరోజు! భారతదేశంలో వైవాహికవ్యవస్థను నిర్మించిన సూత్రకారుడు ఎంతటి మహామేధావి....ఈ వ్యవస్థను ఋషులు నిర్మించారంటారు పెద్దవాళ్లు; ఋషులు గనకనే తర్జనభర్జనలు చేసి విశాలదృష్టితో ఉదాత్తంగా నిర్మించారు; కనకనే అది ఇంతకాలం సక్రమంగా నడిచింది—ఇప్పుడా చర్చ దేనికిలే......

ఆరోజు రాత్రి....

'ఏ రాత్రికోసం మనిషిలో యౌవనం అంకురిస్తున్నదాది హృదయం ఉవ్విళ్ళూరుతూ ఉరకలు వేస్తూ ఉంటుందో— ఏ రాత్రి మానవుని జీవితంలో నూతనోషస్సులను ప్రకాశింపజేస్తుందో — ఏ రాత్రి రెండు పవిత్రాత్మలకు దివ్యానుసంధానం చేస్తుందో - ఏ వేవో ఉదాత్తమనోజ్ఞస్మృతులను రేకెత్తిస్తుందో— అవాఙ్మనసగోచరానుభూతి పరంపరలను ప్రసవిస్తుందో —'... ఆరాత్రి ... లీలా .... నీ నీలికబరి బంధంలో మల్లెలు ముడిచారు. అనంతాకాశంలోని నీలికాంతులమధ్య తారకా సముదయంలా నీ జడలో మల్లెలు మెరుస్తున్నవి. నువ్వు ఓ సౌర్యరంగా, బహుచమత్కారంగా నిలబడ్డావు. పాముకుబుసంలాంటి చీరలోంచి నీ అవయవసర్వస్వం నన్ను ఆకర్షిస్తున్నది.

లేతగులాబిలాంటి బుగ్గలు...

ఆ బుగ్గలలో...

అరుణాధరాలు....

వద్దు లీలావతీ— నువ్వు ఆరాత్రి...అల్లసాని ఊహాలోని వరూధినివి!

ఒకటి, రెండు క్షణాలకన్నా నిన్ను విలపనీయలేకపోయాను. అమాంతం నా రెండుచేతులతో నిన్ను దగ్గరగా తీసికొని నిలువుటద్దంముందు నిలబెట్టి, చిలిపిగా చూపుడువ్రేలుతో నీ ముక్కు చివర ముట్టించాను. అద్దంలో నీ ప్రతిరూపం కన్నులు మిలమిల

లాడించింది. నీ వదనంలో ప్రసుప్తానందం అనిర్వచనీయంగా లాస్యం చేసింది.

నీ బుగ్గ నా పెదవులపై ఉంచుతూ, నీ కుడి చేతితో నాతల త్రిప్పుకున్నావు.

ఆ రాత్రి—
మల్లెల పరిమళాల్లో...
తొణుకుతూన్న లావణ్యలహరుల్లో...
పట్టిన చిరుచెమటల్లో...

మనం అనుభవించిన అమరసుఖాన్ని స్మృతి సీమకు రప్పించినా నాలో పులకలెత్తుతున్నది—లీలా."

[అంటూనే ఆమెను తన వక్షానికి అదుముకున్నాడు. మొదటిరాత్రి అనుభవాలను నెమరువేసికొనే లీలావతి పొంగిపోయింది; అతని విశాలమయిన వక్షస్థలంపై ఆన్చిన తల పైకెత్తి, ఆ మైకంలో అతని పెదవులకు బుగ్గ ఎత్తింది. వెంట్రుకలు చొరని మునివ్రేళ్లు మాత్రమే ఆమె బుగ్గపై గిలిగింతలు పెట్టినవి; ఆ గిలిగింతలోనే చావరి ఆమె తలను ప్రక్కకు తప్పించింది.]

"ఆ మరునాటిరోజు కూడా నిన్ను అలంకరించి పంపారు. నేను మధురస్వప్న సోపానాలపై నీకోసం నిరీక్షిస్తున్నాను. వసంత వనలతలా నువ్వు లోపల అడుగు పెట్టావు. ఆనాడు కూడా నీ ముఖంలో నును సిగ్గు దొంతరలు నాట్యమాడుతూనే ఉన్నాయి. నేను ప్రేస్తాపుతూ నిన్ను పిలిచాను. నువ్వు చూపులతో కవ్విస్తూ నిలబడిపోయావే కాని కదలిరాలేదు.

నేనే నీదగ్గరకు వచ్చి ఆలీఢపాదుణ్ణి అయి దోయిలించి నీ కన్నులలోకి చూస్తూ ఉండిపోయాను. నువ్వు ఎంతో సేపు నిలబడలేకపోయావు. అరచేతిలో నుదురు బిగించుకుని వెళ్ళి పందిరిమంచాన్ని ఆనుకున్నావు. ఏదో చెప్పలేని బాధ నువ్వు అనుభవిస్తున్నట్లు నాకు అనిపించినా నీ జగన్మోహన సౌందర్యానుశీలనలో నేనది గ్రహించలేకపోయాను. అదొక ప్రణయభంగిమ అనుకుని నిన్ను దగ్గరగా తీసికొని ముద్దాడాను. నువ్వు వణికిపోయావు...సిగ్గు...అనుకున్నాను. అంతలోనే నీ కన్నుల నీరు తిరిగింది. పరిశీలించాను...

'ఏ కారం—తలనొప్పి'

అన్నావు నువ్వు—హడిలిపోయాను నేను.

'ఫరవాలేదు....భయపడకండి'

అంటూనే నువ్వు అవతలివైపు తలుపు తీసుకుని వెళ్ళావు.

అనుసరించాను.

అక్కడ నీకు వాంతి అయింది. వణుకుతూ గదిలోకి వచ్చి డ్రాయరుపక్క కూజాలో నీళ్లు గ్లాసుతో తెచ్చియిచ్చాను. నువ్వు శుభ్రంగా పుక్కిలించి లోపలకు వస్తూ—నన్ను ఆసరా చేసుకుని—మంచం ఎక్కావు. మూలుగుతూ పడుకున్నావు.

నాకు చాలా భయం కలిగింది.

తలుపుతీసి యింట్లో చెబుదామని వెళుతుండగా నువ్వు నెమ్మదిగా చప్పట్లుకొట్టి పిలిచావు. నేను వెనుదిరిగేసరికి ముక్కుమీద వేలేసుకుని, బాధతో నవ్వుతూ, చెయ్యి చాపి వెనక్కు రమ్మన్నావు. నేను తలుపులు వేసేసి నీదగ్గరగా వచ్చాను.

అప్పట్లో నాకంతగా తెలీనివిషయాలవి. అదేదో అధికమయిన అనురాగంవల్ల అంకురించే వ్యాధి అనుకున్నాను...

ఆ రాత్రి కొద్దిక్షణాలబాధతోనే నువ్వు హాయిగా నిద్రపోయావు. నాకు ఆరాత్రి ప్రాణాలన్నీ నీమీదే ఉన్నాయి. కన్నుమీద రెప్పవాలలేదు.

ఆ మరునాడూ నీ ఆరోగ్యం అలానే ఉండిపోయింది. నా హృదయం నీకోసం ఎంత తపించి ఉంటుందో ఊహించగలవా? లీలా...

నాలుగోరోజున నువ్వు ఇంట్లోకి రాకూడదన్నారు. నీమీద అపారమయిన అనురాగంతో ఉన్న నేను ఎంతో బాధతో కాలేజీకి వెళ్ళిపోయాను.

ఆ తరువాయి మనం ఉత్తరాలద్వారా కలుసుకున్నామే కాని అంతకుమించినదేమీ జరగలేదు. చదువులో పట్టుదల వహించటంతో నేను దృష్టిని మరల్చుకోక తప్పిందికాదు. పరీక్షలవుతుండగానే వస్తానని ఎంతో ప్రయత్నించాను; కాని అదేరోజు రాత్రి బండిలో మా కాలేజీకుర్రాళ్లు కాశ్మీర్ యాత్ర పెట్టారు. ఆ తిరగటం తిరగటం రెండునెలలుపట్టింది.

కాశ్మీరుదేశపు నిసర్గసౌందర్యం నా హృదయంలో ఆనందంతోపాటు విరహాన్ని కూడా రేపింది;

అందమయిన ప్రతిపుష్పంలోంచీ నీ కన్నులు నన్ను ఆహ్వానిస్తూనే ఉన్నాయి. అందుచేతనే కాశ్మీరు నుంచి వస్తూనే—ఎవరెంత పట్టుపట్టినా వినకుండా—నీకోసం మీ ఊళ్లో దిగాను. నువ్వు అంతక్రితం రోజునే మీ మేనమామకూతురు పెళ్లికి వెళ్లావన్నారు; నేను గడపలో కాలు పెడుతుండగా వసారాలోంచి ప్రక్క గదిలోకి వెళ్ళటం చూశాను, చూసినా మీ చెల్లెలేమో అనుకున్నాను. ఆపూటకు మీ అమ్మమ్మగారి బలవంతంమీద ఆగిపోయాను; ఆవిడ ఎంతో ఆప్యాయాన్నీ, ఆదరాన్నీ కనబరుస్తూ 'రాగానే కార్డు వ్రాయిస్తా — వచ్చి తీసికెళ్లి నాయనా' అన్నారు. ఆవిడ ఎంతమంచిది. ఆ కాలపు మనుషులకు హృదయాలుంటాయి, కనుకనే మనం ఈపాటి సుఖంగానయినా బ్రతికున్నాం. ఆ సాయంకాలం మీ చెల్లి అంది:

"అక్కయ్యను చదువుకోవద్దన్నారటగా మీరూ?"

తెల్లబోయాను; దానికి మాత్రం చిరునవ్వే జవాబుగా యిచ్చాను. కాని లీలా! నువ్వు చెప్పూ—నిన్ను బి. ఏ. పూర్తి చేయమన్నానే కాని జూనియర్ చదువుతూ మానమన్నానా?...

* * * *

ఇరవైరోజులు...

మానవుని జీవితప్రమాణంలో ఇరవైరోజులు లెక్కలోకి రావు. జీవితసర్వస్వంగా భావించుకొన్న అర్ధాంగి ఆలింగనభాగ్యాన్ని కోరుతూ దీక్షతో తపస్సు చేసేవాడికి ఇరవైరోజులంటే ఇరవైకోట్ల సంవత్సరాలు కాదూ?

పోస్టుమాన్ వస్తాంటే పొంగిపోయేగుండె—అతను నా మేడదాటిపోతూన్నప్పుడు విరిగిపడిపోయేదంటే నమ్మగలవా? అలా రోజూ ఆశ—నిరాశ!

ఆఖరికి ఓరోజున గుమ్మంముందు నిలబడ్డాడు. ఎగిరి గంతేసి వెళ్ళి అందుకుని చూశాను—చూశానంతే! పూర్తిగా నీరసపడిపోయాను. ఆ ఉత్తరం నా స్నేహితుడు వ్రాశాడు. వాడు విశాఖపట్నం ఆసుపత్రిలో సర్జన్‌గా పనిచేస్తూ, కాపురం ప్రారంభించాడు. క్రొత్తదంపతుల్ని వచ్చి చూసిపొమ్మని వ్రాశాడు; ఆదేజాబులో వాడి భార్య నిన్నుకూడా తీసుకురమ్మని మూడుసార్లు హెచ్చరించింది.

ఆ కార్డుతో నిన్ను కలుసుకునేందుకు బయలుదేరాను. తెలతెల్లవారుతూండగా మీ గడపలో కాలు పెట్టాను. తొమ్మిదిగంటలబండిలో నిన్ను తీసుకు బయల్దేరాలని ఊహ.

కానీ —

ఆరోజునా నువ్వు అక్కడ లేవు. మీ అమ్మమ్మగారే నాకు మామూలు ఆదరాన్ని ప్రసాదించి 'పెద్ద మేనత్తగారు గృహప్రవేశం చేసుకుంటూ స్వయంగా వచ్చి తీసికెళ్ళారు నాయనా' అంది.

నేను సగంచచ్చి విశాఖపట్నం బయలుదేరాను.

రైలు దిగుతూండగానే వాళ్ళిద్దరూ కిలకిల నవ్వుతూవచ్చి నన్నెంతో యిదిగా చూస్తూ, నీకోసం కాస్సేపు ఆగారు. తెలిసీ నేను నవ్వి ఊరుకున్నాను. నీగురించి ప్రశ్నించటానికి వాడు సిగ్గుపడి ఉంటాడు. ఆవిడ మాత్రం దారిలో రెండు, మూడు సార్లు ప్రశ్నించినా నేను ప్రసంగధోరణిలో ఆవిడను వినిపించుకోనట్లే సాగాను.

ఇంటికి చేరేసరికి వాడికి హాస్పిటల్‌నుంచి అర్జెంటుగా కబురు వచ్చింది; వాడు ఆమెను లోపలకు పిలిచి అన్నీ పురమాయించి వెళ్ళిపోయాడు.

స్నానంచేసి నేను బట్టలు కట్టుకుంటుండగా ఆవిడ వడ్డన పూర్తిచేసి పిలిచింది. భోజనం చేస్తుండగా:

"ఆయన్ను అసలు కదలనిచ్చేదాన్ని కాదు; కేసు ప్రసవానికి సంబంధించింది; పాపం ఆ అమ్మాయి కయినా అంత పెద్ద వయసులేదు. అయినా అదృష్టవంతురాలు! పద్దెనిమిదో ఏడు నిండకుండా పురిటికొచ్చింది; కూడా ఆ అమ్మాయి చెల్లెలే వచ్చింది. నేను రెండుమూడుసార్లు వెళ్ళి పలకరించి 'మరేం భయంలేదమ్మా, ఆయనతో నే చెప్తా' అని ధైర్యం చెప్పివచ్చాను. తొలికానుపేమో కాస్త బెదురు..."

అంటూ ఆవిడ కులాసాగా మాట్లాడేస్తూ, రెండుమూడుసార్లు నిన్ను తీసుకురానందుకు నామీద కొంచెం కోపంకూడా వ్యక్తంచేసింది. నేనుమాత్రం పెదవి కదపలేదు. భోజనం ముగించి, వాకిట్లోకి వచ్చేసరికి తాంబూలం సిద్ధంగా ఉంది. చాలా ప్రయాణం చేసివచ్చారు. ఆ గదిలో విశ్రాంతి తీసికోండి.'

అని ఆవిడ వంటింట్లోకి నడిచింది.

నేను నిద్రలేచేసరికి వాడూ వచ్చాడు; వాడు లోపలకొస్తుండగానే

'తల్లీ—పిల్లా కులాసా?'

అని ఎంతో ఆతురతతో అడిగింది.

ఆ అమ్మాయికి ఎంత మమకారమో పిల్లనుకన్న తల్లి అంటే.

'ఫరవా లేదు, భగవంతుడున్నాడు. మొదటి కానుపు కదూ!

చాలా శ్రమపడ్డది. కొత్తగా వచ్చిన లేడీ డాక్టరు సౌభాగ్యలక్ష్మి చాలా శ్రద్ధతీసుకుంది—అసలు తల్లికే ప్రమాదం వస్తుందేమో నని భయపడ్డాం; కానీ ఇద్దరూ దక్కారు. మగబిడ్డ పుట్టాడు."

అన్నాక, వాడి కోటు విప్పింది—అప్పుడు వాడు భోజనం చేశాడు. భోజనం అయాక:

'ఏరా, కనీసం మా చెల్లితో పెళ్ళినాడు తీయించుకున్న ఫొటో లేదుట్రా?'
అన్నాడు.

నేను నవ్వుతూ అందిచ్చాను.

తమలపాకులకు సున్నం రాస్తూన్న ఆమె ఒక్కసారి ఫొటోలోకి చూసి, నన్నుచూసి ఫొటోను పరిశీలిస్తూ:

'ఎంత మోసం చేశారు, అన్నయ్యగారూ'
అంది.

నేను తెల్లబోయి వెర్రిచూపులు చూశాను.

'ఇంక దాచలేరు. కాస్సేపు ఆయన విశ్రాంతి తీసుకున్నాక మనం హాస్పిటల్‌కి వెళదాం'
అంది.

నాకేమీ అర్థం కాలేదు.

'నువ్వు అదృష్టవంతుడివిరా, వెంకట్రాయుడూ అంత అందమయిన అమ్మాయి—అంత తెలివయినది... నీ అదృష్టం వేరె చెప్పాలా? నువ్వు చాలా అన్యాయం చేశావురా, కనీసం ఆవిడను పురిటికి పంపుతూన్నట్టయినా నాకు ఉత్తరం వ్రాయాల్సింది. అయితేనేం, ఇప్పుడు వెళ్ళి చూద్దాం'
అన్నాడు.

అప్పటి కర్థమయింది—ఆ ఫొటోలో ఉన్న అమ్మాయీ, ఆ రోజున పురుడుపోసుకున్న అమ్మాయీ నువ్వేనని..."

[అని ఆగి చుట్ట విసిరేసి కిటికీలోంచి రోడ్డువైపు శూన్యంలోకి చూడసాగాడు. లీలావతి గుండెలో చలనశక్తి క్షీణిస్తున్నది. ఆమె శరీరంలోని ఏ అవయవమూ చైతన్యంతో లేదు. ఆమె కన్నులు యాంత్రికంగా నడుస్తున్నవి. ఆమెకు ఏడవటానికయినా శక్తి లేదు. ఆమె కనులయెదుట విశాఖపట్నం ఆసుపత్రిలో ఉయ్యాలలో ఊగుతూన్న పసికందు కనిపిస్తున్నాడు.]

"అప్పుడు వాడితో నే నన్నాను:

డాక్టర్ భాయీ! నువ్వింకా అనుభవం సంపాదించాలిరా. భర్తమీద అమితమయిన అనురాగమున్న భార్యకు ప్రసవవేళ అందులో ప్రథమ సంతానం—ఎంత ఆనందం కలుగుతుంది. స్త్రీకి మాతృత్వం ప్రసాదించే గర్వ, గౌరవాలను ఇంగ్లీషు చదువుకున్న వాళ్లం అర్థం చేసికోలేము రా.

ఆ సంతోషానికి తోడు నేను కూడా ఎదురుగా ఉంటే ఆమె తట్టుకోలేక స్మృతి విహీనురాలు కావొచ్చు—మరేమయినా కావొచ్చు. అసలు నేను వచ్చినట్టు కూడా ఆమెకు తెలీనివ్వకు. నేను రానని చెప్పాను. కాని రాకుండా ఉండలేకపోయాను. కారణం నీకు తెలుసు—నీ ఉత్తరం కూడా నా రాకకు కొంత ప్రోత్సాహం యిచ్చింది. నేను వచ్చి ఆమెకు కనిపించకుండా వెళ్ళిపోయానంటే కూడా ఆమె మనస్సు పరిపరివిధాల పోతుంది. భోజనం మానేసి వెళ్ళి వాళ్ళను కాపాడావు. అదే పదివేలు'_ అన్నాను. వాడు నా వాదానికి లొంగి 'సరే' అని ఆనాటి స్వల్పవిషయం తెలీనందుకు సిగ్గుపడ్డాడు.

* * * *

ఈ లోకంలో ఇటువంటి సంఘటనలు అనేకాలు జరుగుతాయి. ఇంతకన్న విపరీతమయినవీ, హృదయవిదారకమయినవీ జరుగుతాయి, ఇదివరలో జరిగాయి సత్యవతిని శంతనుడు ప్రేమించాడు. సత్యవతి శంతనుణ్ణి వలచింది. దాశరాజు షరతు లుంచాడు—కూతురు భవిష్యత్తుకోసం. అంతే గాదు-ఆమెకే వ్యాసభగవానుడు పుట్టాడనీ తెలుసు. కాని శంతనుడికి ఈ సంగతి తెలియకనే పెళ్లాడాడా? తెలీకనే కావొచ్చు.

ఇలాటివన్నీ కథలంటాం మనం; నీ జీవితగాథ విన్నవాళ్లు నమ్మగలుగుతారు. చిత్రమయినది లోకం లీలా—

ఆ సాయంత్రమే బయల్దేరి నేను నేరుగా యింటికి వచ్చి అన్నీ సర్దుకుని మరునాడుదయం మేల్‌లో మద్రాసు చేరుకున్నాను. అక్కడనుంచి మీ యింటికి ఉత్తరం వ్రాశాను.

'నాకు రెండు సంవత్సరాల వరకూ ఇక్కడనుంచి కదలటానికి వీలుండదనీ. ఈ రెండేళ్లూ నాతో పాటు నువ్వు కూడా విరహాయాతన అనుభవించాలనీ, అప్పటికి నేను లాయరు నౌతాననీ, అవగానే నీతో సంసారజీవితం ఆరంభిస్తాననీ' వ్రాశాను.

ఆ ఉత్తరానికి జవాబుగానే 'అమ్మాయికి ఆరో నెల అనీ, మూడు, నాలుగు మాసాలలో నేను తండ్రిని కాబోతున్నాననీ' వ్రాశారు. అప్పట్లో నువ్వు వారానికో కవరు వ్రాసేదానివి.

నువ్వు వ్రాసే ప్రతికవరూ నాలో ఎంతో ఆనందాన్ని కలిగించేది. ఉత్తరాలు వ్రాయటంకూడా కళగానే భావించే నాకు తగిన భార్య దొరికిందని సంతోషించాను.

నిజంగా కష్టమే కాదు లీలా?

నీగుండెల మీద చిట్టిగాడు పడుకుని నీ సొట్టలు పడే బుగ్గలతో గిలిగింతలు పెడ్తున్న రోజులలో ఆరు మాసాల గర్భవతి నవ స్త్రీత్వంతో, కాబోయే తల్లి ఊహలతో....ఎంతకష్టం...లేఖలు వ్రాయటం! కానీ ఒక్కసారి దొరికిపోయావ్. నాకు తెలుసు — ఎప్పుడో అటువంటిసన్నివేశం సంభవిస్తుందని.

అప్పుడు నీ చిట్టికి విషజ్వరం తగిలింది. వాడు బ్రతికి బయట పడతాడనే ఆశలేదు — కానీ వాడు కోలుకున్నాడు. ఆ జ్వరం రోజుల్లో నువ్వు వ్రాసిన ఉత్తరం చదువుతా:

డియర్!

ఈరోజున కూర్చుని ఆలోచిస్తూంటే చిట్టిగాడు నా వడిలోంచి ఎగిరి మీ దగ్గరకు రాబోయి క్రింద పడ్డాడు.

వాడికి వారంరోజులనుంచీ జ్వరం కాస్తూనే ఉంది. మూసినకన్ను తెరవటంలేదు. ఒళ్లు సలసల కాగిపోతోంది. వాడు దక్కుతాడనే ఆశలేదు. ఒక్కసారి వచ్చిచూసి వెళ్ళండి.

నిజంగా ఆ ఉత్తరం అందుకోగానే బయల్దేరి వస్తే ఎంత ప్రమాదించేది. ఆ ప్రమాదా లేమీ రాకుండా ఉండటానికే నేను రెండేళ్ళవరకూ రావటానికి వీలు లేదని వ్రాసేశాను. సరిగ్గా మన వివాహం జరిగిన ఎనిమిది నెలల ఇరవై నాలుగురోజులకి నువ్వు ప్రసవించినట్టు మీ మావయ్య వ్రాస్తూ, ఇదేం విపరీతం కాదనీ, మనం ముందు కలుసుకున్న రోజునుంచీ లెక్కించాలనీ మూదవగా వ్రాశారు.

సుఖంగానే ప్రసవించావనీ, మొదటి కాన్పు మగబిడ్డ నయినా ఏమీ శ్రమలేదనీ వ్రాశారు. నేను బ్రహ్మానందం చెందినట్టు ఉత్తరం వ్రాశా. ఓసారి వచ్చి చూసి వెళ్ళమని వ్రాశారు. ఒక వేళ నేను వస్తానని అనుమానం కలిగితే ఏదో నక్షత్రంచూసి శాంతి తతంగం చేద్దురు. అయినా నాకు రావటానికి తీరిక లేదుగా.

* * * *

నేను చిట్టిగాడికి రకరకాల వస్తువులూ, బట్టలు బహుమతులుగా పంపుతూనే ఉన్నాను. నువ్వు చిన్నచిన్న కథలుగా ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నావు. ప్రతి ఉత్తరంలోనూ ఒక్కసారి — ఒక్కసారే—వచ్చి చూసి పొమ్మని వ్రాసేదానివి. నా ఉత్తరాలు నిన్ను లాలించి, జోల పాడుతూనే ఉండేవి.

బార్ లెక్చర్లూ, ఎప్రెంటిస్ షిప్పూ అయాక ప్రాక్టీసు ప్రారంభించటానికి సన్నాహాలు పూర్తి చేసికొనివచ్చి నిన్నూ, నీ చిట్టినీ ఈ యింటికి తెచ్చాను.

ఇంట్లోకి రాగానే మా వంశాన్ని గురించీ, వంశ మర్యాదని గురించీ వివరిస్తూ మేడ పైభాగం అంతా నీ స్వాధీనంలో ఉంటుందనీ, నాకు తెలియజెయ్యకుండా నువ్వు మేడ దిగరాదనీ శాసనంగా చెప్పి నా ఆ అభిప్రాయం నీకు అందనివ్వ లేదు.

జీవితంలో ప్రప్రథమంగా నువ్వు నాకు సుఖాన్ని చవిచూపినందుకే నీకు కారాగారంగా ఏర్పాటు చేశాను.

లీలా! నిన్ను చూసినప్పుడల్లా నా హృదయం ఎంత పొంగిపోతుందో అంతా వ్యాకులపడుతుంది. నీకు నేను అన్యాయం చేస్తున్నానేమో అనిపించింది. అప్పుడుమాత్రం బాధపడ్డాను. పడ్డానుకాని ఆలోచించిచూస్తే నువ్వు నాకు చేసినదానికంటె నేను

నీకు ఎక్కువేం చేయగలిగానో చెప్పు. నేను చేసింది నీవుచేసిన దానితో సమంగా అయినా తూగుతుందా అని.

అయితే ఇంతకూ కారణం నీ సౌందర్యం.

సామ్రాజ్యాలను నాశనం చేసినదీ — సర్వతోముఖప్రతిభాసంపత్సమున్మేషాన్ని సర్వనాశనం చేసినదీ — ఏకప్రాణులుగా సంచరించేవారిమధ్య బద్ధవైరాలను రేకెత్తించి తలలు తీయించేసినదీ...ఇంకా ఇంకా ఎన్ని ఘోరాలకో కారణం సౌందర్యం— లీలా—నీ సౌందర్యం అంతటి ఘోరాలు చెయ్యలేకపోయినా అంతకన్న అమానుషమే చేసింది.

అది నిన్ను నాశనం చేసింది — నన్ను పీల్చేసింది.

నీ కొడుకుని పరమభ్రష్టుణ్ణిగా చేసింది.

అప్పుడే వికసించిన గులాబిపువ్వు పూలతోటకు శోభ తెస్తుంది. తోటంతా ఆ ఒక్క పువ్వుతో కలకలలాడుతూన్నట్లుంటుంది - అనే గులాబీ అక్కా-చెల్లెళ్లిద్దరికీ కావలసివచ్చినపుడు కొద్దిగా పేచీ లేస్తుంది; అది క్షణికమే అయినా, రేగి తీరకుందంటావా? ప్రాకృతిక సౌందర్యంలోనే ఉంది విషం లీలా!

నిగనిగలాడే గోధుమ వన్నెత్రాచు కోరలో ఎంత విషం! పడగవిప్పి ఆడుతూన్నప్పుడు దాని రాజసౌందర్యానికి ముగ్ధులమయిపోతాం. అది ఒకే ఒక్క కాటు వేస్తుంది. క్షణంలో కైవల్యప్రాప్తి. పాము విషం కనక సద్యోముక్తి లభిస్తుంది.

కానీ...మానవసౌందర్య విషం! నెమ్మది నెమ్మదిగా పనిచేసి కుళ్లబెడుతుంది. పాములోని విషం పాముని ఏమీ చెయ్యలేదు. సౌందర్యవిషం సౌందర్యవతినే కబళిస్తుంది.

లీలా,

ఆ రోజు నీకూ జ్ఞాపకం ఉండేఉంటుంది. ఉండకపోవటానికి సావకాశం లేదు. జీవితంలో మధుర స్మృతులను మరువలేనట్లే విషాద సన్నివేశాలనూ విస్మృతిపాలు చెయ్యలేం.

* * * *

సరిగ్గా మన గోడగడియారం తొమ్మిది గంటల నలభై నిమిషాలను చూపుతూండగా నువ్వు మొదటిసారి మేడ దిగావు. రాత్రివేళ తొమ్మిది గంటలు దాటాక నువ్వు మేడదిగటం అనేది కాపురానికొచ్చిన ఆ నాలుగేళ్లలో జరగలేదనుకుంటాను.

ఆ మేడమెట్లు ఒక్కొక్కటే దిగుతూన్నప్పుడు నీ కన్నుల్లో ఎంతటి ఆశా—ఆనందం ఉంటాయో, నీ హృదయం ఎలా ప్రఫుల్లమవుతూ ఉంటుందో, నీ మనస్సు ఎటువంటి అనుభూతులకు స్వాగతగీతాలు ఆలపిస్తూ ఉంటుందో, నీ శరీరంలోని ప్రతి అవయవం ఏవిధంగా పులకిస్తూంటుందో ఊహించగలను లీలా! అనుభవించలేకపోయినా భావించగలను కాదూ?

ఆనాటివరకూ ఎన్నడూ రాత్రిభోజనాల అనంతరం నేను నీతో మాట్లాడేవాణ్ణే కాదు. నాకు పనిలేని రోజే లేనప్పుడు నీతో మాట్లాడుతూ కూర్చునే సావకాశం ఎక్కడుంటుంది చెప్పూ? నిరంతరం నాతో నా స్నేహితులెవరో ఒకరు ఉంటూనే ఉంటారుకదా—అలాంటప్పుడింక తీరిక కూడానా.

ఒకవేళ భోజనానంతరం కాస్సేపు కూర్చున్నా నువ్వు నీ చిట్టిని తీసికొని వచ్చి:

'చూశారండీ, మన చిట్టి మీకోసం ఎలా ఆశగా చూస్తూ నవ్వుతున్నాడో, వాడికి నాన్న అనే పేరు కూడా వచ్చేసింది.'

అనేదానివి. నేను అలానే కూర్చుని నవ్వుతూ:

'ఔను, ప్రతివాడికీ కన్నతండ్రిమీద మమకారం ఉండాల్సిందే. వాడికిమాత్రం ఆ అదృష్టం చిక్కేటట్టు లేదు, పాపం' అనేవాణ్ణి.

'నిన్న మధ్యాహ్నం అడ్వొకేటు సుబ్బారావుగారింటికి వెళ్ళాను. వాళ్ల మూడో మనవరాలు పుట్టినరోజు. అక్కడ అందరూ మన చిట్టిని ఎత్తుకు ముద్దాడినవారే. వాళ్ల రెండో మనవరాలు చిట్టిని తీసికెళ్ళి వాళ్ళ యింట్లో బొమ్మలన్నీ చూపించింది; అక్కడే ఉంచేసుకుంటామంది, వాళ్ల రెండో అమ్మాయి లలిత.

అని నువ్వు చెప్తూన్నప్పుడల్లా:

'తప్పు తప్పు లీలా—కష్టపడి నవమాసాలూ మోసి కని, నానా యాతనలూ పడి వాణ్ణి పెంచినదానివి నువ్వు. ఆ ఆనందాన్ని నువ్వే అనుభవించాలి; అందులో నేను భాగస్వామిని కావటం అన్యాయం కాదూ?

వాడు నీ కొడుకు. నీ చిట్టి. ఏ శ్రమా లేకుండా వచ్చే ఆనందాన్ని, ఫలాన్ని నేను భరించలేను లీలా, అందులో ఏమాత్రం నాకు హక్కు లేదు

అనేవాణ్ణి గుర్తుందా!

అటువంటప్పుడు నువ్వు ఎంతో గర్వంతో పొంగిపోయేదానివి. అదంతా నీకు నేనిచ్చే 'కితాబ్' గానే భావించేదానివి. నిజంకూడా అంతే. అలానే వాడికి చదువు చెప్పుకుంటూ భోజనాలవేళ నా ముందు వాడి విద్యాప్రదర్శనం చేయిస్తూ ఆనందించేదానివి.

నీ కళ్ళముందు వాడి భవిష్యత్తు జిల్లా జడ్జీ— అంతే కాదూ. అలానే ఆనందించేదానివి. నీ ఆనందాన్ని చూసి నేనూ సంతోషపడేవాణ్ణి. ఈ ప్రపంచంలో ఎదుటివారి ఆనందాన్ని చూసి ఏడిచేవాళ్లనూ, వారి ఆనందానికి భంగం కలిగించేవాళ్ళనూ నేను క్షమించలేను; వాళ్ళంటే నాకు పరమ అసహ్యం. గొంగళిపురుగుల్లా చూస్తాను వాళ్లని. అలానే నా ఆనందాన్ని చూసి ఓర్వలేనివాళ్లనూ, సంతోష నౌకా విహార వేళ తుపానులు లేపేవాళ్ళనూ నేను క్షమించి వదలలేను. దానికి కారణం ఉంటుందని నీకు తెలుసు కాదూ?

ఆరాత్రి నువ్వు మేడమీంచి దిగుతున్నావు. నీకు జ్ఞాపకం ఉండేఉంటుంది. అంతకు అయిదు రోజులముందే చిట్టిగాడికోసం రెండుగదులతో డాబా కట్టించాను. అందులో ఒక గదిలో విశేషం ఏమీ లేదు. రెండవగది నిర్మించటంలో మేస్త్రీ కాస్త శ్రమపడ్డాడు. ఆ గదిలో ఏ క్షణంలో ఏం జరుగుతున్నదీ తెలిసికోవాలనే కుతూహలం కలిగితే నా ఆఫీసు గది కిటికీ తెరిస్తే చూడగలగాలి. ఆ గదిలోంచి నా పడకగదిలో నడిచే కథ కనిపించాలి. ఆ నిర్మాణంలో కాస్త శ్రమ లేకపోలేదు. అయినా అదో శ్రమా?

అఖిలలోకాశ్చర్యకర సౌందర్య లీలా విలాస విభ్రమంతో అవిర్భవించిన నిన్ను ఎదురుగా ఉంచుకుని ఒక్క క్షణంకూడా తీరిక లేకుండా జీవించటం కంటె ఘోరనరకం ఏవిటుంటుంది లీలా!

జరిగింది! జరుగుతుంది! అయినా జరిగినదే చెప్పుకుందాం!

నా ఆజ్ఞానుసారం ఆరాత్రి నువ్వు రెండు కప్పుల ఓవల్టిన్నూ, బ్రెడ్, బిస్కట్సుతో నా గది గడపలోకి వచ్చావు. గుమ్మంలో నిల్చిపోయి నిలబడ్డావు. గదిలో నేను లేకపోవటమే కాక ఎవరో కొత్తమనిషి సోఫాలో పడుకుని ఉండటమే నీ ఆందోళనకు కారణం.

* * * *

[లీలావతి గుండె గుబగుబలాడింది. ఆమె కన్నుల ముందు స్వర్గం ప్రకాశిస్తున్నది. ఆమె మనస్సు అన్ని సంవత్సరాల వెనక్కు నడిచింది.]

కిలకిల నవ్వింది మనస్సు—

ఫక్కున పలకరించింది హృదయం.—

మిలమిల మెరిశాయి కన్నులు—

బుగ్గలలో సుడులు అస్పష్టంగా ఏర్పడ్డాయి!!

సర్వాంగాలూ పులకరించినా అడుగు కదపలేక పోయింది లీలావతి.

ఎదురుగా సోఫాలో సిగరెట్ పీలుస్తూ, సగీ రేగిన జుత్తులోకి వ్రేళ్లుపోనిచ్చి, గోడమీది కళాప్రతిమలను అవలోకిస్తున్న దివ్యమోహన రూపుడు కనుపించాడు. ఆమె పదములు వణికినవి— నిశ్వసించింది.

ఆ నిట్టూర్పుకు ఉలిక్కిపడి, ఆలోచనాపూర్ణ శిరస్మేఘ శకలాలను ఛిన్నాభిన్నం చేసి, ఆమెవైపు చూస్తూ:

'లోపలికి రావచ్చు' అన్నాడు.

లీలావతి గుండె పొంగిపోయింది.

మనస్సు కుతకుతలాడుతున్నది.

క్షణకాలం ఆలోచన సాగలేదు.

గుండెను చిక్కబట్టి మనస్సు ఆలోచింప సాగింది.

సరిగ్గా తొమ్మిదిగంటల నలభైఅయిదు నిమిషాలకు రెండుకప్పుల ఓవల్టినూ, బ్రెడ్డూ, బిస్కట్లూ తీసుకురమ్మన్నారు. అన్నీ సిద్ధంచేసుకు వచ్చేసరికి ఆయన లేరు.

ఏమిటి విశేషం?

ఎన్ని విధాల ఆలోచించినా ఈ 'తిలస్మ' ఛ్ఛేదన రహస్యం ఆమెకు అందటంలేదు.

అయినా ఈయన రమ్మని పిలుస్తున్నారు వెళ్లక తప్పదు.

సభ్యత కదలమంటుంది—

సంస్కృతి ఆగమంటుంది—

నాగరకత నడవమంటుంది.

దాన్ని త్రోసిరాజంటుంది స్త్రీసంప్రదాయం.

లీలావతి అడుగు వెనక్కు నడపలేకపోయినట్లే, ముందుకూ సాగలేకపోయింది. పంటకాలువ మధ్యలో ఊగిసలాడే వరివెంక్కిలా ఉంది ఆమె స్థితి.

"లోపలకు రావొచ్చు; కామేశ్వరరావు జీవితంలో ఎవరి స్వాగతాన్నీ, ఎవరి ఆతిథ్యాన్నీ తిరస్కరించలేదు." అన్నాడాయన.

అడుగులు గడపదాటి గదిలో లీలావతిని ప్రవేశపెట్టినవి. నెమ్మదిగానే అడుగులు వేస్తున్నది. ఆమె హృదయం ఆయనవైపు నడుస్తున్నది. మనస్సు నిర్భయంగా ఆలోచిస్తున్నది.

జీవితంలో ఏడు సంవత్సరాలనుంచి కన్నకొడుకు వినా ఏపురుషస్పర్శా ఎరుగని ఆమెశరీరం —స్పర్శలోని ఆనందానుభవాన్ని రుచిచూచిన లీలావతి శరీరం పులకరెత్తింది.

ఆమెకు తెలీకుండానే ఆమె ముఖంలో మల్లెలు విరిసినవి; చెక్కిళ్ళలో గులాబులు నవ్వుతున్నాయి. ఆ క్షణంలో ఆమె పూర్తిగా అపహాసు!

కామేశ్వర్రావు సోఫాకెదురుగా ఉన్న మేజామీంచి సిగరెట్టిన్నూ, అగ్గిపెట్టీ తీసి సద్దసరిజేశాడు.

లీలావతి తలవాల్చుకునే వచ్చి చేతిలోని ట్రే మేజామీద పెట్టింది.

కామేశ్వర్రావు వెనక్కు వ్రాలి:

'ఇలా కూర్చోవచ్చు'

అని తనప్రక్కగా చెయ్యి చూపాడు.

లీలావతి వణికింది. వణుకుతూనే!

'ఆ ఆయన ?'

అంది.

'ఆయనా ?'

అని పకాల్న నవ్వి:

'హైకోర్టుజడ్జీ వచ్చారట. రాత్రి ఒంటిగంటదాకా రానన్నాడు. వచ్చినా వాడితో నీకేంపని ? వాడిపెళ్లాం ఉండగా'

అని బిస్కట్ తీసి కొరికాడు.

లీలావతి హృదయం కుతకుతపడింది.

కూర్చున్న పెద్దమనిషికి తానెవరో తెలీదు. తను వెంకట్రాయుడుచౌదరి భార్యనని మాత్రం ఈయనకు తెలీదు.

అయితే రాత్రి ఒంటిగంటదాకా రానని తనతో ఎందుకు చెప్పలేదు. బహుశా కింద కూర్చుని మాట్లాడుతుండగా ఫోనులో వార్త చేరిందేమో.

మనస్సుకు సంబంధించిన ఆలోచనలో కాలాన్ని వ్యర్థం చేయటంకంటె హృదయాన్ని కరిగించే వాంఛానుభూతిని పరిపూర్తిచేసికోవటం అవశ్యం అయింది.

కూర్చున్నది లీలావతి!

జంకుతూనే కూర్చున్నది!

సోఫా ప్రక్క ఉన్న కిటికీలోంచి మల్లెలవాసనలు గుమ్మమంటున్నాయి. తొలగించిన తెరల్లోంచి చల్లగాలి మల్లెల మత్తుతో వచ్చి గిలిగింతలు పెడ్తున్నది. పైన ఫాన్ లీలావతి హృదయవాంఛతో సమంగా గిరగిర తిరుగుతున్నది.

కామేశ్వరరావు మనస్సు పనిచేయటం మానేసింది. అతని చేతులు మేజామీది కప్పును తీసి లీలావతి పెదవుల కందించాయి. ఆశానేత్రాలతో ఆమె అతనివైపు చూస్తూ పెదవులతో దప్పరిస్తున్నది.

అతని కుడిచేయి కదలింది. కదలిన చేయి ఆమె భుజంమీద వ్రాలింది—లీలావతి చేతిలోకి వచ్చిన కప్పు మేజామీదికి నడిచింది. ఆమె పెదవులు అతని పెదవులను చేరుతూ వణుకుతున్నవి.

"లీలావతీ, సరిగా అదేసమయానికి నేను వీధి గుమ్మంలో నిలబడి బటన్ నొక్కాను. నువ్వు ఝంఝామారుతంలోని ఎండిన చింతాకులా చలించిపోతూ వచ్చి తలుపుతీశావ్. నేను లోపలకొస్తూనే:

"వెరీగుడ్, నువ్వు నామాట మరచిపోయి నిద్రపోతావేమో అనుకున్నాను. టైముకి చెప్పినట్లూ తెచ్చావు. పైకి పోయిపడుకో" అన్నాను.

నీహృదయం పొంగిపోయి ఉంటుంది.

ఆషాఢ ప్రథమ దివసాంత వేళా వ్యాప్త పుష్కలావర్త కాంభోధర ద్యూతి పర్జన్యగర్జాసదృశంగా వినబడిన బెల్ తో నీహృదయం గజగజలాడిపోయినా, నావాక్యాలు అందులోని సౌదామినుల్లా నీకన్నుల్లో మెరిసి నిన్ను కుదుట బరిచాయి.

నువ్వు చేసినపనేమీ నాకు తెలీలేదనే ఆనందంలో నువ్వు మేడమెట్లు ఎక్కేసి ఉంటావు— అంతేనా?

అప్పుడు నువ్వు విడిచిన నిట్టూర్పులో ఎంత ఆనందముందో—అంత ఆవేదనా ఉన్నది.

ఔను—సిద్ధాన్నం!

కొన్నిరోజులనుంచీ అన్నపు మెతుకు చూసి నోచుకోని మనిషికి షడ్రసోపేతంగా భోజనం సిద్ధంచేసి, రజితపాత్రలో వడ్డించి, బంగారపు పువ్వుల పీటమీద కూర్చోబెట్టి, సరిగ్గా కంఠంలోకి చెయ్యి పోనిచ్చేవేళ, కంచంతీసేసి, ఆ మనిషిని తిన్న తగిలేస్తే పడేబాధకూడా నీబాధకు సరిగాదు లీలా.

కానీ — అంతా తెలిసిఉండీ నేననుభవించే బాధతో పోల్చగలవా?

నా బాధను ఎరిగినవాడు ఒక్కడే ఒక్కడున్నాడు. వాడు అడుగో! నువ్వు ఈ మేడలో అడుగు పెట్టింది మొదలు ఏ చలనమూ లేకుండా ఒకే నృత్యభంగిమలో ఉన్న నటరాజరాజేశ్వరుడు.

నీకూ తెలిసి ఉంటుంది.

తెలియటమే కాదు గుర్తులోకూడా ఉంటుంది. ఆ రాత్రి వచ్చిన అతిథి తెల్లవారుఝామునే లేచి వెళ్ళిపోయాడు అయితే వాడు నాతోకూడా చెప్పకుండా వెళ్ళినట్లు నీకు తెలీదు. అంత జరిగినా, జరిగినదానికి వాడుకూడా నీ అంతా బాధ్యుడే అయినా నేను ఆ ప్రసక్తి లేకుండా వాడితో ఆ రాత్రి గడిపేశాను. నిద్రకు లేస్తూమాత్రం అన్నాను. 'ఈ ఏర్పాట్లన్నీ మా అవిడవి. అవిడ కాలేజీ చదువు చదివినా వంటకాలలో బాగా ఆరితేరింది. ఇప్పుడివన్నీ తెచ్చినావిడే మా శ్రీమతి'—అంతే—వాడి ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు. ప్రాణస్నేహితుడికి అంతకంటె శిక్ష ఏంకావాలి? అందుకే వాడి అంతరాత్మ వాడిమొహాన్ని నాకు చూపనివ్వకుండా, తెల్లవారుఝామునే కదిలించేసింది. వాడు మళ్ళీ ఈయింటికి రాలేకపోయాడు.

ఇప్పుడడుగుతున్నాను లీలావతీ—

నీకు నమ్మకం ఉన్నా, లేకపోయినా ఈ నటరాజరాజేశ్వరుడి మొహం చూసి చెప్పు—నీకు కొడుకు పుట్టినతరువాయి మళ్ళీ నువ్వు సాంసారిక సుఖాన్ని అనుభవించావా?"

అని రావుసాహెబ్ దీర్ఘనిశ్వాసం విడిచి ఒక్కసారి కిటికీదగ్గరకు వెళ్ళివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. ఆమె కనుగొలకుల్లో అతుక్కుపోయిన ఆఖరి కన్నీటి చుక్కలు రెండూ ఒడిలో రాలినవి. అతనికి సమాధానంగా తల అడ్డంగా ఊగింది.

"నాకు తెలీకకాదు లీలా — మానవుడికి జీవితంలో అవసరమయినది తిండీ — గుడ్డా మాత్రమే కాదు. తదతీతమయిన మానసిక వికాస, సంతృప్తులు. ఈ అవసరాలను ప్రభుత్వాలు గుర్తించనూ లేవు, రాజకీయవర్గాలు తీర్చనూ లేవు. మానవుడికీ — మానవుడికీ మధ్యనుండే సంబంధాదులననుసరించీ వారి శారీరక, మానసిక పరిణామాలమీదా అవి ఆధారపడి ఉంటవి. ఇవి తీరనప్పుడే మానవుడు ఉన్మత్తుడవుతాడు. ఈ ఉన్మత్తత రెండువిధాలుగా నివారింపబడుతుంది.

ఒకటి చికిత్స.

రెండవది కళ.

చికిత్సలో జీవితం అజ్ఞాతంగా నాశనమవుతుంది, లేదా మరికొన్ని విచిత్రరోగాలనుకూడా సంక్రమింపజేయవచ్చు, అలానే నాశనంచేసినస్థితులుకూడా ఉన్నాయి. చికిత్సతో ప్రపంచం అంటే భయం, అసహ్యం ఏర్పడతాయి. అందువల్ల చికిత్స అనుమతిధానమే గాని ఉత్తమసాధనంమాత్రం కాదు.

ఇంక కళ—

ఇదే నిన్నూ, నన్నూ రక్షించింది.

మనం కొత్తగా కాపురం పెట్టిన రోజుల్లో ఎంతోమంది మన యింటికి విందులకు వచ్చేవారు. అలా వచ్చేవారిలో అనేకులకు సంగీతంలో అభినివేశం ఉండేది, కొందరికి చిత్రకళలో ప్రావీణ్యం ఉండేది, మరికొందరు అభినయంలో నిపుణులు. అసలు ఏదో ఒక కళలో అభినివేశం లేనివారితో నాకు పరిచయమే ఉండేదికాదు.

నువ్వు వీణముందు కూర్చుంటే భారతివే.

ఈ యింటికి నువ్వు వచ్చేవరకూ నీకు వీణా వాదనం వచ్చునని నాకు తెలీనే తెలీదు. నీ సామాను సర్దిస్తూండగా మన సుబ్బులు చెప్పింది:

బాబాయ్, మీకు విశ్రాంతి కావలసివచ్చినప్పుడెప్పుడయినా అవిడకు కబురుచేస్తే వీణ మీటి మీ

హృదయతంత్రీస్పందనంతో శాంతి చేకూరుస్తారు. వీణలో ఆవిడ చాలా బహుమానాలు కూడా సంపాదించారు—అని.

అప్పు డనుకున్నాను ఆనందంతో—నీ జీవితంలో నిన్ను వెన్నంటి ఉండేందుకు ఒక 'దివ్యసహచరి' ఉన్నదని. అప్పుడు నేను పడ్డ తృప్తి...లీలా...

అందుకే ఒకో్కనాడు మధ్యాహ్నం కాఫీకి మేడమీదకు వచ్చి:

'లీలా, ఒక్కసారి హృదయతంత్రీస్పందనం చేస్తావ్?' అని అర్థించేవాణ్ణి.

నాలుగైదుసార్లు నువ్వు ఎంతో కుతూహలంతో వీణ తీసేదానివి. నాకు తెలుసు అప్పటి నీ హృదయవేదన. ఆ తరువాయి నీలో అంత ఉండేదికాదు.

కాని లీలా—నా అదృష్టమే కాదు నీ భాగ్యం కూడా. నిజం—వీణ పేరు విన్నంతలో వాలి పోలిపోయే కూతుర్ని కన్న ఉమామహేశ్వరంగారు ఈ ఊరుకి ప్రాక్టీసు మార్చటం, ఆయన చతురంగంలో ప్రవీణుడు కావటంవల్ల మా ఇద్దరిమధ్య ఆత్మీయత ఏర్పడటం, ఆయన అరవయ్యోయేడు దాటినవాడు కూడా అవటంచేత నేను కాస్తంత ఆలస్యంగా వచ్చినా లోపలకు వచ్చి, కూర్చుని, నీతో ఏదో ప్రసంగిస్తూ, కొంత కాలక్షేపంచేసి ఆశీర్వదిస్తూ ఉండటమే కాక ఆయన కూతుర్ని నీదగ్గర వీణాభ్యాసానికి చేర్చటం—ఆ అమ్మాయి పేరు పద్మావతి కాదూ, ఔను—ఆమె సంస్కార, సంప్రదాయాలుకల కుటుంబంలోంచి వచ్చినందువల్ల నీ దగ్గరనుంచి వీణ నేర్చుకుంటూనే, నీకు సంస్కృత, కావ్య, నాటకాలు వినిపిస్తూ వివరించేది ఒకరోజున...

'స్త్రీణామశిక్షిత పటుత్వ మమానుషీషు....'

అనే శ్లోకాన్ని ఆ అమ్మాయి వ్యాఖ్యానిస్తూండగా నేను పైకి వచ్చాను. ఆ సమయంలో నీ ముఖం ఎంత మ్లానమయిపోయిందో గుర్తుందా లీలా?

ఆడజాతికి అమానుష పటుత్వం శిక్షానపేక్షితం—

అని పద్మావతి ఎంతచక్కగా బిగించింది... ఇంతకూ ఎందుకు చెప్పానంటే ఇలాటివన్నీ నీకు కొంతవరకూ కాలాన్ని గమనించకుండా వ్యయం చేసేయటానికీ, నిశ్చింతగా జీవించటానికీ, తీరనీ మన అవసరాలకు మార్గాంతరాలు కావటానికీ కారణమయాయి.

అయినా అప్పుడప్పుడు నీకు కొంచెం ఆరోగ్యభంగం కలిగేది. కలిగినా అది విషమించే పాటికాలం ఉండేదికాదు. కాకుండా ఉంచేమార్గం నాకు తెలుసు. తెలియటానికి కారణం రోగానికి మూలధాతువు విదితపూర్వం కావటమే.

డాక్టరు వచ్చేవాడు. డాక్టరమ్మలు వచ్చేవారు. ఏదో రోగనిర్ణయం చేసేవారు. ఇంజక్షన్లవేవాళ్ళు—ఎర్రరంగునీళ్లూ, పసుపురంగు సీసాలు వచ్చేవి. ఒక్కసారి నీ చర్మంలోకి సూది దిగనిచ్చేవాణ్ణి కాదు, ఆ నీళ్లు నీచేత త్రాగించేవాణ్ణీ కాదుగా? ఆఖరుకి ఓనాడు డాక్టర్ లలిత నన్నే అడిగింది—నవ్వేసి ఊరుకున్నాను.

జ్వరం తగిలిన మూడోరోజున నేను నీదగ్గర కొన్నిగంటలు ఉల్లాసంగా గడిపేసరికి నీలో ఒక కొత్తకాంతి, నూతనోత్సాహం, ఒక ఆశారేఖ గోచరించేవి. మరునాడు నీకు పథ్యం యిచ్చేయటం జరిగేది. ఇంతవరకూ నేను పొరబడి లేదనుకుంటాను?'

అని నవ్వాడు.

లీలాతి విషాదాచ్ఛాదితవదనసీమలో ఒక దరహాసవల్లి అంకురించింది. ఆమె హృదయంలో లేగులాబిరేక గిలిగింతలు పెట్టింది.

"లీలా, మనజీవితంలో సంధ్యారాగాలు ప్రసరిస్తున్నాయి. అస్తమిత సూర్యకాంతులతో నీ—నా ముఖాలు శోభాహీనాలవుతున్నాయి. ఈ సమయంలో ఒక్కసారి మన పూర్వ జీవిత చరిత్రాధ్యాయాలను స్మృతిదృక్కులతో పఠించుకుని ఉపసంహారం వ్రాసుకుందాం.

"ఆఁ లీలా!

ఉమామహేశ్వరంగారు చెప్పేవారు గుర్తుందా?

ఈ ప్రపంచ సర్వస్వానికి హేతుభూతమయినది ఒక్క శబ్దబ్రహ్మమేననీ, ఆ శబ్దం ఆకాశంనుంచి ఉద్భవిస్తుందని, దానినే భారతీయ ఋషులు 'ఓమ్' కారంగా భావించారనీ, ఆ శబ్దాన్నే 'ఉద్గీథ' అంటారనీ, ఈ శబ్దంనుంచే సృష్టి, స్థితి, లయ కారులావిర్భవించారనీ, వారిమూలకంగానే ఈ భువన

భువనం, ఈ భువనంలో ఎనభైనాలుగు లక్షల జీవరాసులూ... ఈ పరిణామాలూ ఏర్పడ్డాయనీ...
నువ్వు మరిచిపోవులే....

తచ్ఛబ్దవాచ్యమయిన చిచ్ఛక్తిరూపాన్నే సర్వకారణంగా వేదాంతులు భావిస్తారని, ఆ భావనలోనే అపరోక్ష బ్రహ్మ సాక్షాత్కారానుభూతి వారికి కలుగుతుందనీ మహేశ్వరంగారు చెప్పినప్పుడు వినే ఉంటావు. ఆ విషయాలు ఆయన చెప్పుకుపోతూంటే ఎంత విశ్వసించదగ్గవిగా కనిపించేవి లీలా—అదంతా ఇప్పుడు చెప్పవలసిన అవసరం ఏమిటని సందేహిస్తావేమో! నిజంగా దాని అవసరం ఉంది.

సృష్టికర్తకే లయం చేసే బాధ్యతకూడా ఉంది. ఈ రెండింటికీ ఒక్కడే బాధ్యుడు కావటం ప్రాకృతిక నియమం. అదే రీతిగా కన్న సంతానాన్ని పోషించుకొనే అభిలాషతోపాటు హతమార్చే అధికారం కూడా వారికే ప్రసాదించబడింది. ఆ విషయాన్ని అంగీకరించగలవనుకుంటాను?

నువ్వూ—నేనూ అంగీకరించకపోయినా అది జరుగుతూనే ఉంది.

పెద్దపులి పిల్లల్ని కనగానే ఆకలివేడిలో మింగేస్తుంది. పాము గ్రుడ్లను పెడుతూ కళ్ళుమూసుకుని గుటకేస్తుంది. క్రూరజంతుజాలంలోనే కాదు—ఈ నియమం మానవజాతిలోకూడా ఉంది.

కుంతి కర్ణుణ్ణి గంగలో పారేసింది.

గంగ ఏడుగురు కొడుకుల్ని మహాప్రవాహంలో వదిలేసింది.

అంత వెనక్కు పోనక్కర్లేదు. మనయింటికి వచ్చే సోమేశ్వరరావుగారి అమ్మాయి భర్తతో కాపురం చెయ్యనని వచ్చేసిన మూడోయేట పిల్లవాణ్ణి కని హాస్పిటల్ గోడవార పారేసింది, ఎరగవూ?

అందుచేత కన్నవారికే చంపుకునే హక్కు కూడా ఉంది లీలా"

అని ముట్టముట్టించాడు రావుసాహెబ్.

లీలావతి దీనవదనం మ్లానమవుతున్నది. ఆమె కన్నులు దృష్టిని కోల్పోతున్నవి. ఆమెగుండె వేగంగా, ఉపద్రవంగా, మందంగా సాగుతున్నది. ఉచ్ఛ్వాస—నిశ్వాసలలో భేదం తెలీటంలేదు.]

"వెళ్ళాను లీలా!

ఉత్తరం వచ్చిన మర్నాడే ఆ పట్నానికి వెళ్ళాను. వారంరోజులు ఆ పట్నంలో ఉండి విషయాలన్నీ తెలుసుకున్నాను. అవన్నీ నీకు చెప్పి నిన్నింకా వేధించటం నాకెంతమాత్రం ఇష్టంలేదు. అక్కడి జడ్జీ నాక్లాస్ మేట్. వాడి ఇంటిదగ్గరే బసచేశాను. ఆరోజు రాత్రి భోజనాలయాయి. అతని భార్య నీలానే చదువుకున్నదీ, తెలివయినదీ, ఎంతో నేర్పు కలదీనూ. అంతవరకే.

ఆ రోజు రాత్రి భోజనాలయాయి.

చేతులు తుడుచుకుంటూ వాకిట్లోకి వచ్చేసరికి సోఫాలమధ్య మేజామీద తమలపాకులకు సున్నం రాసి, ఈనెలుతీసి పళ్లెంలో ఉన్నాయి. చుట్టూ సుగంధద్రవ్యాలున్నాయి. ఒకమూలగా కిటికీదగ్గర డ్రాయరుమీద ఏనుగుతొండంలోంచి అగరువత్తుల పొగ బయల్దేరి జాయిగా మామీదకు వస్తూన్నది. ఇద్దరం తమలపాకులు నములుతున్నాం; ముట్టముట్టిస్తూ వాడి ముఖంలోకి చూశాను.

నా గుండె ఝల్లుమంది.

వాడి ముఖంలో నాకు అవోనినమయిన ఆవేదన ప్రస్ఫుటంగా గోచరించింది. బరువుగా, వేడిగా నిట్టూర్చాడు.

నేను చలించాను.

చలించాను కానీ—చలించినట్లు మూడోకంటికి తెలీదు.

ఏదో విషాదసంఘటన వాడు చెప్పబోతున్నాడనుకున్నాను. జడ్జీకనక ఆ మరునాడో, ఆనాడో ఏదయినా ఉరిశిక్ష విధిస్తున్నాడో, విధించాడో అనుకున్నాను. అయితే అటువంటిదానికి వాడు బాధపడనక్కర్లేదు; అప్పటికే వాడికలం ఎన్ని తలలనో తీయించేసి ఉంటుంది కనక వాడికదేం బాధ కలిగించకూడదు.

'ఏమిటో విశేషం?' అన్నాను.

వాడు అటూ, యిటూ పరకాయించి చూశాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ప్రక్కగదుల్లో పిల్లలు నిద్రపోతున్నారు. వంటింట్లో ఆవిడ భోజనం చేస్తున్నది.

అయినా వాడు అక్కడ కూర్చోలేకపోయాడు. మేడమీదకు నడవమన్నాడు. లేచి వాడు అడుగులు వేశాడు. వాడి వెనకాలే నడిచాను.

మేడమీద గదిలో రెండుక్షణాలు కూర్చున్నాం. మా నోట్లో మాటలు లేకపోతే ఆ గదిలో చైతన్యంగల రెండుప్రాణు లున్నట్లుకూడా తెలుసుకోలేరు.

వాడు లేచాడు—లేచి డ్రాయరు సొరుగు తీసి ఈ కవరు—

నా జేబులో ఉంచాడు.

నేను తియ్యబోయాను.

వాడు నా చేతిని పట్టుకు ఆపేశాడు.

నేను రైలు దిగేవరకూ ఆ కవరు విప్పవద్దన్నాడు.

అక్కడనుంచి డాబామీదికి తీసుకువెళ్ళాడు. ఇద్దరం పైకి నడిచాం.

ఎక్కుతూండగానే వాడు డాబామధ్యలో కూలబడ్డాడు. ప్రక్కగా కూర్చోమని సంజ్ఞచేశాడు.

అప్పటికింకా శశాంకుడు ఆకాశంలోకి రాలేదు. రకరకాల నక్షత్రాల కాంతులతో నీలాకాశం నిగనిగలాడుతున్నది.

"చూశావా...ఆకాశంలోని నక్షత్రాలు..." అని ఆగి నిట్టూర్చి:

"దివ్యతేజస్విని దీనవదనంమీద అంకురించిన స్వేదకణాల్లా ఉన్నాయిరా అనంతాకాశంలోని అగణిత తారకాగణాలు...అవి ఎప్పుడూ ఆమె జడలోని మల్లెమొగ్గలలా కనిపించి ఎంతో శాంతిని కలిగించేవి. కాని ఈ వాడు...

తప్పదురా వెంకట్రాయుడూ!

సంఘదృష్ట్యా నాకూ — వాడికీ ఏ సంబంధ బాంధవ్యాలూ ఉండకపోవచ్చు; లేకపోయినా నైతికంగా ఆలోచిస్తే వాడు నా కొడుకు. ఆకారంలో నేకాదు కొన్ని అలవాట్లలో కూడా వాడు నా కొడుకు! కానీ...పరిస్థితులు చూడూ.

వాణ్ణి రేపు ఉరి తీయటానికి తీర్పివ్వాలి. అలా కాకుండా నేను తప్పించగలను; కలిగినా ప్రయోజనం లేదురా. వాడిని విడుదలచేసినా వాడు దారిలోకి రాడు. మరికొన్ని ఘోరాలు చేస్తాడు. వాడిజీవితం ఇంక బాగుపడదు. వాడికి అనునయం మృత్యుదేవత కౌగిలిలోనే...

ఎంతోసేపు అడిగాను, నీతండ్రి ఎవరని?

వాడు తండ్రిపేరు అడిగేసరికి ఉగ్రుడై చూసి స్తాడేకాని పేరు చెప్పాడుకాదు. తన తల్లినిగురించి, తల్లి ఘనతనుగురించీ చెప్పాడేకాని తండ్రి విషయం చెప్పలేదు. తల్లినిగురించి అంతచెప్పాకకూడా తెలిసికోలేనంతటి మూర్ఖుణ్ణి కాదుగా...

వాడి ప్రతిరూపమే నా గుండెలో గుండు సూదిలా మెదులుతూనే ఉంది. వాడి అధోగతికి నేనే బాధ్యుణ్ణని నమ్మక తప్పలేదు. కాలేజీలో చదివే రోజుల్లో ఇంతదూరం ఆలోచించగలమా? ఆ వేడిలో .. ......"

అంటూ వాడు తలవాల్చేసి ఒక గంటసేపు ఏడ్చి ఉంటాడు. వాడి దుఃఖం నా గుండెను చీల్చేసింది.

పుత్రగాత్రపరిష్వంగసుఖాన్ని నన్నయభట్టారకులు వర్ణిస్తే, ఆ అక్షరాలకు రూపాన్ని చూపించాడు వాడు. నిజంగా కన్నతండ్రి హృదయావేదన ఈగొడ్డు వాడికేం అర్థమవుతుంది లీలా?

అయినా వాడివేదన నాకు ఆ దుఃఖాన్ని వివరిస్తూ, నా హృదయాన్ని మెలిద్రిప్పేసింది లీలా.

ఆ మరునాడింక నేను ఆగలేకపోయాను.

నాకు వాడిచ్చిన కవరుమాట గుర్తేలేదు.

బెజవాడస్టేషన్లో బట్టలు మారుస్తుండగా జేబులోంచి బైటకి వచ్చింది.

ఎంతో ఆతురతతో విప్పి చూశాను.

అది నేను భావించినట్లు ఉత్తరం కాకపోగా, కొన్ని ఉత్తరాలకట్టతో పాటు ఒక ఫొటో...అన్నీ చదివాను...అందులో వాడూ — ఆ అబ్బాయి తల్లీ ఉన్నారు. ఇదిగో ఈ ఉత్తరాలూ, ఫొటో నీవి:

"ఇప్పుడు చెప్పు లీలా!

వాడు నీ కొడుకో?

మన కొడుకో?"

అని రావు సాహెబ్ వెంకట్రాయుడు చౌదరి చుట్ట విసిరేశాడు.

# దీర్ఘరాత్రం

'ఆరుద్ర'

## ఏకాంకిక

* * వింధ్యకు ఉత్తరాన — అగస్త్యుని ఆశ్రమం. మునిమాపువేళ. ఆకు అల్లాడడంలేదు. ఆశ్రమం అట్టుడికి పోతున్నాది. లేళ్లు భయపడి, పడుక్కొని కాళ్ళలో ముట్టెలు దాచుకుంటున్నాయి.

దూరాన, దర్భలు ఆకులూ కోసుకొని, తీసుకొస్తున్న అంతేవాసులు వైదికగీతాలు పాడుతున్నారు:

'అదితే మిత్రవరుణే తమ్సశయ
ద్వోవయం చకృమాకచ్చిదాగః
ఉర్వశ్యామ భయంజ్యోతి
రింద్రమానో

దీర్ఘా అభినశంతమిస్రః—'

వాళ్లు దగ్గరకు వచ్చారు.

ఆశ్రమం చుట్టూరా ఉన్న గభీర భీతిని, గంభీరతని చూసి వాళ్ళు వైదికగానాన్ని ఆపివేశారు.

ఒక ఆశ్రమవాసి: ఆపేశారేం ? — అదితినీ, మిత్రావరుణులనీ ప్రార్థించండి. దీర్ఘ తమిస్రంనుండి మనల్ని కాపాడమని వేడండి.

ఒక అంతేవాసి: అనుశ్రుతంగా వస్తున్న ప్రార్థన అలవాటు చొప్పున వల్లిస్తున్నాం. అంతేకాని, ఇప్పుడు మళ్లా దీర్ఘతమిస్రం వచ్చేనా? కళ్లుమూసుకొని పడుక్కుంటే తెల్లవారిపోతుంది.

ఆశ్రమ : లేదయ్యా! కీడుమూడేటట్టుంది. ఇక చీకటి రాత్రుల పరంపర మనల్ని ఆవరించేటట్టుంది.

ఇంకొక అంతేవాసి: ఏమిటంత ముంచుకొచ్చేది?

వేరొక ఆశ్రమవాసి: అగస్త్యులవారు మళ్లా ఒకర్ని పొట్టపెట్టుకున్నారు.

మరొక అంతేవాసి: ఇంకో వాతాపినా?

1 ఆశ్ర : కాదు. సుందుడనే యక్షుణ్ణి.

2 అం : ఆ యక్షుడేం చేశాడు.

1 ఆశ్ర : ఇంకేం చెయ్యాలి. అగస్త్యులవారి ఆగ్రహం తెప్పించాడు.

1 అం : ఆఁ, తోఁచపడింది. — మరి చెప్పక్కర్లేదు మహానుభావుడు మండిపడ్డారు. ఆ యక్షుణ్ణి ఒక్క శాపంతో దగ్ధంచేశారు.

2 ఆశ్ర : అవును అంతే.

1 అం : ఇందులో కొత్తేముంది? పాడిన పాటేగా ఈమాత్రం దానికి ఆశ్రమం అట్టుడికిపోవాలా?

1 ఆశ్ర : అసలు సంగతి నీకు తెలియదు. ఆ యక్షుని భార్యాపుత్రులు పగబడితే మన వేంకాను.

1 అం : యక్షులేకద! అల్పవీర్యులు! ఉఫ్ అని ఊదేస్తే ఎగిరిపోతారు. వాళ్ళకి భయపడడం ఎందుకు ?

2 ఆశ్ర : అంతతేలిగ్గా కొట్టిపారెయ్యకు. ఆ యక్షుని భార్య వెయ్యి ఏనుగులబలంతో పుట్టింది.

3 అం : అలాగా!

1 ఆశ్ర : ఆమెకు పుట్టిన కుమారుడు ఇంద్రుడంతటి పరాక్రమవంతుడు.

3 అం : అయ్యబాబో! అయితే ఇబ్బందే.

2 ఆశ్ర : ఇబ్బందా? ఇబ్బంది—న్నర. తల్లీ కొడుకు లిద్దరూ తలచుకొంటే — ధరిత్రే తల్లడిల్లి పోతుంది.

1 అం : ఉష్! అవు. అగస్త్యులవారు ఆశ్రమంలోంచి వస్తున్నారు.

1 ఆశ్ర : ఆ. ఏమిటీ వెలుగు! అస్తమించబోతున్న సూర్యుడు ఆగిపోయాడా?

1 అం : అగస్త్యులవారి తేజస్సు!

2 ఆశ్ర : అదే కాబోలు.

2 అం : కాదయ్యా! ఆడదెవరో వస్తున్నాది. ఆమె మేని తళతళ!

1 ఆశ్ర : ఆహా! ఎవరో అందగత్తె!

3 అం : ఏమి సౌందర్యం!

1 ఆశ్ర : చూశావా! ఉదయిస్తున్న చంద్రునిలాగ ఆమె ముఖం ఎంత ఎర్రగా ఉందో!

2 అం : ఆమె వెనుక వచ్చే అత డెవరు? విశాలమైన ముఖం. — కండలు తిరిగిన ఒళ్ళు అత డెవరు?

2 ఆశ్ర : ఇటే వస్తున్నారు.

1 అం : వాళ్లు అడుగుతీసి అడుగు వేస్తూవుంటే భూమి దద్దరిల్లుతోంది.

3 ఆశ్ర : ఆ భూమిని చూస్తే భయమేస్తోంది.

అగస్త్యుడు : (ప్రవేశించి) ఎందుకూ భయం! నేనుండగా మీకేం భయంలేదు.

1 అం : నిజమేగాని గురుదేవా!

అగ : సందేహించకండి. వాతాపిని జీర్ణం చేసుకొన్నవాణ్ణి, సముద్రాన్ని ఔపోసన పట్టినవాణ్ణి నన్ను ఎదిరించేదెవరు.

3 అం : చిత్తం గురుదేవా!
[ఏడీ ఆ అగస్త్యుడేడీ! అంటూ తాటక వస్తుంది. ఆమెతో ఆమె కుమారుడు మారీచుడున్నాడు]

తాటక : ఏడీ?—నా భర్తను చంపినవాడేడీ! ఎక్కడ? అగస్త్యుడెక్కడ?

అగ : నేనే అగస్త్యుణ్ణి!

మారీచుడు : నీవేనా! నా తండ్రిని వధించినవాడివి.

అగ : అవును నేనే!

తాటక : ఎంతపని చేశావయ్యా మునీ! ఎంతపాపం ఒడిగట్టేవయ్యా! ఇది నీకు తగునటయ్యా!

మారీ : మా నాన్న నెందుకు చంపావు చెప్పు!

అగ : చంపతగినపని చేశాడు. చెయ్యకూడని పాపం చేశాడు.

తాటక : ఏమిటయ్యా ఆ పాపం. ఇదేమిటి?-మీ మునులంతా కలసి ఇంద్రుడి పాపాలను కడిగిన ప్రాంతమే కదయ్యా ఇది. అంత గొప్ప యింద్రుడు చేసిన అంత మహాపాపమే ఈ చోటబోగా లేనిది, నా భర్త చేసినదే నటయ్యా నిన్ను కష్టపెట్టింది.
[అగస్త్యుడు పోబోతాడు.]

మారీ : ఆగు! జవాబు చెప్పి మరీ కదులు.

అగ : నాకు వేళవుతోంది. సాయం సంధ్య వార్చాలి. అడ్డులే.

మారీ : నా అమ్మ అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పి

అగ : ఇప్పుడు కాదు అదను. నేను జపం చేసుకోవాలి. దానికి అడ్డురాకు.

మారీ : మా అమ్మ ప్రశ్నకన్నా నీ జపం నాకు ముఖ్యం కాదు.

అగ : ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసునా?

మారీ : తెలుసు. చెప్పావుగా నీవే అగస్త్యుడవని.

అగ : అయితే అడ్డులే.

మారీ : లేవను.

అగ : అయితే నీ తండ్రికి పట్టినగతే నీకూ పడుతుంది.

మారీ : చాలించు నీ ప్రతాపం. నాదగ్గరా! బలం లేని, నోట్లో నాలిక లేని నా తండ్రిని చంపడం అనుకొన్నావు నన్ను చంపడం! నీ తరం కాదు.

అగ : ఏమిటిరా నీ పొగరు.

మారీ : ఆ ఊరికి ఈ ఊరు ఎంతో ఈ ఊరికి ఆ ఊరూ అంతే. మా అమ్మ అడిగినదానికి జవాబు చెప్పవేం.

అగ : నాకు కోపం తెప్పించాడు కనుక నీ తండ్రిని చంపాను.

తాటక : నువ్వు నాకు కోపం తెప్పిస్తున్నావు కనుక నిన్ను నేను చంపితే—

మారీ : నువ్వెందుకమ్మా నేనుండగా. నీ ఆజ్ఞ అయితే ఈ జడదారిని నిముషంలో కనబడకుండా చేసేస్తాను.

అగ : ఏమిటిరా అంటున్నావు. క్షమాపణ చెప్పుకో.

మారీ : మా నాన్నని చంపినందుకు నాకు క్షమాపణ చెప్పవలసిందిపోయి నన్నుల్ని వేడుకోమంటావా? ఓరి నీ—

అగ : లేవరా అడ్డం, లేస్తావా లేదా.

మారీ : లేవకపోతే ఏం చేస్తావు!

అగ : నిన్ను శపిస్తాను.

తాటక : ఏమని?

అగ : రాక్షసుడివలె నా అనుష్ఠానానికి అడ్డం వచ్చినందుకు రాక్షసుడవయ్యేట్టు శాపం ఇస్తాను.

తాటక : ఇస్తావు. ఈ భూములలో జనపదాలలో మునిగణాలలో నీ శాపం చెల్లుతుంది కాబట్టి శాపం ఇస్తావు. పెద్దరికమిచ్చినందుకు లోకులకు నీ విచ్చేది శాపాలా?

మారీ : నీ శాపానికి నేను జడుస్తాననా? ఇచ్చుకో!

అగ : శాపం ఇస్తానన్నా నీకు భయం లేదా. నా శాపంవల్ల నీకు యక్షత్వం పోతుంది. రాక్షసత్వం వస్తుంది. అంటే పురప్రవేశార్హత నీకుండదు. అలకానగరంలో అడుగుపెట్టే యోగ్యత పోతుంది. యక్షరాజు నిన్ను చేరనివ్వడు. జనపదాలలో అడుగుపెట్ట వీలుండదు. అందరూ బహిష్కరిస్తారు. నలుగురితో కలిసి సుఖించే అవకాశం ఉండదు.

మారీ : నా తండ్రికన్నా అవి నాకెక్కువా! మా నాన్న లేని అలకాపురం నాకెందుకు? నీవు మా నాన్నని చంపినట్టే నిన్ను నేను చంపుతాను. ఆయన్నెలా చంపావో చెప్పు.

[మారీచుడు ముందుకెళతాడు. అగస్త్యుడు కనులెర్రచేస్తూనే వెనుకకు వెళతాడు. అక్కడికి వస్తున్న లోపాముద్ర 'ఆ!' అని అరుస్తుంది]

అగ : ఏమిరా! నన్నే చంపదలుచుకున్నావు. నీకు విధిగా శాపం ఇవ్వాలి. నువ్వు రాక్షసుడివి! నువ్వు రాక్షసుడివి!

మారీ : ఏమిటి జిత్తులమారివిరా నువ్వు! నన్ను రాక్షసునిగా ప్రకటించావు కనుక ఇప్పుడు ఆశ్రమవాసులూ అంతేవాసులూ అందరూ కలసి మూక ఉమ్మడిగా చంపవచ్చుననా! కానీ చూస్తాను. నీ కోరిక సఫలం ఎలా అవుతుందో?

తాటక : శపించావుకదయ్యా ముని! నా కుమారుణ్ని శపించావు. సరే — నీకూ ఒక కుమారుడున్నాడుగా! వాడు ఎలా మనగలుగుతాడో నేను చూస్తాను.

లోపాముద్ర : ఆ! అయ్యో!

తాటక : ఏవమ్మా లోపాముద్రా! నీ కొడుకులాంటి వాడు కాదా నా కొడుకు? నీ భర్తలాంటి వాడు కాడా నా భర్త. నాకుమట్టుకూ నీకుంటే అనురాగం వాత్సల్యం ఉండవా? నీ భర్తని నిలబెట్టి సమాధానం చెప్పమని అడగడంలో నా కేమైనా తప్పుందా?

లోపా : (మాట్లాడదు.)

[తాటక రెండడుగులు ముందుకు వేస్తుంది. పక్కనున్న లేడి లేచి పారిపోతుంది. అగస్త్యుడు పక్కకు తొలగుతాడు.]

అగ : రాక్షసుడి తల్లివి! నువ్వు దూరంగా ఉండాలి.

తాటక : నా భర్తని హననం చేశావు ప్రతీకారం చేస్తాను. చేయక ఊరుకోను.

అగ : ఆహ—ఆవేశంలో నీ బెదిరింపుకి అర్థం తెలుసుకోలేకుండా ఉన్నావు.

తాటక : నాకు తెలుసు. నాలాంటి ఆడదే కనుక నీ భార్యకీ తెలుసు. స్త్రీ తన భర్తని ఎంత ప్రేమించుతుందో, ఆ ప్రేమకోసం ఎంత త్యాగం చేస్తుందో నీ భార్యకే తెలుసు. నీకోసం రాజభోగాలనీ, భాగ్యాలనీ విడ

శాడి, అడవులకి చేరిన ఆడది ఆమె. ఆమెకే నా మనో వేదన తెలుసు.

లోపా : (కళ్ళల్లో నీళ్లు తిరుగుతాయి.)

తాటక : నా భర్తని చంపడమే కాక, నా కొడుకుని శపించావు. మునీ నిన్ను వదలి పెట్టను. అమ్మా లోపాముద్రా! నన్ను అర్థంచేసుకోగలవు. నీకు అన్యాయం చేద్దామని కాదు. నాకు న్యాయం కలగాలనే నే నీపని చేయబోతున్నా.

[ఆమె చేతులుచాచి ముందుకు వెళుతుంది.]

బ్రహ్మ నాకు వెయ్యి ఏనుగుల బలం ఉంటుందని మా నాన్న సుకేతుడికి వరం ఇచ్చాడు. ఆ బలం అంతా ఇప్పుడు నా చేతుల్లో కేంద్రీకృతం అవుతుంది. అంత సత్తువతోనూ నిన్ను...

[అగస్త్యుని మెడదగ్గరికి ఆమె చేతులు వెళతాయి. లోపాముద్ర 'అఁ' అని అడ్డొస్తుంది. అగస్త్యుడు పక్కకు తొలగుతాడు. తాటక ఆగిపోతుంది.]

అగ : రాక్షసీ!

తాటక : నేను రాక్షసినా? నన్ను శపిస్తున్నావు.

అగ : అవును. నువ్వు రాక్షసివే. నువ్వు రాక్షసివే!

[ఆ తపోవనంలోనివాళ్లంతా అప్పటికే ఆ చుట్టూ చేరారు. వాళ్లు, నోళ్లు తెరచుకొని ఇది చూస్తున్నారు.]

లోపా : (కళ్లు మూసుకొంటుంది.)

అగ : ఆశ్రమవాసులారా! చీకటి పడింది. ఎవరి కుటీరాలలోనికి వారు వెళ్లిపొండి. రాత్రుళ్లు వెలికి రావడం మనకి తగదు. ఈ రాక్షసుల వల్ల నా సాయంసంధ్యావందనం భంగమయింది. అందుకు వాళ్లు అనుభవిస్తారు. (అగస్త్యుడు వెనుకకు మళ్లుతాడు. అందరూ అతణ్ని అనుసరిస్తారు)

తాటక : సరే కానీవయ్యా! నేను రాక్షసినిఅయ్యాను. నాకొడుకు రాక్షసి. మేం వెలిఅయ్యాం నీ నీతికి బాహ్యులమయ్యాం. నీమాటే ఈ చుట్టుపక్కల చెల్లుతుంది. మనుల్ని దరికి రానివ్వరు. అంతే నా! కానీ. నీమాట చెల్లే ఈ మలదకరూశ దేశాలలోని జనులంతా మమ్మల్ని నిందిస్తారుగాని వాళ్ళనీ నిన్నూ ఊరికే పోనివ్వను.

నా బొందిలో ప్రాణ మున్నంతవరకూ మిమ్మల్ని పీడిస్తాను. దారులుకొట్టి బాధిస్తాను. ప్రతీకారం చేస్తాను. నాయనా మారీచా!

మారీ : అమ్మా!

తాటక : నా ప్రతిజ్ఞ నెరవేరేటట్టు చూడు.

మారీ : అది నెరవేరకపోతే నా బ్రతుకెందుకమ్మా!

[వీళ్ళిద్దర్నీ తప్పించి — అంతా నిర్జనం అయింది. చీకటి పడింది. కుటీరాలలోంచి వేదపఠనం వినబడుతోంది.]

ప్రపన్నోహం శివాం రాత్రీం
భద్రే పారమశీ మహి
భద్రే పారమశీ మహి.

మారీ : రాత్రి తెల్లవారదా? వీళ్లు బయటకు రారా అప్పుడు చెప్తా వీళ్ళపని.

తాటక : (ఆగి) వేదగానం ఎంతబాగుందో విను.

[కుటీరంలోంచి వినబడుతుంది!]

నయస్యాః పారం దదృశేనయో
యువద్విశ్వ మస్యాం నివిశతే
యదేజతి| అరిష్టాసస్త ఉర్వితమస్వతి
రాత్రి పారమసీమహి - భద్రేపారమశీ మహి.

మారీ : అమ్మా! 'మేము భద్రంగా అవలిగట్టు చేరుకొందుము గాక' అని ప్రార్థిస్తున్నారు. వీళ్లు త్వరలో నే పరలోకానికి చేరుకొంటారు. చూడమ్మా—ఎవరో మునిబాలకుడు వస్తున్నట్టుంది. వాణ్ని అవలిగట్టుకు చేరుస్తాను.

[కెవ్వుమని కేక.]

తాటక : చేరుకొన్నాడు అద్దరి.

మారీ : పరలోకంలో నాన్న శాంతిస్తాడు. (ఆలోచించి) అమ్మా—ఈ మునిబాలుడు నాన్న ఉన్న చోటికి అవలీలగా చేరాడు. మనకా అదృష్టంకూడా లేదమ్మా!

తాటక : నిజమే నాయనా మనం అన్నివిధాలా దురదృష్టవంతులమే!

[గుడ్లగూబ అరుస్తుంది. కీచురాళ్ళు గీపెడుతున్నాయి. చీకటి చిక్కనైంది] — తెర

## వజ్రహస్తదేవుని బమ్మిడి శాసనములు


శ్రీ కర్జీ సాంబమూర్తిశాస్త్రి


అనంతవర్మయను బిరుదు నామముగల మూడవ వజ్రహస్తునిచే నీయబడిన యీ రెండు తామ్ర శాసనములు నరసన్నపేటకు తూర్పున 3 మైళ్ళ దూరమునగల "పెద్ద బమ్మిడి" యను గ్రామమున భూమిలో దొరికినవి. ఆ భూమి పాడుపడియుండి వ్యవసాయమున కనుకూలముగునట్లు త్రవ్వబడుచుండగా నొక మూర లోతున నొక కుండలో దొరికినవి. తామరాపల్లి గ్రామవాసులు విద్యాప్రియులు నగు కొద్దు రామన్న నాయుడు లక్ష్మీనారాయణ నాయుడు గార్ల వలన నాకు లభించినవి.

### శాసన స్వరూపము

ఈ శాసనములు ఐదేసి రాగిపట్టాలమీద చెక్కబడినవి ఒక్కొక్క రేకు పొడవు 8.4 అంగుళములు వెడల్పు 3.3 అంగుళములు. రేకుల యంచులదగ్గఱ గల రంధ్రములద్వారా 3.5 అంగుళముల వ్యాసముగల రాగి కడియము దూర్పించి రేకులు బంధింపబడినవి. ఆ ముద్రికపైని సమున్నతముగా నంది విగ్రహమును దాని ప్రక్కలందు చంద్రుడు నాగలి అంకుశము శంఖము మత్స్యమును పోతపోయబడినవి శాసనములు మొదటిపెడను ఆఖరిపెడను వ్రాయక విడువబడినవి. శాసనగ్రంథము పఠింపకుండుట కీనితి యుపకరించును. అంచులు గ్రంథమున్నభాగము కంటె యెత్తుగా దళసరిగా నుండుటచే రేకులరాపిడి వలన నక్షరముల కరుగుదల రాదు. దానిచేతనే పెక్కు శతాబ్దములు గడచినను నీ శాసనము లీనాడు చెక్కినట్లు స్పష్టముగా నున్నవి. శాసనములలిపి ప్రాచీన నాగరిలిపి దీనినే నందనాగరియనియు నందినాగరియనియు వ్యవహరింతురు. భాష సంస్కృతము గద్యపద్యాత్మకము.

### శాసన విషయము

శా॥ శ॥ 979 క్రీ॥ శ॥ 1057 సంవత్సరమున చైత్రమాసమున "వహ్మలి" (బమ్మిడిగ్రామమును) శా॥ శ 982 క్రీ॥ శ॥ 1060 మకరమాసమున "సనూర" మాఖ్యగ్రామమును బ్రాహ్మణులకు దానము చేయబడినవి. దత్తగ్రామములలో మొదటిదానిలోనున్న వహ్మలికి సరిపడు గ్రామములు చిన్నబమ్మిడి, పెద్ద బమ్మిడి, కోటబొమ్మాళి సంతబొమ్మాళి యను నాలుగు గ్రామములు కలవు. శాసనములేమో పెద్దబమ్మిడి గ్రామమున లభించినవి. గ్రామసీమలు చెప్పకుండుటచే నే గ్రామమో సరిగా నిర్ణయింప వలనుపడదు. అయినను ఈ గ్రామముననే యీ శాసనముతో గూడ లభించిన శాసనమునందలి సనూరమాఖ్యగ్రామము "జడూరు" అను పేర నీ పెద్దబమ్మిడికి అరమైలు దూరముననే కలదు కావున దత్తగ్రామము బమ్మిడిగానే నిశ్చయింపవచ్చును.

### విశేషములు

మూడవ వజ్రహస్తుడను నీ యనంతవర్మ మహారాజుచే దానము చేయబడిన శాసనములు ఇప్పటికి అయిదు బయలుపడినవి. శా॥ శ॥ 982 క్రీ॥ శ॥ 1060 కార్తికమాసమున శుద్ధ తదియ "శద్గాము" గ్రామము. శా॥ శ॥ 982 క్రీ॥ శ॥ 1060 ఉత్తరాయణ పుణ్యకాలమున "అవరెంగ" గ్రామము. శా॥ శ॥ 982 క్రీ॥ శ॥ 1060 కార్తిక శుద్ధ ద్వాదశిని "అరసవిల్లి" గ్రామము. శా॥ శ॥ 982 క్రీ॥ శ॥ 1060 మకరమాసమున "సనూరమాఖ్య" గ్రామమును దానమీయబడినవి. శా॥ శ॥ 979 క్రీ॥ శ॥ 1057 చైత్రమాసమున వహ్మలిగ్రామము దానము గావింపబడినది. ఈ శాసనమున తిథి తెలుపుటలో "నందాదనిధి" యని

కలదు. మూడవ అక్షరము దకారమున కర్థ మేదియు లేదు. నందాద్రినిధి యని కాని నాందాగ నిధియని కాని చెప్పుటకు బదులుగా తప్పు చెక్క బడినది. ఈయూహ సరియగుచో బమ్మిడిశాసన మిప్పటి కుపలబ్ధములలో మొదటిదనియు జడూరు శాసనము చివరిదనియు తెలియనగును.

ఈ శాసనము లన్నిటియందును వంశానుక్రమము వర్ణనశ్లోకములు గద్యములు కూడ ఆనుపూర్వికి తప్ప కుండ దానవిషయ ప్రారంభమువఱకు నొక్క రీతిగానే బమ్మిడి శాసనపాఠమును బోలియే యున్నవి. ఈ రెండుశాసనము లొక్క చేతితో నుత్కీర్ణములైనవే యని లిపియు చెప్పుచున్నది.

ఈ మహారాజు వియద్రసనిధి 960 శకాబ్దమున (క్రీ॥ శ॥ 1038 లో) పట్టాభిషిక్తుడైనాడు తన రాజ్య కాలము 19వ యేట నొకశాసనమును 22వ యేట నాలుగు శాసనములను చేసెనని మనమిప్పుడు తెలిసికొనుచున్నాము. ఈతని రాజ్యకాలమేమో ముప్పది మూడేండ్లని "తేనాకారి నికామకామ్యతను నా రాజ్యం మహీమండలే త్రింశద్వత్సర మాత్రమస్త్రి యశసాపార్ష త్రయే బాధికమ్" అను రాజరాజదేవేంద్రవర్మ కొడిలా శాసనమువలనను అనంతవర్మ చోడగంగుని శాసనముల వలనను తెలియుచున్నది. మూడేండ్లకాలములో నైదు శాసనములు చేసిన మహాదాత ముప్పది సంవత్సరములలో దానములను జేయ లేదా? చేసినను వని యుప లబ్ధములు కాలేదా యని సందేహ ముదయింపక మానదు. అనంతవర్మ చోడగంగుని కొర్ని శాసనముల వలన నీ సందేహమునకు సమాధానము లభించుచున్నది. కొర్ని శాసనములు రెండింటిలో మొదటిది నందనాగరి లిపిలో సంస్కృతభాషలో గద్యముగాను, రాజ రాజానంతవర్మ వర్ణనములు మూడు శ్లోకములతోడను కలదు. రెండవ శాసనము అనేక శ్లోకములతోడను స్వల్ప గద్యముతోడను సంస్కృతభాషలో తెలుగు కన్నడ లిపిలోను నున్నది. మొదటి శాసనము చోడ గంగదేవుడు ఖోన్న గ్రామము శకవర్షములు 1003 కాగా మీనమాసమందు బహుళ పంచమీ ఆదివార మున నానాగోత్రముల బ్రాహ్మణులు మూడువందల మందికి దానము చేసినది. రెండవదియు 1003 మీన మాస బహుళ పంచమీ ఆదివారమున నానాగోత్రముల బ్రాహ్మణులు మూడువందలమందికి చోడగంగుని పితామహుడైన వజ్రహస్త దేవునిచే ఖోన్న గ్రామము దానమీయబడగా దానికి అక్కడ గార గ్రామమందు చేరి ఉన్న ముండపల్లు గ్రామమునకు సమీపంత ముగా తూలువు గ్రామమునుండి కొంత విడదీసి 88 పరిమితమయిన క్షేత్రములను ఖోన్న గ్రామ నివాసులకు శక 1034 వత్సరములు కాగా ఉత్తరాయణ పుణ్య కాలమున చోడగంగునిచే దానమీయబడినది. మొదటి శాసనము వజ్రహస్తుని యితర శాసనములవలె లిపి, పరిమాణము, కవితలలో సమానముగానే యున్నది. మహా భాయస్తునున్న సంధి విగ్రహీమాపురయ మానుకు దామోదరునిచే లిఖితము. మహాత్మశాలి వల్లే మోజాచే నుత్కీర్ణము. వజ్రహస్తదేవుని శాసనములు కొన్నింటిలో కావ్యకర్తపేరు ఉత్కీర్ణకుని పేరును లేవు. బోడపాడు శాసనమున మహాకాయస్థ సంధి విగ్రహీమాపురయ సూనునా దామోదరేణ లిఖితం మహాత్మశాలి నుంకమాజ సూనునా వల్లే మోజేన ఉత్కీర్ణితం అని కలదు. దీనిని బట్టి మాసె వజ్రహస్తుని శాసన గ్రంథ రచయిత ఉత్కీర్ణకులే కొర్నిశాసన గ్రంథ రచయిత ఉత్కీర్ణకులని స్పష్టపడుచున్నది. మఱియు కొర్ని మొదటిశాసనము అనంతవర్మ చోడ గంగునిచే స్వయముగ ఖోన్న గ్రామము దానము చేయ బడినట్లు చెప్పుచున్నను రెండవ శాసనము వజ్రహస్త దేవునిచే మొదట త్రిశత బ్రాహ్మణులకు దానమీయ బడిన దానికే పరిసరమునమున్న తూలువు గ్రామము నుండి 88 పరిమితమైన భూమిని కలిపి ఖోన్న గ్రామ వాసులకు దానము చేయబడినదని చెప్పుచుండుటచే ఖోన్న గ్రామము మొదట వజ్రహస్తునిచే దత్తమయి నదియే యని తెలియుచున్నది. కాని యీ దానము తెలుపునట్టి వజ్రహస్తుని శాసనము మన కుపలబ్ధము కాలేదు.

ఇప్పుడు మఱియొక చిక్కు విడదీయవలసి యున్నది కొర్ని మొదటిశాసనము ననుసరించి అనంత వర్మ చోడగంగునిచేతను, రెండవ శాసనము ననుస రించి అతని తాత వజ్రహస్తునిచేతను; అందు నా దానము పారనయనవియద్గగన చంద్రగణిత 1008 శకా బ్దమున నీయబడుట సంభవము కానేరదు. వజ్రహస్త దేవుడు శక 960 మొదలు 33 సంవత్సరములే రాజ్యము చేసినట్లు అతని కుమారుడు రాజరాజ దేవేంద్రవర్మ కొడిలా శాసనమున్నను అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని రెండు శాసనములందును నరసింహదేవుని కెందు పట్నపు తామ్రశాసనమునను గూడ స్పష్టముగాగలదు.

గ. తతః కామార్ణవాదైవ్యగుంబావ్యయ సముద్భ
వాయాం వినయ మహాదేవ్యాం జాతః శ్రీ వజ్ర
హస్తవో యోంది (14) తఃపరింతి మతిభిమణ
మణినిం శస్త్రాభిజఘానస్త్రయస్త్రింశత మబ్దకా
వవని మపాలయత్ ||

(అనంతవర్మ చోడగంగదేవుని మొదటి కోర్ని శాసనము).

గ|| తతస్తదీయవంశ్యో వజ్రహస్తస్త్రయస్త్రింశత
మబ్దకాన్మహీ ముదవహత్ తస్యవర్ణనే శ్లోకాః||

శ్లో|| వాత్యస్త్రే గంగకులోత్తమస్య యశసా దిక్చక్రవాలే
శశి | ప్రరోహితా మలి సేవయస్య భువన ప్రహ్లాద
సంపాదినా | సిందూరైరతి సాంద్రపంకపటలైః
కుంభస్థలేపట్టకే | హ్వాలింపంతి పునః పునశ్చ
హరితా మాధోరణా వారణాన్||

శ్లో|| అనురాగేణ రజనీ యస్యశత్ ముఖాబ్జయోః
ఆసీ చే శ్రీ సరస్వత్యౌ వనుకూ వేదిరాజతః||

శ్లో|| వనామతః కేవల మద్ధతోపి స వజ్రహస్త శ్రీ
కలింగనాథః | కో వజ్రహస్తాదపరః పృథివ్యాం
వజ్రం పతిద్వారయితుం సమర్థః||

(అనంతవర్మ చోడగంగదేవుని రెండవ కోర్ని శాసనము.)

నరసింహదేవుని కెంచుపట్న తామ్రశాసనమందు.

శ్లో. శాస్త్రార్థ నిశ్చితమతిర్ద్విపదంతికారి
సర్వార్థివర్గ పరితోషణ హేతువర్గః
ఆచారతోపి మునిపుంగవ మార్గచారీ
తస్మాదభూన్నృపవరో భువివజ్రహస్తః.

అను శ్లోకమును, దాని తరువాతి వనా మతః వాత్యస్త్రే గంగ కులోత్తమస్య అను శ్లోకములును గలవు. పై గ్రంథములవలన వజ్రహస్త మహారాజు గగనమునుండి పడుచున్న పిడుగును శస్త్రికచే వారించినట్లు తెలియుచున్నది. పై విషయము సాధారణముగా రాజుల వర్ణనములవంటి పొగడికలు కాక యథార్థవిషయమే యనుటకు గొన్ని ప్రమాణములు కలవు.

ముఖలింగాలయమునను, పార్వతీపురము తాలూకాలోని నీలకంఠేశ్వరాలయమునను వజ్రహస్త దేవుని శిలాప్రతిమలు గలవు. ఎడమ మోంగాలు కొంచెము వంచి నిలిచి యారోహకున కారోహణ సౌకర్యము కలిగించు నొక యేనుగును, దాని నడుమభాగమునకు సరిగా కుడిచేతి గొప్ప నిస్త్రింశమును చేల వాని అర్థవలయముగా త్రిప్పబడిన కుడిచేత నొక చిన్నబల్లెమువంటి ఆయుధమునుదాల్చిన కిరీటధారి యగు ఉన్నత పురుషవిగ్రహమును గల ఆ ప్రతిమలు మూడవ వజ్రహస్తదేవునివే యని శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు శ్రీ గోపవర్తి రామదాసుగారు మొదలగు చారిత్రికులు నిర్ణయించిరి. కుడిచేత దాల్చిన ఆయుధము ఇది యది యను పేర నిర్ణయింప ననువుగా లేదు. అదియే పిడుగు వసించిన శస్త్రిక కావచ్చును. అరసవిల్లి సూర్యాలయమునందును గోడలో నొక గజారూఢుడు వాయుపాణియు నగు పురుషుని శిలావిగ్రహము గలదు. వజ్రపాణి యగు దేవేంద్రుని ప్రతిమ యని యా స్థలవాసులందురు. ఆ సూర్యదేవుని దేవేంద్రుడు ప్రతిష్ఠించెనని యు చెప్పుదురు. ఆ పురాణగాథను మనము చారిత్రికాంశముగ గ్రహించిన నా ప్రతిమ వజ్రహస్త దేవునిదనియు నాతడు చేల బట్టిన ఆయుధము వజ్రము కాక వజ్రమును వారించిన శస్త్రిక యనియు తెలియగును. వజ్రహస్తదేవుడే యరసవల్లి గ్రామమును దేవాలయపరిచారకుల కిచ్చినట్లు శాసనము కలదు కదా? కావున నా ప్రతిమవలనను అశని నిరాసము తెలియుచున్నది.

ఈ యశనిపాతము తదభిఘాతము నెక్కడ జరిగినవనుటకు శాసనాధారములుగాని గ్రంథాధారములుగాని కానరావు. ఐనను ప్రబలమగు జనశ్రుతి యొకటి మహేంద్రగిరిప్రాంతమున గలదు. కలవుగడా మండపాకొండ (మహేంద్రము) పైని గోకర్ణేశ్వరాలయము మొదలగు దేవాయతనములు అక్కడి పంచపాండవులచేతను, కుంతీ ద్రౌపదులచేతను నిర్మింపబడిన ఆలయములును ప్రతిష్ఠింపబడిన శివలింగములును గలవు. అవి పాండవులచే నిర్మింపబడిన ఆలయములనో కావో కాని ఇటుకలు, సున్నము, కలప, లోహము ఏవియు లేక మలచిన పెద్దపెద్ద రాతిపలక లొకదానిపై నొకటిగా పేర్చబడిన కేవల శిలామయములు. వానిలో నొకదానిపై నొకప్పుడు పిడుగు పడగా నొక మహారాజు దానిని వారించెనట. అంతట నాలయము భగ్నము కాక యథాపూర్వస్థితిలోనే నేటికిని నిలచియున్నది. ఆ ఆలయోపరిభాగమున నా పిడుగుపాటును సూచించుచు సూర్యకాంతి ప్రసరించు చిన్న పగులుమాత్రము కలదు. ఇది ఇక్కడి కింవదంతి. మునిమార్గచారి యగు నా రాజన్యుడు తపఃప్రభావముగలవాడో ద్విపదంతికారియగు నా రాజ కంఠీరవుడు శస్త్రాభిఘాతమునకో యశనిని వారించుట మాత్రము నిక్కమే యైయుండును. ఆ రాజన్యుడు సుప్రసిద్ధ యశోవిభూషితుడగు మన వజ్రహస్తదేవుడే యని వేరుగ దెలుప నక్కఱలేదుగదా? ఇంకను భూగర్భమున వసించియున్న శిలా తామ్రశాసనము లదృష్టవశమున దృష్టిగోచరములగుచో నింకనీ మహారాజు విషయమునను నితర మహాప్రభువుల విషయమునను నెట్టి వింతలు ప్రకటములగునో!

# ఏరువ రాజ్యము

## శ్రీ కొత్త భావయ్య చౌదరి

ఏరువనాడు, కడప కర్నూలు జిల్లాలయందిప్పుడు చేరియున్నది. కోడూరు, పొత్తపినాటి కరికాలాన్వయ తెలుగు చోళరాజులును కమ్మనాటి తెలుగు చోళరాజును 12 వ శతాబ్ది ప్రాంతమున తూర్పు చాళుక్య చక్రవర్తులకు సామంతులై పాలించుచుండగా, నీ యేరువనాటి తెలుగు చోళరాజులు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు విధేయులై పాలించుచుండిరి. వీరుగూడ కరికాలాన్వయులే.

క్రీ. శ. 1121 సం॥ ప్రాంతమున నీ ఏరువ రాజ్యమును ఏరువ తొండయరాజను మహామండలేశ్వరుడు పశ్చిమ చాళుక్య త్రిభువనమల్ల బిరుదాంకితుడగు ఆరవ విక్రమాదిత్య చక్రవర్తికి సామంతుడుగా పాలించుచుండెను. ఆ కాలములో తూర్పు చాళుక్య రాజులు బలహీనులైయున్న సమయము గనిపెట్టి తొండయరాజు మున్నగు సేనానుల బంపి యితడు ఆంధ్రరాజ్యములో చాల భాగ మాక్రమించుటయే గాక, తూర్పు చాళుక్య చక్రవర్తుల సామంతులగు వెలనాటి చోడరాజులను గూడ లోబరచుకొనెను. గాని యిది దాదాపు 17 సం॥లు మాత్రమే సాగెను. తర్వాత మరల నది తూర్పు చాళుక్యులకే లోబడెను— ఇది దాదాపు 1136 లో ననవచ్చును. ఏరువ తొండయరాజు కాలములో బహు పరాక్రమవంతుడై యుండి ద్రాక్షారామము వరకును బోయి రాజ్యమును జయించియుండెను. ఈయన క్రిందనే గాజోలు అరపల్లి నాయకులు సేనానులై యుండుటగాయేక, ఏరువ తొండని దక్షిణ భుజాదండములని పేర్వడసి యుండిరి. అల్లే పెంపాలివారు, కొమరపల్లివారును ఏరువ రాజ్య మూల స్తంభులని పేరొందిరి. అలఘుదర్ల పద్మనాయకులు, ఏటుకూరి నాయకులు గూడ నీ యేరువ రాజ్యము క్రిందనే నాయంకరములు గల్గియున్నట్లు వారి ప్రశస్తులవల్ల తెలియబడుచున్నందున నా కాలములో ఏరువరాజ్య మెట్లు విస్తరించి ప్రతిభావంతముగనున్నదో తెలియవచ్చును. ఇట్టి నాయకుల ప్రజ్ఞాబలవిశేషములవల్లనే పల్లవరాజొకడు యుద్ధమునకురాగా వీరిచే జయింపబడెనట. అందుచే వారికి ఏరువరాజ్యస్థాపనాచార్య బిరుదముగూడ గరించిరి.

తొండయరాజు మహాదేవియగు మైలమదేవి శ్రీ భీమేశ్వరాలయమున నొక దానము గావించి, చా. వి. 46 సం॥ లో నొక దానశాసనము వ్రాయించెను.

పశ్చిమ చాళుక్య చక్రవర్తి తైలపదేవుడు చనిపోయినపిమ్మట ఆంధ్రదేశమునందలి దక్షిణభాగమును జయించుటకై కాకతీయ గణపతిదేవ చక్రవర్తి 1195 ప్రాంతమున ప్రయత్నించి కృతకృత్యుడయ్యెను. అప్పుడే యేరువ రాజ్య మాయనకు లోబడెను. 1260-95 సం॥ల మధ్య కాకతీయ రాజ్యము రుద్రమదేవి పాలించెను. ఆ కాలములో నీ యేరువ రాజ్యమును పాలించిన రెండవ తొండయరాజు మల్లిదేవచోడులు స్వతంత్రులగుటకు ప్రయత్నించిరి. అప్పుడు రుద్రమదేవి సేనానులగు గోన గన్నారెడ్డి అంబయదేవుడు నిడిమాని నాయకులు దండయాత్రసలిపి, తొండయరాజును యుద్ధమున సంహరించి తిరుగుబాటును అణచినైచిరి గాని వారిరాజ్యము హరించినట్లు కనబడదు. తర్వాత భీమరాజను నతడు దీనిని పాలించుచుండగా పట్లలచెర్ల సేనానాయకుని బంపి యాతని సప్తాంగములు హరింపబడెనట.

కాకతీయ వీరప్రతాపరుద్ర చక్రవర్తి యీ రాజ్యమును గూడ తన సేనాధిపతులలో నొకడగు జుట్టయలెంక గొంకారెడ్డి పాలనలోనుంచి యేరువ వారిని తొలగించినట్లు కనబడుచున్నది. ఇది దాదాపు 1303 ప్రాంత మనవచ్చును. భీమరాజునకు ప్రోలాంబ యను భార్యవల్ల "సాహిత్య నారాయణ" బిరుదాంకితుడగు దామరాజు జనించినట్లు రెండవ అన్నదేవ చోడుని తామ్రశాసనములో చెప్పబడుటవల్ల నాతడు వీరప్రతాపరుద్రునికి లోబడి యొక సామంతసేనానిగా వ్యవహరించె ననవచ్చును గాని రాజ్యాధిపతిగా నున్నట్లు కానరాదు.

దామరాజునకు లక్ష్మీదేవి యను సతీమణియందు సోమరాజు జనించెను. ఈతని కాలములోనే 1323 లో తురుష్కులు ఆంధ్రభూమిని ఆక్రమించుటకై ప్రయత్నములు సల్పుచుండిరి. 1336 సం॥వరకు తురుష్కులాంధ్రభూమిని ఆక్రమించి, నానావిధముల ప్రజలను బాధించి, యనేక దుర్మార్గముల గావించి పాలించుచు వచ్చిరి. ఈ కాలములోగూడ నీ యేరువప్రాంతము వారికి లోబడియుండును.

ముసునూరి కాపయ, ప్రోలయ నాయకుల యద్వితీయ ప్రతిభావిశేషములవల్ల ఆంధ్రదేశములోని నాయకులందరేకమై మరల యుద్ధములు సాగించి ఆంధ్రదేశమును మహమ్మదీయుల బారినుండి విముక్తి గల్గించిరి. ఏరువ రాజ్యమూ సేనానులలో అనపోతారెడ్డి క్రిందకు వచ్చె ననవచ్చును. సోమరాజునకు సూరాంబవల్ల జనించిన అన్నదేవ చోడుడు అతని సామంతుడుగా నుండియుండును. ఈయనకు "అరిగండరగండ" యను బిరుదమున్నట్లు చెప్పబడినది. ఈయనకు ఇరుగాంబవల్ల భక్తిశ్వర చోళుడు జన్మించెను. ఈతడుగూడా అనపోతారెడ్డి కాలములోనే యొక సేనాధికారిగా నుండెను.

## భక్తీశ్వర చోడుడు

ఈతడు తన పూర్వ రాజ్య సంపాదన కొరకై కాళోలు వెలమ ప్రభువు (దేవరకొండ) అనపోతానాయని సహాయముతో అనపోతారెడ్డి నెదిరించి వారికి జరిగిన యుద్ధములో అనపోతానాయనికి సాయపడెను. సూరవరం వద్ద జరిగిన యొక యుద్ధములో పెరొన్న పోతారెడ్డి జయింపబడెను ఇది 1369 లో జరిగెను. భక్తిరాజు గుల్బర్గపాలకుడగు ఫిరోజిషాహాను గూడ మెప్పించి, వేమగిరి I రాజు సహాయమును గూడ తీసుకొని కొండపురిలో నూతన రాజ్యమును స్థాపింపగలెను. ఈ స్థాపనము దాదాపు 13?6 లో జరిగి 1378 వరకు జరిగియుండెనని కొందరు చరిత్రజ్ఞుల విశ్వాసము. ఈ భక్తీశ్వరచోడుడు తన కుమారుడగు భీమరాజునకు అన వేమారెడ్డికుమార్తెను వివాహము గావించి రాజ్యమును స్థిరపరచుకొనెను. ఈతడు చిన్నతనమున ననేక యుద్ధములందు పాల్గొనెను. పాంచధార్ల వద్ద గజపతిని, ధరణిపాడువద్ద సింగభూపతిని, పెదకొండవద్ద దిలర్ ఖాన్ మున్నగువారిని, సూరవరం వద్ద పెరొన్న పోతుని (కుమారగిరికొడుకు), అత్తిలివద్ద యితర శత్రువులను, కొండపల్లివద్ద కర్నాటక సైన్యమును (విజయనగర రాజు) జయించెనట. ఈయన అన్నమాంబను రాణివల్ల అన్నదేవుడు, భీమరాజను యిద్దరు తనయుల గాంచెను. ఇతడు కొన్ని అగ్రహారములను వేద బ్రాహ్మణుల కొసంగి పేరందెను కంచెకొలను, చెరువావాడు, ఆత్మకూరు, ఆముదాలపల్లి యనునవి అగ్రహారముల గ్రామములు—1405 లో నితడు మొదటి యగ్రహారము నిచ్చెను—భక్తీశ్వరచోడుడు చనిపోయినంతనే రెడ్డిరాజుల బంధువుడగు భీమరాజు రాజ్య మాక్రమించి పాలింప నారంభించెను. ఈతని పాలనము కొద్దికాలమే జరిగెను. సోదరుడగు అనదేవ చోడుడు రాజ్యభాగము గోరుచున్నను, అతని కోరిక నిరాకరించుటవల్ల నీ యిరువురకును వైరము హెచ్చెను—భీమరాజునకు అన వేమా రెడ్డియు, దర్శిని వచ్చిన రెడ్డిరాజులును సాయపడుచుండిరి. అనదేవ చోడుడు వెలమ ప్రభువు వేసగిరి నాశ్రయించి, గుల్బర్గ రాజగు ఫిరోజిషా సాయమునుగూడ దీసుకొని యనేక యుద్ధములు జరిపి, చివరకు రాజ్యసిద్ధి కొర మొనర్చెను—ఈ వెలమ రెడ్డి ప్రభువుల జరిపిన యుద్ధములలోనే అన వేమారెడ్డి, మరొక యుద్ధములో కాటయ వేముడు చనిపోయిరి. అనదేవ చోడుడు 1388 సం॥ మొదలు కొండపురి రాజధాని జేసుకొని పాలింపజొచ్చెను—

## రెండవ అనదేవ చోడుడు

భీమరాజు కుమార్తె వేమాంబికను అల్లాడరెడ్డి పెండ్లాడియుండెను. అందుచే నీతడనదేవచోడుని రాజ్యమును హరించుటకై ప్రయత్నించుచుండెను. కాటయ వేముని సైన్యమును తన యాధీనములోనికి దెచ్చుకొని చివర కితడు 1417 లో గొప్ప యుద్ధమును సాగించి అనదేవచోడుని జయించి, సంహరించి రాజ్యమును రాజమహేంద్రవర రెడ్డి రాజ్యములోనే గలిపివైచెను. అనదేవచోడుడు వినవాడులో బ్రాహ్మణుల కొక యగ్రహారమిచ్చెను. ఈయన దానశాసనములు 1388, 1413, సం॥ ముల నాటివి త్రిపురాంతకము పాలకొల్లు గ్రామములలో కనబడుచున్నవి.

ఈ అనదేవచోడుడు పిన్నంశెరాజు సోదరి యగు యిక్షుగాంబికా సతీమణివల్ల వీరభద్రరాజను కుమారుని గాంచెను. అతడుగూడ 1417 లో జరిగిన యుద్ధములో పాల్గొని యందే మృతినొందినట్లు కనబడుచున్నది. అప్పటినుండి నీ యేరువవంశీకుల రాజ్యమును, వంశమును తిరిగి తలయెత్తలేదు—భీమరాజు రెడ్డిరాజుల సేనాధిపతిగా మెలంగుచు ననేక యుద్ధములలో పాల్గొనుచు ప్రసిద్ధివహించినట్లు కడపజిల్లా తాళ్ళ ప్రొద్దుటూరు శాసనమువల్ల దెలియుచున్నది. ఈతడు విసరనాడు దక్షనాట్యము, మన్నియములు, వేంగి, కళింగ మున్నగు దేశములన్నియు నొక్క నాడే తురగారూఢుడై దాటించెనని యందు చెప్పబడినది—ఈతడు ప్రత్యేక రాజ్యమును పాలించుటకు ప్రయత్నించినటు కనబడదు. ఇతడు చివరవరకు అల్లాడరెడ్డివద్దనే సైన్యాధికారిగా నుండెను. ఏడవ వంశములో సింగరాజను నతడు కమ్మనాటిలో నొక అధికారిగా నుండెను. ఈతని కాలము సరిగా దెలియుటలేదు. ఈతని కుమారుడగు కేశవరాజు అమరావతిలో నొక శాసనము వ్రాయించుచు తన వృత్తిలోని చిలువూరు గ్రామభూమిని కొంత దేవునకు దానమిచ్చినట్లు వ్రాసియున్నాడు. ఈ వంశీకులు కమ్మవారిలో కలిసిపోయియుందురు. 1657 ప్రాంతమునకు రెడ్లలో కలిసిపోయిన యేరువవంశీకులు కొందరు కనబడుచున్నారు. పేరారెడ్డి, జంగంరెడ్డి, కొండారెడ్డి, వేంగన, తిమ్మారెడ్డి మొదలగువారు కనిగిరి తాలూకా కూటకుంట్ల గోపాలస్వామిదేవళము పునరుద్ధరించిరి.

# గ్రంథవిమర్శనము

## పాణినిసూత్ర వ్యాఖ్య

శ్రీ మణలూరి వీరరాఘవాచార్య విరచితము: ప్రథమద్వితీయ సంపుటములు (నాగరలిపి) ఉదాహరణ శ్లోక సమంచితము: మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రచురణ: ప్రథమ సంపుటము: వెల: రు. 18-12-0. ద్వితీయ సంపుటము వెల రు. 18/-

పాణిని సత్యప్రజ్ఞమగు అష్టాధ్యాయిని వార్తిక రచనముచే వరరుచియును, భాష్యరచనముచే పతంజలియును, ఉపబృంహితి మొనర్చిరి. అష్టాధ్యాయియందు పాణినిమునిచే నిర్దిష్టమైన సూత్రక్రమము సూత్రీకృతములు నితర శాస్త్రములయందుకంటె విలక్షణముగ వ్యాకరణ శాస్త్రమునందు బహుళ ప్రయోజనములను సాధించుచున్నది. కావున యథోపదిష్టముగ వ్యాకరణము వ్యాఖ్యానము చేయుట ఛాత్రులకు విధియైనది. సూత్రరాశి యంతయు ముఖస్థముకాక శాస్త్రము, లబ్ధావకాశము కాని ఆ ప్రాచీనాధ్యయన పద్ధతి, ఛాత్రుల ధారణాశక్తిని, శాస్త్రపరిజ్ఞాన సౌష్ఠవమును, రక్షించికొనుచు వచ్చినది. అష్టాధ్యాయికి సూత్రక్రమముగ 'కాశికావృత్తి' వంటి వ్యాఖ్యలు వెలయింపఁబడెను. క్రమసహిష్ణువైన కాలము గతించినది. సుఖాభిలాష పెరిగినకొలఁది మనీషాపాటవము సడలుట సహజము. పరిశ్రమాలసులగు ఛాత్రుల యుపయోగమునకు భట్టోజీ దీక్షితులు అష్టాధ్యాయిని ప్రకరణానుసారముగ విభాగించి 'సిద్ధాంత కౌముది' అను వృత్తిని రచించిరి. సంజ్ఞాపరిభాషలు, సంధులు, శబ్దాధికారము, అవ్యయములు, స్త్రీప్రత్యయములు, కారకములు, సమాసములు, ఏకశేష విధులు, తద్ధితములు, క్రియలు, కృత్తులు— సువిభక్తములై వర్గీకరింపబడుట వలన వ్యాకరణ తీర్థము సులభావగాహమయినది. నాఁటినుండి యాసేతుశీతాచలము వ్యాకరణాధ్యేతలకు 'కౌముది' కామధేనువువలె నున్నది. కాలక్రమమును బట్టి నేఁటికి కౌముదికూడ దురవగాహమనిపించు స్థితి వచ్చుచున్నది.

శాస్త్రపాఠము—సూత్రపదవిభాగ, తదర్థవర్ణన, ఉదాహరణ ప్రదర్శన, ప్రక్రియాకథన, దళప్రయోజన విచారాదికముతో గహనమై శాస్త్రవాసనావాసిత బుద్ధులగు నుత్తమాధికారులను కొందఱను విడిచినచో, సామాన్యముగ సుకుమారబుద్ధుల యాభిముఖ్యమును గడించికొనుట యరుదు. కావుననే లక్షణపరిజ్ఞానము చాలని సాహిత్యపరులును, లక్ష్యపరిజ్ఞానము చాలని వైయాకరణులును, ఏర్పడుట తటస్థించుచున్నది. లక్ష్యపరిజ్ఞానసహకృత లక్షణపరిజ్ఞానముతో నైకకాలికముగ ఛాత్రులను వ్యుత్పన్నులను జేయఁగల పాఠక్రమమును, దేశికులును నేఁడు మృగ్యులగుచున్నారు.

మణలూరి వీరరాఘవాచార్య విరచితమగు ప్రకృత గ్రంథసరణిని పరిశీలించినచో ఈ యనర్థమును గొంత నివారించునదివలె తోఁచుచున్నది. భట్టోజీ దీక్షితులు చేసిన 'సిద్ధాంత కౌముదీ' రూపమగు పాణిని సూత్రవృత్తికి కావ్యములనుండి యుదాహరణములను వివరణములను కూర్చుటలో నీగ్రంథము 'పాణిని సూత్రవ్యాఖ్య' గ రూపొందుచున్నది. ఇందు రామాయణము, రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము, శిశుపాలవధ, నైషధము అనర్ఘ రాఘవము, భట్టికావ్యము, ఉత్తరరామచరితము, భోజచంపువు, భారతచంపువు, భోజచరిత్రము, విశ్వగుణాదర్శము, వల్లీపరిణయచంపువు, యామునముని స్తోత్రరత్నము, సుభాషితత్రిశతి, సున్నపాణిజము— ఈ గ్రంథములనుండి పుష్కలముగ లక్ష్యరాశి స్వీకరింపఁబడినది. ఇందు సంజ్ఞాప్రకరణ సంధిత్రయ శబ్దాధికారావ్యయప్రకరణములకు వ్యాఖ్య దొరకలేదని ప్రకాశకులు తెలుపుచున్నారు. ఉదాహృతములగు కావ్య శ్లోకములు హృదయరంజకములగుటచే పాఠసమయమునందలి సూత్రతాత్పర్య దళప్రయోజనాదిక శాస్త్రవిచార పరిశ్రమమును మఱపించి యనాయాసముగ లక్ష్యావబోధమును గలిగించుట ఈ వ్యాఖ్యాప్రయోజనము. అనాయాస లక్ష్యావబోధముచే లక్షణపరిజ్ఞానము పరినిష్ఠితమగును. సిద్ధాంత కౌముదికి ఆంధ్రానువాదములును వచ్చినవి. దేశిక నిరపేక్షముగ నిసర్గకఠినములగు శాస్త్రవిషయములు భాషామాత్రపరివర్తనముచే తేటపడునవి కావు.

సంస్కృత వ్యాకరణాధ్యయనమును - అట్టి భాషానువాద గ్రంథములకంటె లక్ష్యప్రధాన

దృష్టిచే నిబంధింపఁబడిన యిట్టి గ్రంథములే, సుకరము సేయఁగలవని నిశ్చితముగ చెప్పవచ్చును.

ఉదాహరణ శ్లోకములలోని లక్ష్యములు గుర్తించుట కనువుగ పెద్ద యక్షరములలో ముద్రింపఁబడినవి.

సూత్రములకు, వార్తికములకు, ఉదాహరణ శ్లోకములకు, ఉదాహృతపదములకు - విడి విడిగ నీయఁబడిన అనుక్రమణికలు ఈ గ్రంథమును అధ్యయనాధ్యాపన వేళలయందు సులభోపయోగమునకుఁ దెచ్చుచున్నవి.

## పురుషార్థ సుధానిధి

శ్రీ సాయణాచార్య విరచితము; మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రచురణ: వెల 14-0-0.

పరిణామ దుఃఖమగు జగత్తులో పురుషునిచే శ్రేయస్సాధనములుగ సంపాదింపఁదగినవి పురుషార్థములు. ధర్మార్థ కామ మోక్షములని పురుషార్థములు నాలుగు. అర్థ కామములు లౌకిక శ్రేయస్సాధనములని, ధర్మమోక్షములు అలౌకిక శ్రేయస్సాధనములని, స్థూలముగఁ జెప్పవచ్చును. ప్రవృత్తియందు కామమునకు అర్థము సాధనము. నివృత్తియందు మోక్షమునకు ధర్మము సాధనము. అర్థము కామమునకు వలె ధర్మమునకును సాధనము. ధర్మావిరుద్ధమయిన కామమునకు పురుషార్థ ప్రతిపత్తి కలదు. మనీషుల యాచరణమునందు, అర్థ కామములు రెండును ధర్మమునందే పర్యవసించునని మహాకవి సూక్తి. దుఃఖనివృత్తి ద్వారమున ఆత్యంతిక శ్రేయోరూపమగు మోక్షమొక్కటియే నిజమునకు పురుషార్థమని చెప్పఁదగినది. తత్సాధన మగుటచే ధర్మమును, ధర్మమునకు సాధనమగుటచే అర్థమును పురుషార్థ వ్యపదేశము నందినవి. అలౌకిక పురుషార్థోపాయమును దెలియుటకు సాధనము కాన శ్రుతికి వేదమని వ్యవహారము (వేత్తి అనేన ఇతి వేదః).

'ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే
ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా'

వేదము లనంతములు 'అనంతా వై వేదాః' నానా శాఖోపబృంహితములు. విప్రకీర్ణ ధర్మోపదేశములును. కాన నిర్ణయపర్యవసాయియైన బోధము కలుగుట అరిదియని పరమ కారుణికులును అతీంద్రియ ద్రష్టలునగు మను వ్యాస ప్రభృతులు ధర్మశాస్త్రేతిహాస పురాణ రూపమున వేదార్థములను వివరించిరి.

'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్
బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరేదితి'

పూర్వోత్తర కాండములుగ విభాగింపఁబడిన వేదముయొక్క పూర్వ భాగమునందలి యర్థమును ధర్మశాస్త్రములు ప్రకాశిత మొనర్చుచున్నవి. ఇతిహాస పురాణము లుత్తర భాగమునందలి వేదాంతార్థములను వివరించుచున్నవి.

సామాన్యముగ విషయమును తత్త్వ మాత్రముగ నుపన్యసించినచో నది వినుట కింపు గలిగింపదు. మనస్సుయొక్క అంతరాళమును ప్రవేశింపదు. సుఖావబోధమునకయి సముచిత దృష్టాంతములుగ విహితానుష్ఠానమువలన నిట్టి యిష్టావాప్తియని, తదితరము వలన నిట్టి యనిష్టావాప్తియని, పూర్వ వృత్తాంతములను ప్రదర్శించినచో శ్రోతల కాభిముఖ్యమును శ్రద్ధయును గలుగును. ఇతిహాస పురాణ రచనల తాత్పర్యమిది.

ఆ పురాణములును పదునెనిమిది. ఒక్కొకటి సహస్ర సంఖ్యా పరిమితము. వానివెంట నుపపురాణములును గలవు. వీని సమగ్ర పరిశీలనము, తాత్పర్య నిర్ణయము, ప్రతి యొక్కనికిని సాధ్యము కాదు. దీనిని పర్యాలోచించి వేదభాష్యప్రణేతయగు శ్రీ సాయణాచార్యులు సామాన్య జనానుగ్రహమునకయి పురుషార్థస్వరూపము విశదమగునట్లు భారతమునుండి పురాణములనుండి ఉపాఖ్యానములను క్రోడీకరించి 'పురుషార్థ సుధానిధి' అను పేర ఈ మహాగ్రంథమును నిబంధించిరి. విజయనగర రాజ్యమును స్థాపించిన బుక్కరాయల ప్రార్థనపై విద్యారణ్య మాధవులు తమ సోదరుఁడగు సాయణాచార్యుల నీ కార్యమునందు నియోగించినట్లు ఈ గ్రంథమున కలదు.

సాయణాచార్యులు గ్రంథరచనోద్దేశ్యమున కనురూపముగ పురాణములనుండి ప్రసక్తములైన యుపాఖ్యానముల నే గ్రహించెను. విస్తృతములైనవానిని సంగ్రహించెను. అప్రసక్తాంశములను విడిచెను. అధ్యాయముల మొదట నిరూపింపఁదలఁచిన ధర్మమును, తదాచరణ పరిహాణములవలని యిష్టానిష్టముల నవశ్యంభావ్యతను ప్రతిజ్ఞచేసి, ఉదాహరణముగ నుపాఖ్యానమును ప్రదర్శించి, అధ్యాయాంతమున విహితానుష్ఠానబోధమును సుప్రతిష్ఠిత మొనర్చెను. ఈ పద్ధతి హృదయంగమముగ నున్నది. అధ్యాయాద్యంత శ్లోకములను విడిచినచో నిది పురాణములనుండి కూర్చిన సంకలనగ్రంథము. ఈ సంకలనములో మొత్తము పురాణములలో పురుషార్థములకు సంబంధించిన ఉపాఖ్యానములన్నియుఁ జేరినవి. ఈ గ్రంథమును జదివినచో ఈ దృష్టితో మఱి పురాణములను జదువ నక్కఱలేదు. ఇది తెనుఁగులో వచనరూపమున అనువదించికొనఁదగిన ఉత్తమ గ్రంథము. ధర్మస్కంధమున నలుబదిరెండు, అర్థస్కంధమున నిరువది

మూలము, కామస్కంధమున పదమూలము, మోక్ష స్కంధమున పంచోపనిషత్తులుగా మొత్తి మిది శతాధ్యాయ పరిమితము.

పరిష్కరణములో కొన్ని దోషముల అసాధు పాఠములను గ్రంథమునందు సాధు పాఠములను దిద్దవలెను జేర్చిరని చెప్పవలసి వచ్చుచున్నది. ఉపాఖ్యానముల కాకరములు నిర్దేశింపబడినవి.

—శశిధర శర్మ.

## అజంతా సుందరి

గేయ నాటికలు: రచన: శ్రీ పి. నారాయణ రెడ్డి; ప్రచురణ: అరుణ శ్రీ గ్రంథమాల 1870/1 జనరల్ బజార్ సికింద్రాబాద్. వెల రు 0 12.0.

ఈ గ్రంథంలో అజంతా సుందరి, సుగాత్రి, ఋతువుల రాణి అనే మూడు గేయ నాటికలున్నాయి. ఇందు తొలి నాటికలో రచయిత ప్రతిపాదింప దలచిన ప్రధాన విషయం;

'సంయోగమే లేని
సౌందర్యమే మిన్న'—

ఈ 'సంయోగ' శబ్దానికి తగిన అర్థస్ఫూర్తి లేని కారణంగా ఈ పంక్తులు కొంత అయోమయంగా వున్నా

'మాధురి లిప్సయించెదరు
సంభోగ సుఖము
నే వియోగ మాధుర్య లీ
లావిపాక
మనుభవింప వచ్చాడెద'—

ఇత్యాదయః వాక్యస్థితిలో వున్న యితర కవుల ప్రవచనాలను దృష్టిపథానికి తెచ్చుకుంటే శ్రీ నారాయణ రెడ్డిగారి అభిప్రాయ మేమిటో మనకు బోధపడుతుంది. 'సంభోగం లేని సంయోగ వాంఛ' అనేది ప్లాటోనిక్ 'లౌ' అనే పేర పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతియైన వికృత సరుకు. అట్లాంటిది యేమీ వుండదనీ, ఇది హాస్యాస్పదమైన అభిప్రాయమనీ పాశ్చాత్య మానసిక శాస్త్రవేత్తలే యేనాడో దీన్ని కొట్టి పారవేశారు. ఈ భావాన్ని బట్టుకు యింకా మన వారు కొందరు వూగిసలాడుతూ వుండటం చిత్రంగా వున్నది. ఈ భావాన్ని సమర్థించటానికి 'విరహం రసైకస్థాన' మన్న ప్రాచీనాలంకారికుల వాక్యాలను ఉటంకించ యత్నించుచున్నారు. రతి ('రతిర్మనోనుకూలేర్థే మనసః ప్రవణాయితం' — సాహిత్య దర్పణము.) స్థాయీభావంగా లేనిది విప్రలంభం సహితం లేదనే ఆ ఆలంకారికుల వాక్యాలను విస్మరింపజూస్తున్నారు. మానవ స్వభావ మేమిటో అర్థం చేసుకోకుండా అంతర్ముఖులై ఇలాంటి ఊహాగానాలకు దిగితే సాహిత్యానికీ ప్రజానీకానికీ సంబంధం లేకుండా పోతుంది. ఇప్పటికే ఆస్థితి చాలావరకు ఏర్పడిపోయింది.

కళాకారునిలో గాని మరి యే ప్రబోధ్యం పై నాయకునిలో గాని 'రిరంస' ఉండితీరుతుంది. శాస్త్రబద్ధమైన పద్ధతిని దాన్ని ఫలితానికి తెచ్చుకుని జీవిత సాఫల్యం పొందటమెలాగు అని యోజించాలి గాని, కళల ద్వారా ఆ ఆకలి తీర్చుకోటానికి ప్రయత్నించటం అనేక జుగుప్సాకరములైన పరిణామాలకు దారి తీస్తుంది. కళాకారుడు స్త్రీల కుచ జఘనోరు వర్ణనలతో ఈ తాపత్రయం తీర్చుకుని మానవజీవిత మేమిటో అర్థం చేసుకో లేకుండా పోతాడు.

ఇందలి కథ: ఒక కల; ఆ కలలో ఒక శిల్పి ఒక దివ్యసౌందర్య స్త్రీ స్వరూపాన్ని ఊహించుకుంటూ వుంటాడు. ఆ స్త్రీ ప్రత్యక్షమౌతుంది. కవి దానితో కామవాంఛ తీర్చుకోటానికి ప్రయత్నించుతాడు. అది బుద్ధిగాదని చెప్పి అదృశ్యమైపోతుంది.

'సంయోగమే లేని
సౌందర్యమే మిన్న
సృష్టియే తనకు సం
తుష్టిని ప్రసాదించు
ప్రతిఫలము వాంఛించి
బ్రతుకకుము కళాజీవి.'

అని నేపథ్యకంఠ మొకటి శిల్పిని ప్రబోధించుతుంది.

'అంబర గంగా ఫేన
సమున్నత ముక్త నికేతము'—

అని ఆ స్వప్న సుందరిని వర్ణించారు. ఇందు రచయిత అభిప్రాయ మేమిటో గాని బహుచిత్రంగా వుంది.

'సిగ్గు బరువు చేత ఎల
చెమరించెను వోరాణీ!'

ప్రస్వేదమనే సాత్విక భావాన్ని వ్యక్తం చేయ సంకల్పించి రచయిత అశ్లీలస్ఫోరకమైన 'చెమరించు' అనే శబ్దాన్ని వాడి జుగుప్సను కలిగించుతున్నారు. శబ్దజాలాన్ని యేరుకోవటంలో కవి యింకా పరిణతుడు కాలేదనటానికి ఇది ఒక ఉదాహరణ.

రెండవ నాటికను పింగళి సూరన కళాపూర్ణోదయంలోని సుగాత్రీ శాలీనుల ప్రణయగాథను ఆధారం చేసుకుని రచించారు.

ఋతువుల రాణి అనే మూడవ నాటికలో వసంత కాంత శిశిరుని బలాత్కారం నుంచి తప్పించుకుని మాధవుని రాకతో (మధు మాసం రాగానే) అతని పరిష్వంగ సుఖాన్ని అనుభవించి ఆనందించుతుంది: ఇందు కవి ప్రతిపాదించు పరమార్థ మేమీ లేకపోయినా కొన్ని వర్ణనలు హృద్యంగా వున్నాయి.

"ఆకుపచ్చని యీ జిలుగు
కోక సవరించి
కొప్పులో మందార
కుసుమాలు ముడిచి
పంకు మోదుగపూల
దండలల్లేవరకు
ఇంత వేళాయె ప్రియుఁ
డెంతగా వేచెనో!

* * *

ప్రతిపదాన రసవీణలు
పలికించే ప్రియురాలా
ప్రతిదృగంచలాన వలపు
ప్రసరించే జవరాలా
పూల చేల వెంక సారిగ
కేలనందుకొను రావే
నీలి కళ్లలోని రహ
స్యాలు మాటాను రావే—

## శారదార్పణము

పద్యకావ్యం; రచన: శ్రీ ఎన్ని అప్పారావు భాషా సేవక సమితి కంచరవీధి; విశాఖ: వెల రు. 0-8-0.

'పెటుకు మాటలు వాల్గ పేర్చి మాటలు గూర్చు
స్వార్థపరుండు 'ప్రజా కవి'యట
వినదానికే గానివానికే గాన్పము
గుణవిహీనుడు 'కవి కోకిల'మట
అక్షర భేదంబు లరయంగ లేని నీ
రసుడు 'పదకవితా రత్న'మంట
దివ్య శబ్దార్థ సంబంధ మెంచక మీర
మీరు వారికు 'కవిమిత్రు'డంట'

ఇది ఈ కావ్యధోరణి—ఇది విమర్శనమంట— దీనికి శ్రీ గంటి జోగి సోమయాజుల గారి ఉపోద్ఘాతము కలదు.

'కవియొక్క సహృదయంతో రచనయొక్క అంతరార్థమును, గమ్యస్థానమును గమనించుటకు ప్రయత్నించి' శ్రీ లంక సుందరం గారొసంగిన యోగ్యతా పత్రము కూడ నొకటు కలదు!

## భీమేశ్వర శతకము

రచన: శ్రీ వారణాసి ప్రాప్తి స్థానం: వెంకట రామా అండ్ కో ఒంగోలు బ్రాంచి, ఇతర బ్రాంచీలు: వెల రు. 0.8 0.

రచయితకు అటు సంస్కృత శబ్దాలనూ ఇటు తెలుగు శబ్దాలనూ సవ్యసాచిలా చాలనం చేయగల సమర్థత వుంది:

'పటు లాపాథ పయోధిరోదర మహో
దంష్ట్రాగ్రకర్షాన్వవిన్
పటు ఘుంఘుమా పవనా త్రిఘుస్తణ నద
ద్యావ్యాఘ్రఘోషితా నేక హ
స్ఫుట గావమ్ముల, వల్లకీ ముఖుర వి
న్యాస్త్రి స్వరోల్క ప్రపంచున్
నటరాజా! స్తుతియింపలేని కొఱ
న్మన్నించుము భీమేశ్వరా!'

'మాడూళ్లగ్గిని బుగ్గిజేసిన కొరా!
పూవింటివా డెప్పుడో
గావి స్నానం దెల కోలగొట్టవని నీ
క న్నేసి కన్ని పుకన్
మాడ న్నాదిరొయి వర్గినాథ వకటా!
నాకేమి కూర్తింక నీ
తోడన్ రాచిన మేనబూదిక నా
తోడా నో భీమేశ్వరా!

## సుమాంజలి

కథల సంపుటి: ప్రచురణ: నవ్యసాహితీ సమితి: వివేక్ నగర్, చిక్కడపల్లి, హైదరాబాద్. వెల 0–10–0. ఇందుఅయిదుగురు ప్రముఖరచయితల కథలు అయిదువున్నాయి. శ్రీ పాలగుమ్మి రామారావు, శ్రీమతి అత్తిలి స్వరాజ్యలక్ష్మి, శ్రీ సరణి కోట శ్రీనివాసులు, శ్రీ సోమంచి రామం, శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, శ్రీ కందుకూరి లింగరాజు. వివిధ రచయితల వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించుచూవుండటంచేత రచనలు మంచి వైవిధ్యం కలిగి ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి.

## రాగజ్యోతులు

గేయసంపుటి: రచన: శ్రీ రావెళ్ల వెంకట్రామారావు: ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం ఖమ్మంమెట్టు: వెల రు. 0-4-0.

— తె. సూ.

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna,
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor S. Sambhu Prasad.